



తంగిరాల సుబ్బారావు - దుంపా శ్రీరాములురెడ్డి

# శక్తికథాచక్రము
# అంకమ్మ కథలు

సంపాదకుడు
ఆచార్య తంగిరాల వేంకటసుబ్బారావు, M.A., Ph.D.
తెలుగు అధ్యయన శాఖ
బెంగుళూరు విశ్వవిద్యాలయం
జ్ఞానభారతి
బెంగుళూరు—560 056

ప్రకాశకుడు
టి.వి.ఎస్. అవధానులు, B.E.
తంగిరాల పబ్లికేషన్స్
ఎ 109, నవజీవన్ అపార్ట్‌మెంట్స్
జెక్ కాలనీ, సనత్‌నగర్
హైదరాబాదు—500 018
1995

**SAKTI KATHA CHAKRAMU - ANKAMMA KATHALU**

(The Ballad - cycle of sakti and the Ballads of Ankamma)

Collected and edited by : Dr. T.V. Subba Rao, Professor of Telugu,
Bangalore University,
Jnana Bharati, Bangalore-560 056.

Published by : Sri T.V.S. Avadhanulu, B.E.,
Tangirala Publications,
A.109, Navajeevan Apartments,
Sanath Nagar,
Hyderabad - 500 018. pp. x+ 153

First Edition : March 1995

Copies : 1000

Price : Rs.40

Sole Distribution : M/s. Visalandhra Publishing House,
4-1-435 Vignana Bhavan, Bank Street,
Hyderabad-500 001.

Copies can be had from :

M/s.Visalandhra Book House, Hyderabad, Vijayawada, Anantapur, Visakhapatnam, Hanamkonda, Guntur, Tirupathi & Kakinada.

DTP : Compagers DTP Services, Xth Cross,
Mahalakshmi Layout, Bangalore-560 086.

Printing : Sree Laxmi Laser Graphics, Vijayanagar
Bangalore-560 040 Phone :3300093

This book is published with the financial assistance given by Tirumala Tirupati Devasthanam, Tirupati, A.P., under their scheme "Aid to Publish Religious Books".

# అంకితం

తిరుపతిలో
1964-1970 మధ్యకాలంలో
నాకూ నా కుటుంబానికీ
తాను కట్టిన నూతన భవనాలలో వసతిని కల్పించి
ఎంతో గౌరవంతోనూ
ప్రేమతోనూ, భక్తితోనూ
స్నేహసౌజన్యాలతోనూ
మాటలతోనూ, పాటలతోనూ
రాయలసీమ తెలుగు నుడికారపు సొంపులతోనూ
నన్ను అమితంగా ఆకర్షించి
ప్రాణమిత్రులుగా మారిన —
అంకాళమ్మ దేవతను తరతరాలుగా ఆరాధిస్తున్న—
కడపజిల్లా, పులివెందుల తాలూకా
బొజ్జాయపల్లె గ్రామానికి చెందిన
**శ్రీ దుంపా శ్రీరాములు రెడ్డిగారికీ,**
వారి అన్నగారు
**కీ.శే. దుంపా జయరామిరెడ్డి గారికీ,**
వారి తమ్ముడు
**కీ.శే. దుంపా రామిరెడ్డి గారికీ,**
ఈ ముగ్గురు పెదకంటి రెడ్డిసోదరుల
కొడుకులకూ, కూతుళ్ళకూ
మనుమలకూ, మనుమరాండ్రకూ
ఈ పరిశోధన గ్రంథం
సస్నేహంగా అంకింతం ఇస్తున్నాను.....

— తంగిరాల వెంకటసుబ్బారావు

# విషయసూచిక



## ఛాయాచిత్రముల వివరములు

ముఖచిత్రం : అంకాళమ్మ (తిరుపతి)

అట్టవెనుక : 'ఈర్లంకమ్మ' (వీరుల అంకమ్మ)

లేక

'పల్నాటి అంకమ్మ' (కారెంపూడి)

# ముందుమాట

ఈ అంకమ్మకథాచక్రంలో మూడు వీరగాథలున్నాయి: మాచాసపువారి అంకమ్మ కథ, రవద్దేవిరాజుకథ, గంగురాజుకథ. ఈ కథలను పంబలవారు పాడుతూ ఉంటారు. మొదటి రెండుకథలనూ శ్రీ డక్కా దేవదానం అనే పంబలవాడు పాడుతుంటే, 1966 జూలై 26,27 తేదీలలో నెల్లూరు జిల్లా గూడూరు తాలూకాలో, ఊటుకూరు దగ్గర ఉన్న కంచరపాలెం హరిజనవాడలో సేకరించాను. మూడవదైన గంగురాజు కథ తాళపత్రగ్రంథ రూపంలో 1964వ సంవత్సరంలో కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా కుచ్చికాయలపూడి గ్రామంలో శ్రీ కొడాలి సీతారామాంజనేయులు అనే కొమ్ములవాని దగ్గర లభించినది. (కొమ్ములవారు కాటమరాజుకథలు పాడుతారు). ద్విపదలోను, మంజరీద్విపదలోను, ఖండగతిలోనూ సాగే వీరగాథలు జానపద వృత్తిగాయకుల నోళ్ళలో పడి శిథిలమై, ఛందస్సుయొక్క బింకాన్ని కోలుపోయి, కొన్నిచోట్ల వచనంలా సాగిపోయాయి. అయినా వీటిలోని లయను బట్టి, యతిప్రాసలను బట్టి, ఇవి ఒకప్పుడు ద్విపద రచనలని గుర్తింపవచ్చును. మొదటి రెండు కథలను మౌఖిక సంప్రదాయంలో నుండి సేకరించడంవల్ల వీటిలో శైథిల్యం మరింత కొట్టవచ్చినట్టుగా కనబడుతోంది. తాళపత్రగ్రంథ స్వరూపంలో లభించడంవల్ల మూడవదియైన గంగురాజుకథలో అంతశ్శైథిల్యం కనబడదు.

'పరిష్కరణ' పేరుతో ఈ వీరగాథలలోని భాషను మార్చడానికి నేను ఇష్టపడలేదు. జానపదుల ఉచ్చారణను యథాతథంగా ఉంచి వేశాను. చదవడంలో కొంచెం క్లిష్టత ఉన్నా, జానపద భాషను గురించి పరిశోధన చేసేవారికి ఈ వీరగాథల శైలి మిక్కిలి తోడ్పడుతుంది. "కనక రాజేంద్రుడు" "శివఘంటల మహదేవమ్మ" "చుక్కల సూర్యదేవి" మొదలైన

వ్యక్తి నామాలు జానపదుల నోళ్ళలో చిత్ర విచిత్రమైన రూపాలను పొందడం గమనించవచ్చు.

అంకమ్మ కథాచక్రంలోని 'రవద్దేవిరాజుకథ'ను మహాభారతం లోని ఉదంకోపాఖ్యానంతోపోల్చి మహాభారతం కథకన్నా ఈ జానపద వీరగాథ ప్రాచీనమైనదని ప్రముఖ కవి శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు అభిప్రాయ పడ్డారు. దీనిని గురించి వారు ఆంగ్లంలో ఒక మంచి వ్యాసం కూడా వ్రాశారు.

ఈ పరిశోధన గ్రంథాన్ని నా ప్రియమిత్రులు శ్రీ దుంపా శ్రీరాములురెడ్డి గారికీ, వారి సోదరులకు, వారివారి పుత్రపౌత్రులకు— అందరికీ అంకితం చేశాను. దీనికి రెండు కారణాలు ఉన్నాయి: నేను 1963-68 మధ్యకాలంలో వీరగాథలను గురించి పరిశోధన చేసినప్పుడు శ్రీ రాములు రెడ్డిగారు వారి కుటుంబ సభ్యులు నాకు చాలా సహకరించారు. 1964 నుండి 1970 వరకు నేను వారి యింట్లో కాపురం ఉన్నాను. వారి కుటుంబ సభ్యులందరూ మమ్మల్ని ఎంతో ఆదరించారు. శ్రీరాములు రెడ్డిగారు ఎన్నో జానపద కథలకు, పాటలకు సామెతలకు, నుడికారాలకు నిధి. వారి శ్రీమతి కొండమ్మగారు చెప్పిన ఎన్నో పొడుపుకథలను ఆధారంగా చేసికొని నేను "రాయలసీమ మాటుకతలు" అనే వ్యాసాన్ని భారతిలో ప్రకటించాను. వీరి అన్నగారు జయరామిరెడ్డిగారు రాయలసీమలో ఎద్దుల పందాలను గురించి అనేక విషయాలు నాకు చెప్పారు. వీరు కడపజిల్లా మల్యాల గ్రామంలో పాల్గొన్న ఎద్దుల పందెం నేను చూచి ఫోటోలు తీసుకున్నాను. శ్రీరాములురెడ్డిగారి తమ్ముడు రామిరెడ్డిగారు కోడిపందాలలో దిట్ట. ఈయనను సంవేదకుడు (Informant) గా చేసికొని నేను "రాయలసీమ కోడిపందాలు" అనే వ్యాసాలు వ్రాసి వరుసగా ఆంధ్రప్రభ వారపత్రికలో ప్రకటించాను. శ్రీరాములు రెడ్డిగారి

తల్లిగారు కూడా నాకు ఎన్నోపాటలుపాడి వినిపించారు. ఇది మొదటికారణం.

ఈ గ్రంథాన్ని ఈ దుంపా రెడ్డిసోదరులకు అంకితం ఇవ్వడానికి గల రెండవకారణం చాలా ప్రముఖమైనది. అది అంకమ్మ చరిత్రతో ఈ దుంపావారికి గల సాన్నిహిత్యాన్ని తెలిపేటివంటిది. కడపజిల్లాలో చెన్నూరు– కాజీపేట రోడ్డులో 'దుంపలగట్టు' అనే గ్రామం ఉంది. దీని అసలు పేరు 'దుంపాలగట్టు'. ఈ గ్రామాన్ని శ్రీ దుంపా శ్రీరాములు రెడ్డిగారి పూర్వీకులు నిర్మించారు. వారందరూ అంకాళమ్మ భక్తులు. తమ కుల దేవతయైన అంకాళమ్మ పేరుతో ఒకగుడి కట్టి, దాని చుట్టూ ఆమె పేరుతోనే ఒక గ్రామాన్ని నిర్మించాలని వారు తలపెట్టారు. అలాగే, దేవాలయ నిర్మాణం, గ్రామ నిర్మాణం పూర్తి చేశారు. కాని గ్రామం పేరు అంకాళమ్మ పేరుతో ఉంటే ఆ ఊరు వృద్ధిలోకి రాదనీ దుంపావారి పేరు పెడితే మంచిదనీ జ్యోతిష్కులుచెప్పారట. అందువల్ల ఆ గ్రామానికి 'దుంపాలగట్టు' అనే పేరు పెట్టారట. (అది కాలక్రమాన 'దుంపలగట్టు' గా మారింది). ఈ ఊళ్లో ఉన్న అంకాళమ్మ గుడిదగ్గర ప్రతి సంవత్సరం అంకాళమ్మ జాతర గొప్పవైభవంగా జరుగుతుంది.

తరువాతి కాలంలో దుంపావారు పులివెందుల తాలూకాలోని 'బొజ్జాయ పల్లె' గ్రామానికి వచ్చారు. ఈ గ్రామం ప్రక్కనే ఉన్న 'గూడూరు' లో అంకాళమ్మ గుడివుంది. అందువల్ల దానికి 'అంకాళమ్మ గూడూరు' అనే పేరు వచ్చింది. ఇక్కడ చైత్రమాసంలో పున్నమి నుండి అమావాస్య వరకూ గొప్ప తిరునాళ్ళు జరుగుతాయి. ఈ అంకాళమ్మకు 'కుంకుమబండి' చేయించడం కోసం కీ.శే. దుంపా జయరామిరెడ్డిగారు కొంత భూమిని (రెండెకరాలు) దానం చేశారు.

ఈ గ్రంథాన్ని ప్రకటించడానికి ఆర్థిక సహాయంచేసిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికీ –

ప్రోత్సాహించిన మిత్రులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారికీ, ఆచార్య నాయని కృష్ణకుమారి గారికీ, శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారికీ, అష్టావధాని శ్రీ ఆశావాది ప్రకాశరావుగారికీ, డా. కలువగుంట రామమూర్తిగారికీ ––

అంకితం పుచ్చుకొనేందుకు అంగీకరించిన శ్రీ దుంపా రాములురెడ్డిగారికీ, వారి కుటుంబ సభ్యులందరికీ –

దీని శుద్ధప్రతిని సిద్ధం చేసిన డా. కొలకలూరి ఆశాజ్యోతిగారికీ – ముద్రించడంలో సహకరించిన శ్రీ కె. భీమేశ్వరరావు గారికీ –

అందరికీ నా కృతజ్ఞతలు...

బెంగుళూరు – **తంగిరాల వెంకటసుబ్బారావు**
27.3.1995

# శ్రీ దుంపా శ్రీ రాములు రెడ్డిగారి వంశ వృక్షం



## మారాసపు రాజవంశము ( అంకమ్మ కథాచక్రము ననుసరించి)

దేవాధి దేవరుద్రుండు ( భార్య : దేవరుద్రులగంగ)

దేవీజలబ్రాహ్మణుడు

ధర్మ సూడానిరాజు
( భార్య : పద్మనందుల భాగీరథమ్మ)

అల్లానిరాజు

బల్లానిరాజు

అనుపద్మరాజు

కల్యాణరాజు

కనక సోమరాజు

వీర సోమరాజు

కొమ్మరాజు

అలరాజు
(పల్నాటియుద్ధము)

ధర్మ సూడానిరాజు సంతానము:

రాజారపద్దేవిరాజు
( భార్య : ఉత్తరపు నలగంగ)

కనకరావేంద్రుడు
( ఇతనికి ఏడుగురు కొడుకులు)

( కూతురు)
శివగంటల మహాద్దేవమ్మ
( భర్త : శివన్న మహాద్దేవిరాజు)
( వీరికి ఏడుగురు కుమార్తెలు)
పెద్ద కూతురు : చుక్కలసూరద్దేవి

రాజారపద్దేవిరాజు సంతానము:

కల్యాణపు గంగురాజు
( భార్య : చుక్కల సూరద్దేవి)

మద్దె భూపతిరాజు

కరణము గంగురాజు

# శక్తి కథాచక్రము

# అంకమ్మ కథలు

తెలుగు సాహిత్యమందలి సాంప్రదాయక వీరగాథలు మూడు ప్రధాన భాగములుగా విభజింపదగియున్నవి: 1. వీరగాథా చక్రములు 2. వీరగాథలు 3. వీరగాథానికలు. శక్తికథలు, పలనాటివీరులకథలు, కాటమరాజు కథలు, వెలకంటి వీరుని కథలు మున్నగునవి వీరగాథా చక్రముల కుదాహరణములు. బొబ్బిలి కథ, దీని వరుసలోగల ఇతర కథలు, హరిహరీ పదములు, శారద పదములు, జంగము కథలు మొదలుగునవి వీరగాథలు. గుత్తాల గోపిరెడ్డి పాట, మానందిరెడ్డి పాట, బుడ్డా వెంగళరెడ్డి పాట — ఇత్యాదులు వీరగాథానికలు లేక లఘువీరగాథలు.

శక్త్యారాధనమున కంకురారోపణము వేదములలోనే కనిపించును. ఋగ్వేదములో 'శక్తి' సర్వమహాశక్తుల సమాహార మూర్తిగ నభివర్ణితమైనది. అనంతరము కేనోపనిషత్తులో దేదీప్యమాన విగ్రహయగు 'ఉమా' రూపమున ఆమె మనకు దర్శనమిచ్చును. పురాణములలో శ్రీకృష్ణుని సోదరియగు 'మహామాయ'గా వర్ణితయై, వైష్ణవమతముతో కూడ సంబంధము కల్పించుకొన్నది. శైవమతానుసారము శక్తి శివపత్ని. కాలక్రమమున సర్వజగన్మాతగా శక్తి నారాధించు నాచారము ప్రబలినది. శక్తియొక్క వివిధ స్వరూపములలో భయంకర స్వరూపిణియగు కాళీమూర్తి బహుళ ప్రచారములోనికి వచ్చినది. పర్వతాధిదేవతయగు 'దుర్గ' గాను, సౌందర్యపరసీమయగు లలితగాను కూడ శక్తి ఆరాధితయగుచున్నది. శక్తిని ఎవ్వరేవిధముగ నారాధించినను, ఎప్పుడును స్త్రీమూర్తిగనే ఆరాధింతురు. శాక్తేయ మతమునకు 'తంత్రములు' ఆధార గ్రంథములు.[1]

1. శ్రీమతి సరస్వతీ చెన్నకేశవన్, విజ్ఞాన సర్వస్వము, సంపుటి 7, పుట

శక్తులు అనంత విధములు. ఇవన్నియు ఆదిశక్తిలో నుండి వచ్చినవనుట సాధారణ సూత్రము. వేదములో "ఏకంసత్ విప్రా బహుధా వదంతి" అనినట్లు ఒక శక్తి బహురూపములలో బహునామములలో భావింప బడుచుండును. కొందఱకు లలితమూర్తి లిష్టమగుదుచో ప ఱి కొందఱ కుగ్రమూర్తులిష్టము. "అతీవ సౌమ్యం లలితేతి శబ్దం, ప్రచండ చండీతి పదంచ భీమం" అని కావ్యకంఠగణపతి ముని — ఒకే శక్తి లలిత భీమ రీతులుగా బలుకబడు చుండునని వ్రాసెను.

అణిమాదికములైన అష్టసిద్ధులు ఉన్నత శక్తులు. ఇవన్నియు ఘోరతపస్సు చేసినగాని లభింపవు. కొద్దిపాటి సాధనతో, అదియును నీచములగు మద్యమాంసాదుల సహాయముతో, అల్పతంత్రముల సహాయముతో — ఇతరుల కపకారము చేయుటకును, చిన్న చిన్న ప్రజ్ఞలు ప్రదర్శించుటకును సాధించెడి వానిని 'క్షుద్రశక్తు'లందురు. (సామాన్యముగా 'క్షుద్ర' మనెడిది నీచార్థము వాడబడుచున్నది. అంతకన్న ఈ శబ్దమును అల్పార్థమున భావించుట సముచితము.)

స్తంభన, విద్వేషణ, ఉచ్చాటన, భ్రామణ, ఉత్పాదన, మారణాది క్షుద్రశక్తులను గూర్చి అన్ని మంత్రశాస్త్రములలోను ప్రస్తావింపబడినది. ఇవికాక, దేశమున నొక మహత్తర కార్యము కొఱకు ప్రాణము వదలిన వ్యక్తులు దేవతలై వెలయుచుందురు. రేణుక అట్టి వారిలో నొకతె. కావ్యకంఠగణపతి ముని తన 'ప్రచండచండీ త్రిశతి' లో రేణుకను భిల్లకాంతగా వర్ణించినాడు.

శ్లో : గుంజాఫలా కల్పిత చారుహారా
శీర్షేశిఖండం శిఖినో వహంతీ
ధనుశ్చ బాణాన్, దధతీ కరాభ్యాం
సారేణుకా వల్కల భృద్ విచింత్యా.

(తలయందు నెమలి పింఛము, మెడలో గురివెందల దండ, చేతులలో ధనుర్బాణములు గల వల్కల ధారిణియైన రేణుక ధ్యానింప దగినది).

రేణుక మంత్రశాస్త్రములో ఉత్తమ దేవతగా పొగడ బడినది. భయంకర మూర్తులైన కాళీ, బగళా, చండికా, మాతంగీ — మొదలైన దేవతలు మంత్రశాస్త్రములలో నుత్తమ తపోమార్గములలోను, క్షుద్ర సాధనములలోను, రెండింటిని గాన్పింతురు. కాని మంత్ర తంత్రములు మాత్రము భిన్నములు. ముఖ్యముగా సాధనా పద్ధతులలో భేద మెక్కువ. దక్షిణాచార మార్గములో యమ నియమములు, శుద్ధత, ఆచారము ప్రధానము. వామాచార మార్గములో 'పంచమకారములు' — అనగా మద్యము, మత్స్యము, మాంసము, మైథునము, ముద్ర — ప్రధానము. గమ్యమొక్కటే యైనను అనుసరణ మార్గములు వేఱు. ఉత్తమ సాధకునకు దేవతా సాక్షాత్కారము, జన్మరాహిత్యము మొదలగునవి ముఖ్యము కాగా, క్షుద్రసాధకునకు సిద్ధులు, లోకములో వాని ఉపయోగములు ముఖ్యము.

శక్తిపూజ యెంత కాలముగా నున్నదో చెప్పుట కష్టము. ఆర్యుల అగ్ని సూర్యాద్యుపాసనలకంటె. ప్రాచీన జాతుల శక్తిపూజ ముందరిదని చారిత్రకులు భావించుచున్నారు. వైదిక వాఙ్మయములో తంత్రములు బయలుదేరునాటికి శక్తిపూజ మిక్కిలి ప్రచారములోనికి వచ్చినది.

లలిత, చండిక, దుర్గ, — మొదలైనవి వైదిక దేవతలు. మంత్ర తంత్ర జప హోమాది ఉపాసనా పద్ధతులు వీని ఆరాధనా మార్గములు. ఎల్లమ్మ (రేణుక), పోలేరమ్మ, ముత్యాలమ్మ, గంగానమ్మ, కాకతమ్మ, మాహూరమ్మ, అంకమ్మ మొదలుగనవి క్షుద్రదేవతలు. మద్యము బలి మున్నగు వానితో నివి తృప్తి వహించును. ఈ క్షుద్ర శక్తులు, వీని పద్ధతి తెలిసి చేసినచో త్వరగా సిద్ధించును. కాని, యెంతయో నిగ్రహమున్న దప్ప, వీనివలన మానవుడు పతనము చెందెడి అవకాశములు హెచ్చు. అందువలన దివ్యత్వమునకు ప్రయాణము చేసెడి మానవుడు ఉత్తమ శక్తుల నుపాసింపవలెను.[2]

2. శక్తిపూజను గుఱించిన విశేషములను దెల్పిన మిత్రులు డా.ప్రసాద్‌రాయ కులపతిగారికి మిక్కిలి కృతజ్ఞుడను.

జానపదులలో క్షుద్ర శక్త్యారాధనమే హెచ్చు. ఈ దేవతలను 'గ్రామదేవత' లందురు. 'అంకమ్మ, అంకాలమ్మ, అంకు, ఎఱ్ఱపోతమ్మ, ఎల్లమ్మ, కొండమ్మ, గంగమ్మ, గంగమ్మ, గంగానమ్మ గంటలమ్మ, పల్లకమ్మ, పళ్ళాలమ్మ, పుట్టాలమ్మ, పెద్దింటమ్మ, పైడమ్మ, పోలక, పోలకమ్మ, పోలేరమ్మ, పోలేరు, మారి, ముత్యాలమ్మ, మొగదారమ్మ' — మున్నగునవి మన ఆంధ్ర దేశమున పూజింపబడుచున్న కొన్ని ప్రధాన గ్రామదేవతలు. ఈ క్షుద్రశక్త్యారాధనమున గ్రామీణులు, జాతరులు, బలులు జరుపుచుందురు. ఈ జాతరలోనే ఆయాశక్తుల మహిమలను దెల్పు కథలు గానము చేయబడును. ఇట్టి శక్తి కథలలో ఎల్లమ్మకథ, పోలేరమ్మ కథ, మాతపురాణము, మాతంగికథ, ముత్యాలమ్మకథ, మాహూరమ్మకథ (మావురమ్మకథ), చౌడమ్మ పాటలు, కాకతమ్మ కథ, గంగానమ్మ కథ, పుట్టాలమ్మ కథ, మొదలగునవి కలవని తెలియుచున్నది. రేణుకకు జానపదులలో ఎల్లమ్మ యని వ్యవహారము. 'మాహూర'మను గ్రామమున వెలసి యుండుటచే నీమెకు 'మాహూరమ్మ' (మావురమ్మ) అనియు పేరువచ్చినది. ఈ రేణుకయే ఓరుగంటిలో 'ఏకవీరాదేవి'గా వెలసినది. 'ఏకవీరాంబకథ' యను వీరగాథయు గలదు.

కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, వారి ననుసరించి వారి శిష్యులు ఆచార్య తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారును శక్తి కథలకొక పట్టిక నిచ్చిరి.[3] "మాత పురాణము, పరశురామ రామాయణము, గౌతమ పురాణము, మఱ్ఱిచెట్లకథ, రేణుక యుద్ధము, కాకతమ్మ కథ, అంకమ్మ కథ, గంగానమ్మ కథ, మాతంగి కథ" అనునవి వీరిచ్చిన పట్టికలో గలవు. ఈ పట్టికలో నొకే కథను త్రిప్పిత్రిప్పి నాలుగు కథలుగా జెప్పిరి. 'పరశురామ రామాయణము, గౌతమ పురాణము' అను రెండును ఒక్కటే.

ప్రభాకరశాస్త్రిగారి పట్టిక శృంగార శ్రీనాథుమున కలదు. తిమ్మావఝ్ఝలవారి పట్టిక ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచిక(1953-54 పుట33 లో గలదు.

ఇది గాథా వృత్తము (Ballad-cycle). 'మఱ్ఱిచెట్లకథ, రేణుక యుద్ధము' అనునవి యీ గాథావృత్తములోని కొన్ని వీరగాథలు. వీరిచ్చిన పేర్లు కూడ జానపద వ్యవహారమునకు భిన్నముగా నున్నవి. 'పరశు రామాయణ' మనుట సమంజసము కాని 'పరశురామ రామాయణ' మనుట సరికాదు. ఉలిచి భావజ్ఞుఁడ కవి రచించిన ద్విపదకావ్యము గూడ 'పరశురామాయణ' మనియేచెప్పబడినది. (చూ. మద్రాసు ప్రా. లి. పు. భాం. లోని తాళపత్ర ప్రతి. డి. నెం. 1110). అట్లే 'గౌతమ పురాణ' మనుటయు సమంజసముకాదు. జానపద సంప్రదాయమున పరశురాముని పితామహుడు 'సత్యగౌతుడు'. ఆ సత్యగౌతునితో ఈ పురాణము ప్రారంభింపబడునుగాన దీనికి 'గౌతుపురాణ' మని పేరు. కావున 'గౌతు' శబ్దమే జానపద వ్యవహారమున సరియైనది. 'గౌతమ' శబ్దము పండితసృష్టి. ఒకవేళ, ఈ 'గౌతమ' శబ్దమే సాధువనియు, నిది జానపదులలో భ్రష్టమైన దనియు దలతుమన్న, శిష్టవ్యవహారమున పరశురాముని పితామహుడు, 'ఋచీకుడు' కాని, గౌతముడుకాడు. పైగా, ఈ 'గౌతమ పురాణము' పరశురాముని వృత్తాంతమునే తెల్పుచున్నదికాని, అహల్యా గౌతముల వృత్తాంతమును తెల్పుటలేదు. కాబట్టి జానపదుల 'గౌతు' శబ్దము శిష్టుల వ్యవహారమునయున్న 'గౌతమ' శబ్దముకంటె భిన్నమైనదని నాయభిప్రాయము.

ఆచార్య కోదండరామయ్యగారివలెనే శ్రీపాద గోపాలకృష్ణ మూర్తిగారును 1953 డిశంబరునెల 'కిన్నెర'లో నొక శక్తి కథల పట్టిక నిచ్చిరి: "మాహూరమ్మ కథ, మాత పురాణము, గౌతమ పురాణము, మఱ్ఱిచెట్ల కథ, రేణుక యుద్ధము, కాకతమ్మ కథ, అంకమ్మ కథ, గంగానమ్మ కథ, మాతంగి కథ, కామేశ్వరిపాట, పరశురామ పురాణము." శ్రీపాద వారిచ్చిన యీ పట్టికలో ఎల్లమ్మ కథ చర్విత చర్వణమైనది. వీరుకూడ 'గౌతుపురాణము'న 'మ' అను నక్షరమును జేర్చిరి. పరశురామాయణమును 'పరశురామ పురాణ' మనిరి. వీరు చెప్పిన వానిలో 'మాహూరమ్మ

కథ, గౌతమపురాణము, పరశురామ పురాణము' అను మూడు కథలును ఒక్కటే. దీనిని 'పరశురాముని కథాచక్రము' లేక 'ఎల్లమ్మ కథా చక్రము' అని పిలువవచ్చును. శ్రీపాదవారు తెల్పిన 'మఱ్ఱిచెట్టు కథ', 'రేణుకయుద్ధము' అనినవి పై గాథా చక్రములోని అంతశ్శాఖలు. అట్లే 'మాతపురాణ' మన్నను, కాకతమ్మ కథ అన్నను ఒక్కటే.

పైన చర్చించిన శక్తికథలలో "ఎల్లమ్మకథలు, అంకమ్మకథలు, పోలేరమ్మకథ, ఎల్లమ్మకథ ( తెలంగాణాప్రతి), ఏకవీరాంబకథ (తాళపత్ర గ్రంథము), చౌడమ్మ పాటలు" — అనునవి నాకు లభించినవి. 'మాతపురాణము', 'మావూరమ్మకథ', ఉలిచి భావజ్ఞుడు రచించిన 'పరశురామాయణము' మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునగలవు. (చూ. ఆర్. నెం. 693, 694; డి. నెం. 1110, 1111). 'కాకతమ్మకథ' వరంగల్లు మండలమునను, ముత్యాలమ్మకథ నల్లగొండ మండలమునను, 'జాలమ్మకథ' ఒంగోలు తాలూకాలోను,'ఆరంజోతికథ' చిత్తూరు మండలమున కాళహస్తి తాలూకాలోను వ్యాప్తియందున్నట్లు తెలిసినదికాని, దేశద్రిమ్మరులగు ఆ గాథాకారులను బట్టుకొనుట నాకశక్యమైనది. కృష్ణామండలమున నాకు లభించిన 'ఏక వీరాంబకథ' అను తాళపత్ర గ్రంథమున 'రేణుకా కల్యాణము', 'గిరిరాజయుద్ధము' అను రెండు వీరగాథనున్నవి. 'రేణుకా కల్యాణము'నకు 'రేణుక రాయభార' మనియు బేరు. రాజకీయ సంబంధమగు సామరస్యమును నెఱపు కార్యమునకేకాక, పెండ్లి సంబంధమును కుదుర్చుపనికిగూడ "రాయబారము' అని పిలుచుట జానపదులలో పరిపాటి. దీనిని "పెండ్లి రాయబారము" అందురు. పల్నాటివీర కథలలో మొదటి కథకు "పెద్దన్న పెండ్లి రాయబారము" అని పేరు. కాబట్టి 'రేణుక రాయబార' మనంగా 'రేణుక కల్యాణ' మనియే అర్థము. 'గిరిరాజ యుద్ధము'నకు 'రేణుకయుద్ధ'మని నామాంతరము. గిరిరాజు రేణుక తండ్రి. ఇతుడు రాక్షసులతో

జేసిన యుద్ధమున నలసిపోయి మూర్ఛనొందును. అప్పుడు రేణుక. తన తండ్రికి సహాయముగావచ్చి రాక్షసులను సంహరించును. అందుచే నీ 'గిరిరాజ యుద్ధము' నరు 'రేణుకయుద్ధ'మని పేరువచ్చినది.

ఇంక పోగా, 'మఱ్ఱిచెట్లకథ, గంగానమ్మకథ, మాతంగి కథ' — అను మూడు కథలును నేను సంప్రదించిన జానపదులలో నెవరి యొద్దను వినబడలేదు. అంతమాత్రమున నివి దేశమున లేవని చెప్పుట సరికాదు. వీనిని గూర్చి యింకను శోధింపవలసియున్నది. గౌతుపురాణమున మొదటవచ్చు యాదవమఱ్ఱిని గూర్చిన కథయే 'మఱ్ఱిచెట్లకథ' యగునని నేను ఊహించుచున్నాను. 'గంగానమ్మ' యాదవుల కులదైవమగు గంగయేయగుచో, కాటమరాజు కథాచక్రములోని 'గంగతర్క' మను కథయే 'గంగానమ్మకథ' కానోపును. పెండ్లి పెడాకులు లేని స్త్రీని మాతంగి యందురు. పోలేరమ్మ కథలో ఆమె అవివాహిత యగు ఈశ్వర పుత్రిగా తెలుపబడినది కాబట్టి పోలేరమ్మకథయు మాతంగికథయు అభిన్నములు కావచ్చును.

'కామేశ్వరికథ' కూడ పై శక్తిజాతికి జెందినను ఇది నేడు 'అక్కలపాట' యను స్త్రీల పాటగా మాత్రమే లభించుచున్నది. జానపదులు పాడు వీరగాథగా గానవచ్చుటలేదు. స్త్రీల పాటలు జానపద కవిత్వము కానేరవు. అగ్రవర్ణములకు జెందిన జాతిదేశి కవిత్వము. మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున వేటూరి భావనామాత్యుడు రచించిన 'కామేశ్వరీచరిత్ర' మను ద్విపదకావ్యమొకటి కలదు. (కాగితపు ప్రతి డి. నెం.1045). కామేశ్వరికథను దెల్పు 'ఆదిలక్ష్మీ విలాస' మను పద్యకృతియు మఱియొకటి కలదు. (డి.నెం.388) ఈ కామేశ్వరి కథయే క్రీడాభిరామమున జక్కుల పురంధ్రీ పాడిన 'కామవల్లీ మహాలక్ష్మీ కైటభారి వలపు'. జక్కులు పాడెడి పాట నేడు లభించుటలేదు. 'అక్కెమ్మపాట' యను పేర రాయలసీమ జానపద స్త్రీలలో

నొక లఘుకథాగేయము ప్రచారమునకు నున్నదిగాని, దీని యితి వృత్తమునకును కామేశ్వరికథకును, ఏ విధమగు సంబంధమును లేదు. మొత్తముపై కామేశ్వరికథ నేడు అగ్రవర్ణముల స్త్రీలపాటగా లభించుచున్నదే గాని, జక్కులవంటి జానపద గాయక భిక్షువులు పాడు వీరగాథగా లభించుటలేదు.

'పోచమ్మ', 'మైసమ్మ', 'బాలమ్మ' — అనునవి కూడ జానపదులు పూజించు క్షుద్రశక్తులే. తెలంగాణమున వ్యాప్తియందున్న ఎల్లమ్మ కథలో ఆమెకు తండ్రియగు గిరిరాజు 'మైసమాపురము' సరణముగా నిచ్చెనని కలదు. కాబట్టి మైసమ్మ యను పేరుకూడ ఎల్లమ్మకే వర్తించునని భావింప వచ్చును. మొత్తముపై శిష్టసాహిత్యములో జమదగ్ని భార్యయగు రేణుక జానపదులలో బహునామములతో వ్యవహరింపబడుచున్నదని చెప్పవచ్చును. "ఎల్లమ్మ, ఎల్లారమ్మ, మాహారమ్మ, మాపురమ్మ, మాపురాల యెల్లమ్మ, ఏకవీరాంబ, ఏకవీర, మైసమ్మ" అను పేర్లు జానపద వ్యవహారమున గలవు. 'రేణుక' యను నామముకూడ నచ్చటచ్చట కాననగును. ఈ నామము లన్నింటిలోను 'ఎల్లమ్మ' నామము మిక్కిలి ప్రసిద్ధము. కాకతమ్మను గూడ ఎల్లమ్మగా భావించు విమర్శకులున్నారు. కాని కాకతమ్మకు సైదోడు ఏకవీర అను క్రీడాభిరామ పద్యపాదమునుబట్టి ఈమె కాకతమ్మ కంటె భిన్నమైనదని ప్రభాకరశాస్త్రిగారు తీర్మానించిరి. 'మాత పురాణ' మను కథలో కాకతీయ రాజుల చరిత్ర వచ్చుటచే ఈ 'మాతపురాణము'నే కాకతమ్మ కథగా భావింపవలసియున్నది.

పైన తెల్పిన శక్తికథలలో నాకు లభించిన వానిలో 'ఎల్లమ్మ కథలు', 'అంకమ్మ కథలు', ప్రత్యేక వీరగాథా చక్రములుగా నేర్పబడియున్నవి. చౌడమ్మ పాటలు కూడ వీరగాథా చక్రమేకాని, యిందలి కథలకొక వరుస క్రమము కానరాదు. అందుచేను ఇవి లఘువీరగాథలే కాని, సాధారణ వీరగాథలు కావు. (కాని 1972 ప్రాంతములో బెంగుళూరులో తొగటి వీరులను యాచించెడి

ఒక కొమ్ములవాని కథ చౌడుపురాణమను తాళపత్రగ్రంథమును చూచితిని. అవి ద్విపద కావ్యము కావున ఇది కూడ వీరగాథాచక్రమే) పోలేరమ్మకథ విడికథయే. మాతపురాణము అసమగ్రముగా లభించుటచే అది గాథావృత్తమో లేక విడిగాథయో చెప్పలేము. తక్కినవి అలభ్యములు కావున అవి ప్రత్యేకగాథలో లేక గాథావృత్తములో తెలుపుటకు వీలుపడదు. పైన తెల్పిన వివిధశక్తులన్నియును ఆదిశక్తి నుండి పుట్టినట్టివే కావున, మొత్తము శక్తి కథలన్నియును స్థూలముగా నొకేగాథ వృత్తముగా భావింపనగును. ఈ మూలగాథా వృత్తములో 'ఎల్లమ్మ కథాచక్రము, అంకమ్మ కథాచక్రము, చౌడమ్మ కథాచక్రము' అనునవి అంతఃశ్శాఖలని చెప్పవచ్చును. మాతపురాణము, పోలేరమ్మ కథ, అరంజ్యోతికథ, — ఇత్యాదులితర శక్తికథలు.

కాటమరాజు కథలుకూడ నొక విధముగా బరిశీలించినచో శక్తి కథలే యని చెప్పవలెను. అందలి ప్రధానదైవము గంగమ్మ. ఈమె కృష్ణుని సోదరియగు మహామాయ యని 'కంసుడుకథ' అను వీరగాథలో దెలుపబడినది. ఈమెకూడ శక్తి స్వరూపిణియే. అందుచే ఈమెను గొల్చిన యాదవరాజుల కథలు కూడ శక్తికథలే కావలెను. కాని యాదవ రాజుల కథలకు 'గంగమ్మకథ'లను పేరు జానపద వ్యవహారమునలేదు. వీనికి 'కాటమరాజుకథ'లనియే వాడుక. కాటమరాజు క్రీ.శ.13 వ శతాబ్దమున నివసించిన చారిత్రక పురుషుడు. అందుచే ఈ కథలను వేఱుగా విభజింప వలసివచ్చినది.

## అంకమ్మ కథాచక్రము

ఇందు 'అంకమ్మ' లేక 'అంకాళమ్మ' అను శక్తిని గొలిచిన 'మాదాసపురాజుల' కథలు మూడున్నవి. 1. మాదాసపు అంకమ్మకథ, 2 రవద్దేవి రాజుకథ, 3 కల్యాణపు గంగురాజు కథ. ఈ మూడు కథలకును 'అంకమ్మ పొంగె'మను వ్యవహారమున్నదని తెలియుచున్నది.( పరశురామని కథలకు 'గొతుపురాణ'మను

పేరున్నట్లుగనే). ఇవి చారిత్రక వీరగాథలు. కల్యాణము నేలిన పశ్చిమ చాళుక్యులకు సంబంధించిన వీరగాథలుగా గన్పట్టు చున్నవి. రవణ్ణేవిరాజు, గంగురాజు, మున్నగు మారాసపువారు కొలుచుటచే నీ యంకమ్మకు 'మారాసపు అంకమ్మ' అని పేరు వచ్చినది. ఇంకను మఱిరెండు రకముల అంకమ్మలున్నారు. 1. 'పల్నాటి అంకమ్మ' లేక 'వీరుల అంకమ్మ' — పల్నాటి వీరులలో కొమ్మరాజు కొలిచిన అంకమ్మ. ఈమె గుడి కారెంపూడిలో గలదు. ఈమెను జానపదులు 'ఊర్లంకమ్మ' అందురు. 2. 'బయట అంకమ్మ' — ఈమెను ఇంటిలో నుంచరు. ఊరి బయట నుంచెదరు. కాబట్టి అంకమ్మలు మొత్తము ముగ్గురు: మారాసపు అంకమ్మ, పల్నాటి అంకమ్మ లేక వీరుల అంకమ్మ, బయట అంకమ్మ — ప్రకృత కథాచక్రము మొదటి విధమగు అంకమ్మకు సంబంధించినది. పల్నాటి అంకమ్మను గూర్చినకథ పల్నాటి వీరకథలలో వచ్చును. కొమ్మరాజు యుద్ధమునకు ముందు 'అంకమ్మ పుట్టుక'ను గూర్చిన కథను జెప్పెదురు.

ఈ పల్నాటి అంకమ్మ కూడ మారాసపు అంకమ్మ నుండి యేర్పడినట్టిదే. అంకమ్మ కథలకును, పల్నాటి వీరకథలకును దగ్గఱ సంబంధమున్నది. అంకమ్మను గొలిచిన మారాసపురాజులు ఏడుగురన్నదమ్ములు. వారిలో చివరివాడు 'వీరసోమరాజు'. ఇతడు పల్నాటి వారితోగలసి పోయినాడు. తనకూతురు సిరాదేవిని పెదమలిదేవరాజునకిచ్చి వివాహము చేసెను. ఈ వీరసోముని పుత్రుడే కొమ్మరాజు. ఇతడు తనతోబాటుగా తన కులదైవమగు అంకమ్మను గూడ పల్నాటికి దెచ్చినాడు. ఈమెయే 'పల్నాటి అంకమ్మ' లేక 'వీరుల అంకమ్మ'. ఇది చారిత్రక సత్యము కూడ.

ఈ అంకమ్మ కథలను బాడువారు అయ్యగారి దర్శనమునకు జెందిన మాలలు. వీరిని పంబలవారు అందురు. వీరు వాయించెడి పంబజోడును బట్టి వీరికీపేరు వచ్చియుండును. పంబజోడు,

తిత్తి, కత్తి, జమజాల (కైజారు) — అను వానితో ఈ కథను పాడుదురు. కథకుని కుడిచేతిలో కత్తి, ఎడమచేతిలో జమజాల ఉండును. వంతలు పంబజోడును వాయించుచు తిత్తిపట్టుదురు.

అంకమ్మను అన్ని వర్ణముల వారును గొలిచెదరు. పల్నాడులో బ్రాహ్మణులు, కమ్మవారు; నెల్లూరు మండలమున పట్టుసాలీలు, ఓరుగంటి రెడ్లు, కుమ్మర్లు; ఉత్తరాదిని భోగమువారు, గమళ్ళ, బలిజ, శూద్ర చాకళ్లు, మాలలు, ముత్రాసులు మొదలగు వర్ణములవారు అంకమ్మను కొలిచెడి వారిలో ప్రధానులు.

అంకమ్మ పాంగెములోని మూడు కథలను బట్టి మారాసపురాజుల వంశ క్రమమిట్లున్నది. (చూ. ప్రక్కపుట)

అంకమ్మ యేడుగురుఅప్ప చెల్లెంద్రతో పుట్టినదట. 'అంకమ్మ, పోలేరమ్మ, మాలక్ష్మమ్మ, కనకదుర్గమ్మ, బంగారమ్మ, గంగమ్మ, కూనలమ్మ' — వీరేడ్గురును అక్కసెల్లెంద్రు. ఇందు కూనలమ్మకు నూర్గురు బిడ్డలట. శక్తులన్నియు నభిన్నములగుటచే కాబోలు అంకమ్మ కథలలో మధ్యమధ్య అంకమ్మ రేణుకగా స్తుతింపబడు చుండును. ఇదియును గాక, రాయలసీమలో ఎల్లమ్మ కథలు పాడెడి ఆసాది వారిలో కొందఱు అంకమ్మ కథలను గూడ పాడుచున్నట్లు తెలియుచున్నది.

ఈ అంకమ్మ కథలను పాడుటలో పంబలవారు నలుగురుందురు. ఒకడు కథకుడు, తక్కిన ముగ్గురును వంతలు. ఈ వంతలలో నొకడు పంబజోడును వాయించును. మఱియొకడు తిత్తి యూదును. వేఱొకడు 'ఆ' కొట్టును. పంబజోడు తాళమును, తిత్తి శ్రుతిని సమకూర్చును. కథకుని కుడిచేతిలో పెద్దపొడుగుపాటి కత్తి యుండును. ఎడమచతిలో జమజాల అనెడి కైజారుండును. ఈ కథకుని వేషమొక రాజకుమారుని వేషమువలె నుండును. కాళ్ళకు గజ్జెలు. నెత్తికి తలపాగ, దానికిరుప్రక్కల రెండు చంద్రవంకలు, కలికితురాయి,

'డాలుగుడ్డ' ( ఎడమభుజము మీదనుండి వేసికొను వలెవాటునకు 'డాలుగుడ్డ' అనిపేరు), షరాయి (సన్నని ప్యాంటువలె నుండును), నుదుటిపై కుంకుమతో నడ్డబొట్టు ధరించును. ఈ కథకుడు లయాను సారముగా గంతువేయుచు, చేతిలో పెద్ద కత్తిని త్రిప్పుచు, జమజాలపై దానిని కొట్టి మ్రోగించుచు, వీరావేశముతో కథను పాడుచుండును. ఈ పాట మూడు విధములుగా సాగును: శోకము, మాటలు, వర్ణము. పాట మిక్కలి దీర్ఘాలాపనతో శోకరసముట్టిపడునట్లుగా పాడుట 'శోకము'. మాటలనగా వచనమని యర్థముకాదు. ద్విపదనుగాని లేక ఖండగతి రచనను గాని రాగము లేకుండ భావగర్భితముగా చదువుటను 'మాటలు' అందురు. శోకాలాపన యందున్నంత దీర్ఘముతోగాక, కొంత ఉద్రేకముతో పాడుటను 'వర్ణము' అందురు. ఇది శోకమునకును మాటలకును మధ్యస్థమగు పద్ధతి. వంతమెడలో వ్రేలాడు పంబజోడులో నొకటి తొడలపై నెక్కి యుండును. తొడలకానుకొనియున్న పంబ తక్కువ శ్రుతిలోను, దానిపై నెక్కియున్న పంబ యెక్కువ శ్రుతిలోను బిగింపబడియుండును. మొదటి పంబను ఎడమచేతితో కొట్టుచు, రెండవ పంబను కుడిచేతిలోనున్న పుల్లతో తాకుచుండును. 'శోకము'నందు తక్కువ శ్రుతిలోనున్న మొదటి పంబ మ్రోగింపబడును. 'వర్ణము' పాడునప్పుడు హెచ్చు శ్రుతిలోనున్న రెండవపంబ వాయింపబడును. ' మాటలు' చదువునప్పుడు కజ్జపుల్లతో రెండవ పంబను తాళాను గుణముగా కొట్టుచుండును

ఈ అంకమ్మ కథాచక్రమునగల మొదటి రెండు కథలను, అనగా 'అంకమ్మకథ', 'రవద్దేవిరాజుకథ' అనువానిని మౌఖిక ప్రసరణమున నుండగా నెల్లూరు మండలమున సేకరించితిని. మూడవదియగు గంగురాజు కథను కృష్ణా మండలమున తాళపత్ర రూపమున సంపాదించితిని.

అంకమ్మ కథలను పాడు గాథాకారులు ఈ క్రింది విధముగా ప్రార్థన చేయుదురు; [4]

వర్ణన : (పంబ యెక్కువ శ్రుతిలో మ్రోగుచుండును)

'గణనాయకా బ్రహ్మ గణనాయకా—
గణనాయకా దేవా గణనాయకా!
వజ్రాల తేరువలె గణనాయకా—
వాక్కూ నా కియ్యవయ్య గణనాయకా!
పగడాల తేరువలె గణనాయకా—
పాటా నా కియ్యవయ్య గణనాయకా!
మాధవరాయ చిన్నికృష్ణ గోపాల
మమ్ముల దయచూడు స్వామి గోపాలా!
కరుణా చంద్రా రామకుందా గోపాల—
కానరాదే బ్రహ్మమాయ గోపాలా!
వచ్చుల భాగీరథురాలు గోపాల—
పరశురాముని గన్నతల్లి గోపాలా!
తాటక సంహారుడమ్మ గోపాల—
తల్లికి లోకాము దెల్పె గోపాలా!
అడగరానీ దానమూలు గోపాల—
అడిగెనే మూడడగులేమొ గోపాలా!
మచ్చావ తారమూన గోపాల—
చొచ్చినాడే జలధిలోన గోపాలా!
చొచ్చీ సోమకుని ద్రుంచి గోపాల—
తెచ్చినాడే వేదమూలు గోపాలా!

శోకము : (పంబ తక్కువ శ్రుతిలో మ్రోగుచుండును).

శ్రీ హరీ ............ ఓ దైవమా..........
శరణమే ఆదిశక్తీ ! శరణమే రేణుకా !

4. నెల్లూరు జిల్లా, కోవూరు తాలూకా, ఊటుకూరు గ్రామములో శ్రీ డక్కాదేవదానం అను పంబలవాడు 26-7-1966న పాడిన ప్రార్థన

శరణమే తీరుభయంకరీ
శరణమే ముప్పైమూడుకోట్ల దేవతలారా!
శరణమ్మ మాపాలీ ఓ శారదాంబా ...
కనుగొని మేలుకున్నా నీమీద జ్ఞానంబు
నిద్రబోయి మేలుకున్నా నీమీద జ్ఞానంబు
బంటుబంటుకు నీ పిల్ల బంటువమ్మా...
మేలుకున్నంత మాకు ............. మేలీయవమ్మా...
హరిభక్తులు ఎందరో కలరు అవనిలోన
గంగలో స్నానము చేసి హరిని కానలేరమ్మా
శివభక్తులు ఎందరో కలరు స్థితిలోన
గంగయందుస్నానముచేసి శివుని కానలేరమ్మా
హరిభక్తులకు శివభక్తులకు బ్రహ్మభక్తులకు
ఆధారకర్తవమ్మా ...... ఓ శారదాంబా!
సదుము శాస్త్రము నేర్చిన అయ్యలను
ఈ సభయందు దలచి
విద్దసాములు నేర్చిన అయ్యలను ఈ సభయందు దలచి
తప్పులు ఉన్న మిగుల ఒప్పుగా దిద్దుడీ
ఈ సభను కూర్చున్నట్టి ఓ సహృదయులారా ....
సరగున మిమ్ము మెప్పింపా ..... ఇక నేనెంతవాడనో
గోపాల వరదో ..... ఓ శారదాంబా....

## 1. అంకమ్మకథ లేక మారాసపువారి అంకమ్మకథ:—

అంకమ్మ పాంగెమున ఇది మొదటికథ. కొన్నిచోట్ల మంజరీద్విపదగా, కొన్ని చోట్ల ఖండగతి రచనగా, మరికొన్ని చోట్ల లయాత్మక వచనముగా నిది సాగినది. సుమారు 1100 పంక్తులున్నది. దీని ప్రారంభమిట్లున్నది.

మాటలు (పంబను కఱ్ఱతో గొట్టుచు వంత 'ఆ' కొట్టుచుండును).
" వినరయ్య ఈ కత విశదంబుగాను
ఘనమెూర్వగ మీ పెద్దలకు విన్నవించెదను

ఎడలేని కళ్యాణపు దేవగిరి పట్టణాను
ఏలేటి రాజు దేవాది దేవరుద్రుండు
ఒకనాటి సమయమున వంశమార్గమున
తనకైన ఏడుగురి తలవర్లను బిలిచి
దారట్ల నాయుడను తలిచీ పిలిచీ
తలవరులారా!
మనవెడలేని కల్యాణపు దేవగిరి పట్టణము
వీధి ఇరవయ్యామడ తట్టు పన్నెండామడ
నలసదరము నాల్గు నూరామడ
ఎడలేని దేవగిరి పట్టణాము
రాజులుగాని రాజప్రధానులు గాని
భట్టులుగాని బ్రాహ్మణులుగాని
నివేగులు గాని నీతిమంతులు గాని
ఎవరు ఏలుబడి చేస్తున్నారో
ఎవరు ఏలుబడి చేయంగలేదో
సొచ్చి శోధనగానే శృంగారపు వనమునకు వచ్చి
విన్నవించండిరా తలవరులారా! అని
శృంగారపువనమున తపస్సు చేస్తున్నాడు
దేవాధిదేవరుద్రుండు [5]

కళ్యాణపు దేవగిరి పట్టణమును దేవాధిదేరుద్రుండు పాలించుచుండెను. అతని భార్య దేవరుద్రుల గంగ; కొడుకు దేవీజల బ్రాహ్మణుడు. ఈ దేవీజల బ్రాహ్మణునకు ఏడ్గురు పుత్రులు: 'ధర్మానికి పాలుపడ్డవాడు ధర్మసూడానిరాజు, అల్లానిరాజు, బల్లాని రాజు, అనుపద్మరాజు, కల్యాణరాజు, కనకసోమరాజు, వీరసోమరాజు.' దేవాధిదేవరుద్రుడు అడవియుగు అంకాళశక్తిని గొలుచుట కిష్టములేక, శృంగారపు వనములో

5. శ్రీ ఢక్కా దేవదానం పాడిన అంకమ్మకథలో ప్రారంభము 26-7-1966.

తపస్సు చేయుచుండెను. అతని మనుమలుగూడ తాతగారి ననుసరించి అంకమ్మను ద్వేషించుచుండిరి.

ఆది భయంకరి అంకమ్మ 'భుజనిమాంకాళి పట్టణము'లో దివ్య భవనములో నూటొక్క శక్తులు కొలుచుచుండగా నివసించియుండెను. మారాసప్ప రాజులచే నెల్లెనను దన్నుగొలిపించుకొనవలెనని అంకమ్మ పట్టుపట్టినది. వృద్ధురాలివేషము తో కల్యాణదేవగిరి పట్టణమునకు వచ్చినది. మారాసప్పరాజులేడ్గురును ఆమెనుజూచి కొట్టిరి. చిత్రహింసలు పెట్టిరి. పెద్దవాడు ధర్మసూడానిరాజు కొంచెము కనికరము చూపెను. చిన్నవాడు వీరసోమరాజు అమ్మవారి పట్టణమునకేగి, ఆమె భవనములనన్నటిని కూల్చివేసెను.

తరువాత అమ్మవారు అల్లనేరేడుపండ్లను సృష్టించి, ఆ పండ్లొక తట్టలోబెట్టి, ఆ తట్టను నెత్తిని బెట్టుకొని కల్యాణమునకు వచ్చి పండ్లమ్మ సాగెను. దేవాధిదేవరుద్రుని భార్య దేవరుద్రుల గంగ పండ్లుకొనుచు, రుద్రాక్షలు విభూతిలేని ఆ యమ్మ వారిని జూచి, మనుములతో జెప్పినది. వారు వచ్చి ఆ పండ్లనమ్మెడి స్త్రీని అమ్మవారుగా గుర్తించి, పండ్లన్నియు నేలపై విసరి, ఆమెను వేపబెత్తములతో కొట్టి, మెడలమీద చేతులు వేసి అమ్మవారిని పడనెట్టినారు.

పిమ్మట మఱియొకప్పుడు అమ్మవారు ఏరుడు పిడకలను బుట్టలో పెట్టుకొని కల్యాణమునకు పోవుదారిలోనుండి, ఆ మార్గమున బోవుచున్న మారాసప్ప రాజుల నా గంప నెత్తుడని ప్రాధేయపడినది. వారా గంపనెత్తలేకపోయిరి. అంకమ్మ తన్ను చిత్రహింసలు పెట్టిన ఆ రాజులకు సమయము వచ్చినప్పుడు ప్రతీకార మొనర్తునని హెచ్చరించినది.

అంకమ్మ ఎఱుకల సింగడుగా మారి, నూటొక్క గుడిసెలు, గాడిదలగుంపులు, పందులు గుంపులు సృష్టించి మారాసప్ప వారి

పంటలను నాశనము చేయసాగెను. మనుములుపోయి తమ తాత దేవాధి దేవరుద్రునితో ఈ విషయమును జెప్పిరి. ఆ పందులను బంధింపుడని తాత చెప్పెను. మాదాసపురాజు లేడుగురును ఎఱుకల గుడిసెల కడకు వచ్చిరి. అప్పుడమ్మవారు ముదుసలి రూపు దాల్చెను. అమ్మవారిని గుర్తించి రాజులామెను బెత్తములతో కొట్టబోయిరి. అమ్మవారు మంటలను సృష్టింపగా రాజులు కల్యాణమునకు పారిపోయిరి.

అంకమ్మ తన చెల్లెలు 'భండి వీరమాలక్ష్మి'ని ప్రార్థించి, ఆమెచే కల్యాణ దేవగిరి పట్టణమున ప్రజలకు దగ్గులు, పడిశములు, వాంతులు, భేదులు, కలిగించెను. 'పాలు త్రాగేటి బాలలు పాలారగించకుండ, ఉగ్గుతాగేటి బాలలు ఉగ్గారగించకుండ, రేపోపీనుగ మాపో పీనుగ, ఏడు కొళ్ళారపు బళ్ళమీద ఎల్లదోలించవమ్మ' అని చెల్లెలితో జెప్పెను. తాను ఎఱుకలసాని వేషమును ధరించి, ఆ పట్టణమునకు వచ్చి, దేవరుద్రుల గంగకు ఎఱుక చెప్పి, దేవాధిదేవరుద్రుని 'లక్షలకు దీరిన పచ్చల కిరీటంబు'ను కాజేసి పారిపోయెను.

తరువాత అంకమ్మదేవత జంగమువేషము ధరించి, 'భద్రగిరి చింతామణి పట్టణము'నకు బోయి రాతికొలనులో పుష్పములు పండించి, ఆ పట్టణమేలు రాజులు మెప్పును బగసెను. 'కుంచెడు బియ్యము, కూరకట్ట, నలుగురు తలవరులను' ఆరాజు కడ బహుమతిగా బడసి, ఒక పూలవనమును సృష్టించి, ఆ తలవరులను దెచ్చి దానికి కాపుంచెను. ఆ వనములోని పూవులను కోసి కల్యాణమునకు పంపించెను. అప్పుడు కల్యాణదేవగిరి పట్టణమున పూవులు లేక శివపూజలాగిపోయెను. మాయజంగము తలవరులచే పంపిన పూవులను జూచి దేవాధిదేవరుద్రుండు మిక్కలి సంతసించి, ఆ జంగమును దనదగ్గఱకు తెమ్మనెను. రెండవ దినమున జంగమ వేషములోనున్న అమ్మవారు పూలుతెచ్చి దేవాధిదేవరుద్రుని దర్శించెను. అతని దగ్గర బహుమతిబడసి

వెడలిపోయెను. ఆ తరువాత పుష్పములు పంపలేదు. మారాసపు రాజులు తమతాత ఆదేశానుసారము వెండి రథములు, మేఘ రథములు, కంచు రథములు, తయారు చేసికొని, పుష్పములను తెచ్చుటకై భద్రగిరి చింతామణి పట్టణమునకు వచ్చిరి. అమ్మవారి వనములో పుష్పములు కోసికొని వెడలిపోయిరి. మఱునాడు కూడ అట్లే పుష్పములు దొంగిలించుచుండగా అమ్మవారు వారిని పట్టుకొని బంధించినది. అక్కడ ఉక్కుస్తంభములు సృష్టించినది అమ్మవారు. మారాసపు రాజులను, కళ్యాణపు శంభునిమహిమచేత 'ఉక్కునార్జాలు' ( ఉక్కు కత్తులు 'నారాజీ' లేక 'నరాజీ' అనగా కత్తి) కావింపుడని కోరినది. వా రట్లే చేసిరి. ఆ ఉక్కు నార్జాలపై నొఱిగిపోవలసినదిగా నాజ్ఞాపించినది అంకమ్మ. చేయునది లేక మారాసపు రాజులేర్గురును తమ తాత దేవాధిదేవరుద్రుని దూషించుచు ఆ ఉక్కునార్జాలపై నొఱిగిపోయిరి. వారి రక్తము కాఱిపోకుండ, వారిపై నీగలు వ్రాలకుండ అమ్మవారు 'దశకట్టులు' కట్టినది. అంకమ్మ ఈ విధముగా నా రాజులపై గసి తీర్చుకొని బంగారు తూగుటుయ్యాలయందూగుచున్నది. ఈ కథాంతమున నిట్లున్నది.

మాటలు ఉక్కునార్జాలపైన హరహర ఓ లింగ నమశ్శివాయ యని
ఆ ఉక్కునార్జాలపైన ఒరిగిరి మారాసపు రాజులు
రక్తధారులు భూపాత్రమీదకు జడజడ కారుచున్నవి
ఆ రక్తము చూసి అమ్మవారు
ఆ రాజులకు దశకట్లు కడుతున్నది.
కారేటి రక్తము కరడుకట్టకుండ
ఈగ వ్రాలకుండ ఈపెలు ముసరకుండ
ఆమదుదూరాన పోతున్న నక్కలరాయుడు
తలయెత్తి రాజుల చాయ తప్పక చుడకుండ
దశకట్టులుకట్టి, భుజని మాంకాళి పట్టణము వెళ్లెను.
అమ్మవారు తనమహిమచేత ఏడుభవనములు గట్టించుకొని
తొలీతోంబ్రమువంటి వస్త్రములు ధరించి

బంగారు తూగుటుయ్యాలయందు
తులతూగుతున్నాదట. [6]

## 2. రవద్దేవి రాజు కథ :—

ఇది అంకమ్మ కథాచక్రమున రెండవ వీరగాథ. మౌఖిక ప్రసరణముననున్నది. సుమారు 1060 పాదములు కలది. ఇందు గేయముకన్న వచనము హెచ్చుగా నున్నది. దీని ప్రారంభమిట్లుండును : —

" ముదిత గర్భిణీ యౌతున్న మూడు ఘడియలకు
నాతిగర్భిణీయౌతున్న నాల్గు ఘడియలకు
అతివ గర్భిణీ యౌతున్న అయిదుఘడియలకు
కడుపులో పిండంబు కదిలాడసాగె
దంటె నొప్పులతోను తాళంగ లేక
అడుగడుక్కు ఆ నోము అధికమైతోచె. [7]

పార్వతీ పరమేశ్వరులు ఆకాశ వీధిని బోవుచుండిరి. కొఱలబడ్డ మారాసపు రాజుల శివనామస్మరణము పార్వతి చెవులబడినది. ఆమె 'అది ఏమి' టని శివుని ప్రశ్నించినది. శివుడు వారి కథను జెప్పి, ధర్మసూడానిరాజు గర్భమున జనింపబోవు రవద్దేవి రాజు మాత్రమే వారి కొఱలను తేపగల సమర్థుడని చెప్పెను.

మారాసపు రాజులు కొఱలు పడుటకు మూడు ఘడియలు ముందుగా పాములపట్నమే పద్మనందుల భాగీరథమ్మకు రవద్దేవిరాజు గర్భమునబడెను. ఈమె ధర్మసూజడానిరాజు భార్య. ఆమెకు ఒకే కాన్పున ముగ్గురు సంతానము జన్మించిరి. రవద్దేవిరాజు, కనకరాజేంద్రుడు, అను నిరువురును కొడుకులు. శివగంటల మహాద్దేవమ్మ కూతురు.

---

6. శ్రీ ఢక్కా దేవదానం పాడిన అంకమ్మకథలో అంత్యము, 26-9-1966.

7. శ్రీ డక్కా దేవదానం పాడిన రవద్దేవిరాజు కథనుండి 27–7–1966.

ఒకనాడు రవద్దేవిరాజు బొంగరములాడుచు, కోమటి యశోదమ్మచే దూషింపబడి, తనతండ్రులను వెదుకబోయెను. అతనికి అరణ్యమున నొకముని పండ్రెండుమెట్ల పైడికిన్నెరనిచ్చెను. దానితో రవద్దేవిరాజు భుజనిమాంకాళిపట్టణమునకు బోయి, అమ్మవారి కడ 'ఆనందకోపులు' పాడి సంతోషపెట్టెను. ఆమె అరణ్యమున నలిసిపోయి యుండగా, నామెకు సిద్ధులను గాపుంచి, బాలుడు అమ్మవారి భవనమునకేగి, ఆమె పండ్రెండు భద్రాయుధంబులను దెచ్చినాడు. ఈ లోగా అమ్మవారు భయపడి నాగలోకమున కేగెను. ఆమె పోయిన సోరణకంతగుండ బాలుడుకూడ నాగలోకమునకు బోవుచుండెను. అమ్మవారు సోరణకంతను 'ఆ గడ్డ ఇటు, ఈ గడ్డ అటు కలవొత్తినది.' బాలుడు మధ్య నలిగిపోవుచు పరమేశ్వరుని ప్రార్థించెను. మఱల నాగలోకమునకు మార్గము గనిపించెను. బాలుడు నాగలోకమునకేగగా అమ్మవారు పద్మసాలె స్త్రీ వలె మాఱి, ఒడుగులు వేపుకొనుచుండెను. బాలుడామెను గుర్తింపగా, నామె పాఱిపోయి, ఆది కూర్మము చాటుకెగెను. బాలుడాదికూర్మమును బ్రార్థించెను. అమ్మవారి యుత్సవములో ఒకనాటి రాత్రి యాదికూర్మమునకు వేడుకచేయింతునని చెప్పెను. ఆది కూర్మము ప్రక్కకు దొలగెను. బాలుడు అమ్మవారి వీరజడ లొడిసిపట్టుకొనెను. ఆమె తప్పించుకొని ఆది శేషుని మఱుగుజొచ్చెను. అమ్మవారికి భూలోకమునజేయునుత్సవములో ఒకనాటిరాత్రి 'శేషపానుపు' అను వేడుకను జేయింతునని బాలుడాది శేషునకు మ్రొక్కుకొనెను. ఆ లంచమునకాశపడి శేషుడు ప్రక్కకు దొలగెను. బాలుడు తిరిగి అమ్మవారిని బట్టెను. ఇద్దరును బగడసాలపందెము నాడిరి.

ఇంతలో బాలుని మేనమామలగు నరువదిముగ్గురు గోవిందరాజులు 'తుమ్మెద భల్లాణరాజు' న కోడి పాఱిపోవుచుండిరని అమ్మవారు చెప్పెను. బాలుడమ్మవారి సెలవు దీసికొని తుమ్మెదభల్లాణరాజుపై దండెత్తి మూడు శిరసులు, ఆఱుహస్తములు

ఖండించి, అమ్మవారికి కనక నివాళులెత్తెను. అమ్మవారిదగ్గఱ తొమ్మిదిగడియల సెలవు తీసికొని మేనమామల దగ్గఱకు పోయెను. మేనమామలు సంతసించిరి. పెద్ద మేనమామ పెదబాలగోవిందరాజు తనకుమార్తె 'ఉత్తర నలగంగ' నిచ్చి రవద్దేవిరాజునకు వివాహము చేసెను. బాలుడు తిరిగి అమ్మవారిదగ్గఱకు వచ్చెను. అప్పటికి పం(డెండు గడియలగుటచే నమ్మవారు కోమల పుట్టలోదాగిపోయెను. బాలుడు నాలుకలేని నాగస్వరమునూదెను. పం(డెండు శిరసుల నాగేం(ద్రుడు బయటకువచ్చెను. బాలుడు ధైర్యముతో నా పాముకంఠమునొడిసి పట్టుకొనెను. అమ్మవారా బాలుని ధైర్యమునకు మెచ్చి యాతని తం(డులనందఱను కొఱలు విడిపించినది.

అమ్మవారు తనకు దేవరు(దుని బలిగా నిమ్మని బాలుని కోరినది. నరబలియిచ్చుటకు వీలుకాదనియు, నాతనికి బదులు మేకపోతును బలియిచ్చెదననియు బాలుడు చెప్పెను. అట్లే అమ్మవారు కోరిన తలారివానికి బదులు గొఱ్ఱెను, కళ్యాణరాజునకు బదులు బల్లిని, వీరస్వామిరాజునకు బదులు పందిని, అనుపద్మరాజునకు బదులు ఎలుకను, కనక సోమరాజునకు బదులు పందికొక్కును, భళ్లాణరాజునకుబదులు దున్నపోతును బలియిచ్చుటకుబాలుడంగీకరించెను. తనతం(డి ధర్మసూడానిరాజునకు బొందితో కైలాసమిచ్చెను. పాముఱాయి పట్టణమునకు వచ్చి తల్లికి అగ్నిగుండమునకు సెలవిచ్చెను.

ఈ మారాసపు రాజులలో చివరివాడగు వీరసోమరాజు 'ఆడ దేవతరాలు, అనాథీకురాలు, పిండిగోరుశక్తి, గోడవేల్పురాలు, కొంచెపు దైత్య, వేగలేచి దీని ముఖారవిందము మన మారాసపువారు చూడ దోషము' అని తలచి, అంకమ్మను గొలుచుటకిష్టము లేక పల్నాటివారిలో గలసిపోయెను. అంకమ్మ కూడ ఆ వీరసోమరాజుచే గొలిపించుకొనవలెనను పట్టుదలతో 'పల్నాటి అంకమ్మ' గా వెలసెను.

రవద్దేవిరాజు బ్రాహ్మణులు చెప్పిన జాతకముననుసరించి తన చెల్లెలు శివగంటల మహద్దేవమ్మను కాలుసేతులులేని వాడును, అంధుండను అగు శివన్నమహద్దేవిరాజునకిచ్చి పెండ్లిచేసెను. ఆమెకు మూడువరములిచ్చుటకంగీకరించెను. రవద్దేవిరాజు తన భార్య ఉత్తరపు నలగంగతో గలసి అంకాళశక్తిని గొలుచుచుండెను. ఈ కథాంతమిట్లున్నది:

" అన్నా ! నీయిష్టానుసారముగనే కల్యాణము అడుతవున్నా. ముదమొప్ప మూడువరములు కోరెదను. తప్పక ఇచ్చెదవా?"

"సాష్టాంతముగా ఇచ్చెదను కోరుకొనుము అమ్మా!"

" ఇప్పుడువద్దు అన్నా! నాకు అవసరము వచ్చినప్పుడు కోరుకొనెదను".

"భూమి ఆకాశము సాక్షిగా, సూర్యచంద్రులు సాక్షిగా, మన కల్యాణ శంభునిసాక్షిగా, తప్పక ఇచ్చెదను తల్లీ!".

ఆ శివగంటల మహద్దేవమ్మ నిచ్చి, శివన్నమహద్దేవిరాజునకు శ్రీకల్యాణ మొడగూర్చెను. రవద్దేవిరాజు, భార్యయైన ఉత్తరనలగంగను గలసి, భార్యాభర్తలు సుఖజీవులై, అమ్మవారు అంకాళదేవతను విశ్రాంతిగా కొలుచుకొనుచుండిరి .......... [8]

ఏడుగురు మారాసపురాజులలో చివరివాడగు వీరసోమరాజు పల్నాటి వారితో గలసినట్లుగా పల్నాటివీరకథలలో గూడ ప్రమాణములున్నవి. ఈ వీరసోముని కూతురు సిరాదేవి. ఈమెను పెదమలిదేవరాజున కిచ్చి పెండ్లిచేసినట్లు పల్నాటివీరకథలలో గలదు. ఈ వీర సోమరాజు కొడుకు కొమ్మరాజు. ఈ కొమ్మరాజు కొడుకు అలరాజు. ఇతడు నలగామరాజునకు అల్లుడు. అలరాజు రాయబారమున, అలరాజు తల్లి 'చల్లమదేవి' తమ కొక్కడే

---

8. శ్రీ ఢక్కా దేవదానం అను పంబలవాడు పాడిన రవద్దేవిరాజుకథ నుండి 27-7-1966.

పుత్రుడనియు, ఆమె మామ (వీరసోముడు) గారి అన్నదమ్ముమ్మలేడ్గురును ఆడదేవతను గొలిచి నశించిపోయిరనియు దెల్పును.

ఇట్లు అంకమ్మను గొలిచిన పశ్చిమ చాళుక్యులకును, పల్నాటి హైహయులకును, వివాహసంబంధములున్నవి. ఈ హైహయులు పశ్చిమచాళుక్యులకు సామంతులగుట చారిత్రక సత్యము. మలిదేవాదులు బాలురుగానున్నప్పుడు కొమ్మరాజు కొంతకాలము మలిదేవునిరాజ్యమునకు రాజుగా నుండెనని నాకు లభించిన పల్నాటికథలలో గలదు. ఈ హైహయులు పశ్చిమ చాళుక్యులకు సామంతులగుటచేతనే వీరు కొమ్మరాజును అలరాజును మిక్కిలిగా గౌరవించెడివారు. పల్నాటివారు కొమ్మరాజాదులను 'మహారాజులవారు' అని పిలిచెడివారు. ఈ మహారాజులవార ను శబ్దమే 'మారాజులవారు' > 'మారాసపువారు' గా మారియుండునని నాయభిప్రాయము. 'సార్వభౌము'లని దీని యర్థము. దీనిని బట్టి పల్నాటియుద్ధములోని కొమ్మరాజాదులును, అంకమ్మను గొలిచిన రాజులును పశ్చిమచాళుక్యులనియు, వీరి రాజధాని కల్యాణనగరమనియు జెప్పవచ్చును. కళ్యాణము వీరి ముఖ్యపట్టణమగుటచే చారిత్రకులు వీరిని 'కల్యాణీ చాళుక్యులు' అని పిలుతురు.[9]

9. అంకమ్మను గొలిచిన ఈ మారాసపు రాజులును, పల్నాటియుద్ధములోని రాజాదులును చోడ(ళ) రాజులేమో అనెడి అనుమానము కూడ వచ్చుచున్నది. అంకమ్మ కథలలో వచ్చు ధర్మసూడాని రాజు అను పేరులో 'సూడాని' అనునది 'చోడాని' శబ్ద పరిణామము కావచ్చును. పల్నాటి వీరకథలలో నాకు లభించిన యొక తాళపత్రమున కల్యాణము నేలు వీరసోముని గూర్చి వర్ణించుచు 'చోడ వంశమునందు శోభిల్లురాజు' అని చెప్పబడినది.

రాయలసీమలో నాకు తటస్థపడిన యొక గాథాకారుడు అంకమ్మ కథాస్థలము చిత్తూరుమండలమున సత్యవీడుతాలూకాలో నాగలాపురముకడనున్నదని తెల్పినాడు. ఇటనున్న 'రామగిరి' యే గంగురాజుకథలో వచ్చు 'దక్షిణ రామగిరి' అనినాడు. దీనికి పదిమైళ్ళలో కనక రావేంద్రుడు (గంగురాజు పినతండ్రి) వసించిన దేవగిరికోటయున్నదట. ఇచటి రామగిరిలో అంకమ్మ దేవళము, వెయ్యాద్రి కోన, వెయిలింగాల పర్వతము కలవట. అంకమ్మ కథలో వచ్చెడి

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పెదమలిదేవునకు పిల్లనిచ్చిన వీరసోముడు కలచూరి బిజ్జలుని కొడుకని అభిప్రాయపడిరి. ఇది నాకు సమంజసముగా తోచుట లేదు.

### 3. గంగురాజు కథ లేక కల్యాణపు గంగురాజు కథ :—

ఇది కృష్ణామండలమున లభించిన తాళపత్ర గ్రంథము. ఇందు ముప్పది యెనిమిది పత్రములున్నవి. తప్పులెక్కువ. శైథిల్యము కలదు. అయినను కథ సమగ్రముగ నున్నది. సుమారు 1512 పంక్తులున్నవి. అంతయు మంజరీద్విపదమే. వచనము లేదు.

గంగురాజుకథ, అంకమ్మగాథావృత్తమునగల మూడుగాథలలో చివరిది. రవద్దేవిరాజు పుత్రుడు గంగురాజు. ఇతని పినతండ్రి కనక రావేంద్రుడు. ఈ కనక రావేంద్రుడు మిక్కిలి క్రూరుడు. రాజ్యమునపహరింపనెంచి కాబోలును, ఇతడు గంగురాజును చంపుటకు ప్రయత్నించును. అమ్మవారి సహాయమున గంగురాజు ఇతనిని సంహరించును. ఈ గంగురాజును "కల్యాణపు గంగురాజు" అని గాథాకారులు వ్యవహరింతురు. తాళపత్ర గ్రంథమున 'రాజుగంగురాజు' అని కలదు. కల్యాణ పట్టణము నేలుటచే 'కల్యాణపు గంగురాజు'అను పేరు వచ్చియుండును.

రవద్దేవిరాజునకు ముగ్గురు పుత్రులు: 'గంగురాజు, భూపతిరాజు, కర్ణమురాజు'. వీరిలో గంగురాజు మ వీరుడు. ఏడేండ్లబాలుడు. దేవగిరి పట్టములో నితని పినతండ్రి కనక రావేంద్రుడు బావగారైన శివన్న మహద్దేవిరాజుతో ఆలోచించి గంగురాజు నేవిధముగానైనను చంపుటకు నిశ్చయించెను. ( ఈ కథనుబట్టి దేవగిరి పట్టణమును కనక రావేంద్రుడును,

'అలగలనట్లచెరు'వే ఇటనున్న 'నెంద్రచెఱు' వని ఈ గాథాకారుడు తెల్పినాడు. దీని సత్యాసత్యములను పరిశీలింపవలసియున్నది. కల్యాణనగరము, దేవగిరి పట్టణము అనునవి ప్రసిద్ధ చారిత్రక స్థలములు. ఇందు మొదటిది కర్ణాటక రాష్ట్రమున గుల్బర్గామండలమునగల కళ్యాణ్. రెండవది మహారాష్ట్రములగల దౌలతాబాద్.

కల్యాణపట్టణమును రవద్దేవిరాజును పాలించుచున్నట్లు తెలియుచున్నది). గంగురాజు తన తమ్ములతో దక్షిణరామగిరి పట్టణమున నున్నాడు. అతడు గరిడిలో సాము చేయుచుండెను. కనక రావేంద్రుడు గంగురాజును చంపుటకై పదునాల్గురు జెట్టులను బంపినాడు. గరిడిలోనున్న గంగురాజు ఆ జెట్టులనందఱిని జంపి, వారి శిరస్సులు తెచ్చి శివన్నమహద్దేవిరాజు ముందర క్రుమ్మరించెను. తరువాత కనక రావేంద్రుడు గంగురాజుపై తెల్లయేనుగును పంపెను. గంగురాజు మావటివానితో సహ ఆ ఏనుగును హతమార్చెను. ఇక లాభములేదని గంగురాజును కల్యాణముపై దండెత్తి పొమ్మనెను. కళ్యాణములోనతడు తప్పక హతుడగునని తలచి, యీ పన్నాగముపన్నెను. గంగురాజు తనకు వివాహము చేసినగాని కళ్యాణముపైకి దండెత్తి పోననెను. అందుచే శివన్నమహద్దేవిరాజునకు గల యేడుగురు కూతుళ్ళలో పెద్దదియగు 'చుక్కలసూరద్దేవి' నిచ్చి పెండ్లిచేసిరి.

వివాహనంతరము గంగురాజు పండ్రెండువేల చతురంగబలములతో కల్యాణముపై దండెత్తెను. తలారి మారినీడు, మువ్వలభీమినీడు, ఎఱుకల పోతినీడు, పక్షలభీమినీడు, తమ్ములు భూపతిరాజు, కరణమురాజు —— మున్నగువారందఱును గంగురాజుతో వెడలిరి. గంగురాజు భార్య చుక్కల సూరద్దేవి 'అష్టపద్మాల దేవగిరి యెంకు అంకాళశక్తి' ని ప్రార్థించి, తన భర్తకు తోడుగా బంపెను. ఆ యమ్మవారి సహాయముతో గంగురాజు కష్టములనన్నిటిని గట్టెక్కెను. పొంగిన ఏడేడుసముద్రములను దాటినాడు; బండివీర మహంకాళి మతమును దాటినాడు; బాలమండలపు కోటను ముట్టడించినాడు; బాలమండలపు రాజులను జంపినాడు; పరింగలకోటపై దండెత్తి పదునాల్గురు పరింగ దొరల నోడించినాడు.

దేవగిరి పట్టణములో కనక రావేంద్రుడు తాను పంపిన గంగురాజు కల్యాణపు దండయాత్రలో మరణించెనని యూహించి మిక్కిలి సంతోషించెను. గంగురాజు భార్య చుక్కలసూరద్దేవిని

సహగమనము చేయుమని బలవంతము చేయసాగెను. ఆమె 'సాగుమానము' చేయుటకు సిద్ధపడగా, అమ్మవారువచ్చి రక్షించినది. ఇంతలో గంగురాజు విజయయాత్ర ముగించుకొని, దేవగిరిపట్టణమునకువచ్చి, క్రూరుడగు కనకరావేంద్రుని ఆ గుండములోనికి ద్రోసి చంపెను. త్రిమూర్తులు ప్రత్యక్షమై గంగురాజు దంపతుల నాశీర్వదించిరి.

కాటమరాజుకథాచక్రమునగల 'పెద్దిరాజుకథ' లో నొక గంగురాజు వచ్చును. అతడును నితడును ఒక్కరేమో! పెద్దిరాజు కల్యాణ నగరమునకు వచ్చుట అచ్చటనున్న గంగురాజుతో చెలిమిచేయుట, ఆ గంగురాజునకు సహాయముచేయుటకై వాలి కేతవరాజుతో పోరి మరణించుట —— మున్నగు నంశములు పెద్దిరాజు కథలో గలవు. పెద్దిరాజు మరణానంతరము కాటమరాజును, అతని చెల్లెలు పాపనూకను మారాసపు గంగురాజు, పెండోట ముద్దమ్మ పెంచుదురు. కల్యాణనగరమునకు పెద్దిరాజుపోవుట, అప్పుడు దానిని మారాసపుగంగురాజు పాలించుచుండుట — అను విషయములు మాత్రము పెద్దిరాజుకథలో స్పష్టముగానున్నవి. అందుచే పెద్దిరాజుకథలోని గంగురాజును, అంకమ్మకథలలోని గంగురాజును నొక్కరే అయి యుందురు.

అంకమ్మ కథాచక్రములోని మొదటికథ, రెండవకథ, కవిత్వ విషయమున నంత బింకముగా లేవు. మౌఖిక ప్రసరణముననున్న గాథలను సేకరించుటచే నీ లోపమువచ్చియుండును. వీనికి గల తాళపత్రగ్రంథములను సంపాదించినచో నీలోపము తీరునని నా నమ్మకము. మూడవకథయగు 'గంగురాజు కథ' లో కవిత్వము పాలు హెచ్చుగా నున్నది. ఇది తాళపత్రగ్రంథములుగా లభించుటచే నిట్లున్నదని చెప్పవచ్చును. మౌఖిక సంప్రదాయమున నుండుకథలలో కథాకథనమే ప్రాముఖ్యము వహించి, కవితా దృష్టి సన్నగిల్లును. కవిత్వదృష్టిగల పాదములను గాథాకారులు విస్మరించి

యుండవచ్చును. తాళపత్రగ్రంథములలో నీ లోపములుండవు. వీనిలో కండపట్టుగల భాగములు చెక్కుచెదరక అట్లేయుండును.

అంకమ్మకథలు ప్రధానముగా అద్భుతావహములగు వర్ణనలతోనున్నవి. అంకమ్మ శక్తియగుటచే నామె ప్రభావమును దెలుపుటకిట్లు వర్ణింపబడియుండును. అంకమ్మ తన తమ్ముడు పోతురాజులో గలసి పుష్పవనమును వేయుటకై భూమిని దున్ను సందర్భమున నామె కొఱ్ఱును సృష్టించుట అద్భుతరసప్రధానముగా వర్ణింపబడినది.

"నాగుబాముల బట్టెను కొఱ్ఱుకు నొగలు కావించెను
జెఱ్ఱిపోతుల బట్టెను కొఱ్ఱుకు చక్రములు గావించెను
త్రాచుపాముల బట్టెను కొఱ్ఱుకు పరములు గావించెను
పసిరికపాముల బట్టెను కొఱ్ఱుకు పగ్గములు గావించెను
మునీశ్వరునివంటి పాములబట్టెను
కొఱ్ఱుకు ముళ్ళకఱ్ఱ గావించెను
పొట్టి పొట్టి నక్కలనుబట్టి
కొఱ్ఱుకు ఎద్దుల గావించెను. [10]

గంగురాజుకథలో తెలుగు నుడికారము, వీరగాథల సాధారణప్రయోగములు, దేశి ఉపమానములు మెక్కుగలవు. 'చెక్కుటు బాగాలు చెదరంగ నవ్వెను' , 'ఎంచంగ పెంచంగ ఏడేండ్ల బాల కుమారుడు' అనునవి నుడికారమునకు ఉదాహరణములు. 'మదగజంబులు రెండు మార్కొన్నయట్లు, కొదమసింగములు రెండు కోరాడినట్లు' అనునది వీరగాథలలో తరచుగా గానవచ్చు ప్రయోగము. 'కొమ్మొ వంగని దాన్ని మ్రానై వంచంగరాదు,

10. శ్రీ డక్కా దేవదానం అను పంబలవాడు పాడిన అంకమ్మకథ నుండి 26–7–1966.

కొద్ది నిప్పని కొంగున కట్టంగ తగదు' మున్నగు సామెత లీకథలో కొల్లలుగానున్నవి. కనక రావేంద్రుడు గంగురాజును చంపుటకై పంపిన పదునాల్గురు జెట్టులవర్ణనలో మంచి కవిత్వమున్నది.

"గుద్దులకు దొడ్డవాడు గుజ్జప్పు జెట్టివకడు,
వీటె సాముకు దొడ్డవాడు వీరజెట్టి వకడు,
పందిరిమీద గుండు వకడు, పైబడ్డ పిడుగు వకడు,
నీళ్ళలో ముల్లువొకడు, నిబ్బరమైన బంటువొకడు,
కానరాని ముల్లు వకడు, అంగిటు గాల మొకడు,
తాటేకుమంట వకడు, దరిగొన్న చిచ్చువకడు" 11

11. కృష్ణామండలములో 1964 లో నాకు లభించిన తాళపత్రగ్రంథము, గంగురాజుకథ – పత్రము –7

అంకమ్మ కథాచక్రము

మొదటి వీరగాథ

# మరాసపువారి అంకమ్మకథ

పాడిన వారు : శ్రీ డక్కా దేవదానం
వయస్సు : 24సం.లు
కులం : పంబలవారు
స్వగ్రామం : కంచరపాలెం -- హరిజనవాడ
: ఉటుకూరు మజరా
: నెల్లూరుజిల్లా,
: ఆంధ్రప్రదేశ్.
నేర్చుకొన్నది : శ్రీ డక్కా రామయ్య దగ్గర
సేకరించిన కాలం : 1966 జూలై 26, 27 తేదీలు

# మారాసప్పువారి
# అంకమ్మకథ

ప్రార్థన: (పంబను ఎక్కువ శ్రుతిలో ప్రయోగింతురు)
గణనాయకా! బ్రహ్మ! గణనాయకా!
గణనాయకా! దేవగణనాయకా!
వజ్రాలా తేరువాలె గణనాయకా!
వాకూ మా కీయావయ్యా గణనాయకా!
పగడాలా తేరూవాలె గణనాయకా!
పాటామా కీయావయ్యా గణనాయకా!

మాధవరాయా చిన్నికృష్ణా గోపాళా!
మమ్మూమలా దయ చూడు స్వామి గోపాళా!
కరుణా చంద్రా రామా కుంధా గోపాళా!
కానరాదే బ్రహ్మ మాయా గోపాళా!
పచ్చాలా భాగీర్తురాలు గోపాళా!
పరశూ రాముని గన్నాతల్లీ గోపాళా!
తాటకీ సంహారూడమ్మా గోపాళా!
తల్లికీ లోకామూదెల్పె గోపాళా!
అడగారానీ దానాముాలు గోపాళా!
అడిగేనే మూడడుగూలేమో గోపాళా!
చొచ్చినాడే జలధిలోనా గోపాళా!
తెచ్చినాడే వేదములూ గోపాళా!
మచ్చాలవుతారమూన గోపాళా!
చొచ్చి సోముకుని ద్రుంచే గోపాళా!

శ్లోకం : (పంబను తక్కువ శ్రుతిలో ప్రయోగింతురు)
శ్రీహరీ .......... ఓ దైవమా ......
శరణమే ఆదిశక్తీ శరణమే రేణుకా

శరణమే తీరు భయంకరీ
శరణమే ముప్పై మూడు కోట్ల దేవతలారా
శరణమ్మ మాపాలా ..... ఓ శారదాంబా!
కనుగొని మేలుకున్నా నీ మీద జ్ఞానంబు
నిద్రబోయి మేలుకొన్న నీ మీద జ్ఞానంబు
భంటు భంటుకు నీ పిల్ల బంటుమమ్మా
మేలుకున్నంత మాకూ ..... మేలీయవమ్మా!

హరి భక్తులు ఎందరో కలరు
అవనిలోన గంగలో స్నానము చేసి
హరిని కానలేరమ్మా
శివభక్తులు ఎందరో కలరు
స్థితిలోన గంగయందు స్నానము చేసి
శివుని కానలేరమ్మా
హరిభక్తులకు శివభక్తులకు బ్రహ్మభక్తులకు
ఆధార కర్తవమ్మా.........
ఓ శారదాంభా ...........

సదుము శాస్త్రము నేర్చిన అయ్యలను
ఈ సభయందు దలచి
విద్య సాములు నేర్చిన అయ్యల
ఈ సభయందు దలచి
తప్పులు ఉన్న మిగుల ఒప్పుగా దిద్దు డీ
ఈ సభను కూకున్నట్టి ఓ సహోదరులారా
సరుగున మిమ్ము మెప్పింపా......
ఇక నేనెంత వాడనో......
గోపాళ వరదో .......
ఓ శారదాంభా.........

మాటలు : వినరయ్య వీకత విశదంబుగాను
గనమోర్వగ మీ పెద్దల కిన్న వించెదను
వెడలేని కళ్యాపు దేవిగిరి పట్టణము
వేలుటా రాజు

దేవాకి దేవ రుద్రుండు
వకనాటి సమయమున వంశమార్గమువ
తనకైన వేడుగురి తలవర్లను
దారట్ల నాయుడను, తలచీ, పిలచీ
తలవరులారా
మనివెడలేని కళ్యాపు దేవిగిరి పట్టణము
వీది విరవయ్యామడ
తట్టు పన్నిండామడ
నల సదరము నాల్నారామడ
వెడలేని దేవిగిరి పట్టణము
రాజులు గాని
రాయ ప్రతానులు గాని
భట్టులు గాని, బ్రాహ్మలు గాని,
నివేగులుగాని నీతిమంతులు గాని,
ఎవరు వేలుబడి సేస్తున్నారో
వెవరు వేలుబడి సేయంగలేదో
సొచ్చీ సోధనగానే, శృంగారపు వనమునకు
వచ్చి విన్నపింపండి రా తలవరులారా!
అని, శృంగారపు వనమున తపస్సు సేస్తున్నాడు
దేవాది దేవ రుద్రుండు!
శృంగారపు వనమున, దేవరుద్రుండు
ఏ విధమున తపస్సు చేస్తున్నాడంటే
పులితోలు చర్మంబు భూామిపై పరచి
పులితోలు చర్మంబు పైన
ఏడు రుద్రాక్షలు ఉంచి
ఏడు రుద్రాక్షలపైన, ఏడు భద్రాక్షలు ఉంచి
ఏడు భద్రాక్షల పైన, ఏడు ధబ్బణములు ఉంచి
ఏడు ధబ్బణములపైన, ఏడు సన్నని సూాదులు ఉంచి
ఏడు సన్నని సూాదులపైన వేకముకములుగ
ఉండేటి, ఏక భద్రాక్షను ఉంచి
శిరసు క్రిందుగ శ్రీ పాధంబులు మీదుగ

అఖోరఘోరగ తపసు సేస్త ఉన్నాడు
దేవాది దేవ రుద్రుండు
ఎందువల్ల తపస్సు చేస్తున్నాడంటే
ఆడ దేవుతురాలు, అబద్ధీకురాలు
పిండిగోరు శక్తి, పొంచెప దైత్య
వేగి లేసి, దీని మొకార బింభము
మన మారాస్వారము, దీని మొకార బింభము
సూడ దోసంబు, అని
తపస్సు చేస్త ఉన్నాడు దేవాధి దేవ రుద్రుండు
ఈ విధమున వీరు ఇట్లు ఉండ
భుజని మాంకాళి పట్టణము
వేకసెక్రముగ వేలుత ఉన్నాది ఆదీభయంకరి
అమ్మవారి భవనములు వెట్టివి అంటే

వర్ణము : (పంబను తక్కువ శ్రుతిలో ప్రయోగింతురు)
ఎండిది ఒకమేడో....
ఇక ఎలదిరిమేడా......
కంచుది ఒక మేడా....కలియంభుమేడా.....
రాగిది ఒక మేడా........
ఇక రత్నాలు మేడా
ఎండి ఒక మేడా ఇనుము ఒక మేడా
ఏడు మేడల సరసన ఉన్నదో....
అమ్మో.......
ఇక బంగారపు మేడా.....

మాటలు : బంగారపు మేడపై పచ్చని గద్దె
సిలుకలు పాములాయిలు
హంసలు సెలిమిజేస్తా ఉన్నాయి
అమ్మవారు ధరియించి ఉన్నది
నందుల వడ్డాణంబు
అమ్మవారు తొడిగి ఉన్నదీ
తొమ్మిది మూళ్ళ దంతావళి రయిక

అమ్మవారు కట్టి యున్నది
తొలీతూంబ్రము వంటి వస్త్రములు
నూటొక్క శక్తులు కొంతమంది శక్తులు
మృధంగము వాయిస్త ఉన్నారు
కొంతమంది శక్తులు నాట్యము చేస్తూన్నారు
కొంతమంది శక్తులు వీణ వాయిస్తు ఉన్నారు
తమ్ముడు కళ్ళివీర పోతురాజు
అమ్మవారి భవనము సుట్టూ
పారీ తిరుగుతు ఉన్నాడు
అమ్మవారు మూడో చిత్ర కన్ను పెట్టి
మారాసప రాజులు దేవాఘి దేవరుద్రుడు
నన్ను కొలుస్త ఉన్నారో లేదో అని
మూడో సిత్ర కన్ను పెట్టి
ద్రిష్టించి చూసెను
కల్యాణపు దేవిగిరి పట్నపు సాయ
రాజులు కొలియంగ లేదు
మొలభడి యున్నారు మధానుమత్తులై
మధ్యర్వించి మధంబు సేబూని
మలభడి యున్నారు
ఈ రాజుల చేత
ఏ ఒర్సునైన ఏ నేర్పునైన
రాజులు సేత నేను కొలిపించుకోవలెననీ
మెట్టు మెట్టుకు మేడ మేర్భలమున దిగి వస్తున్నది
అమ్మవారు మాయులు బన్నుతాది మాయ వెలయేల్పు
సదా నూరు వేళ్ళు వెళ్ళిన ముసలి విర్ధాపాయెను
కుడిచేత ఊతకఱ్ఱ కుదురుగా బట్టి
దా చేత ఆ కఱ్ఱ దండిగా బట్టి
ఆ గడ్డ దగులుతూ అటు మొగ్గుతు
వీ గడ్డ దగులుతు విటు మొగ్గుతు
కళ్యాణము కదలివస్తున్నది.

అమ్మవారు విట్ల యుండగా
ఏడుగురు తలవరులు దారట్ల నాయుడు
కళ్యాణ దేవగిరి పట్టణమంతా ఎంత శోధించినా
బ్రాహ్మలు గాని భట్టులుగాని
వివేగులు గాని నీతిమంతులు గాని
ఎవరు వేలుబడి శాయంగ లేదు
శృంగారపు వనంబునకు వచ్చి
దేవ రుద్రుండొక దండ ప్రమాణంబు సేసి
మణి రెండు హస్తములు మనవికి గట్టి
వినయ పూర్వకంబుతో నమస్కరించెను.
స్వామీ! దేవరుద్రా! మన పట్టణములో
ఎవ్వరు వేలుబడి చేయంగ లేదు
నీకైన మనుమళ్ళు, ఏడుగురు మారాస్పు రాజులు
వేలుబడి సేస్తూ ఉన్నారు అని
విన్నవించెను దేవరుద్రునికి వార్త.
అక్కడ నుంచి తలవరులు కళ్యాణము కదలి వచ్చిరి
అమ్మవారు కళ్యాణము కదలి వచ్చినాదట
కదలి వచ్చి, వచ్చేటి అమ్మవారిని
కనుల జూచిరి మారాస్పు రాజులు
దరమానికి పాలుపడ్డవాడు దరమసూడాని రాజు
తమ్ముడా వీరస్వామి రాజా!
ఇదే విధాంబరాలు, అంఖాళ దేవత,
ఆధీ పరంజోతి, ఈ శక్తి ఉన్నంత సేపూ
దీని మొఖార బింబము, మన మారాస్పారము సూడదోసంబు
మాడంత రుద్రాక్షి, దీని సందిట లేదు
గోరెడు ఈ బూది, దీని లలాటమందు లేదు
ఇదే విధాంబరాలు, కాకున్న,
మన కల్యాణములో ఉండువారంతా
ఎప్పుడు వీభూది రేఖలు కలిగినవాళ్ళు
అని, అమ్మవారిని పట్టుకొని,

ఏడుగురు ఏడు పేము బెత్తముల చేతా
గబ గబ కొట్టిరి
మెడల మింద హస్తంబులు వేసి
పదమని పడనెట్టేటి రాజులు కొందరు
రాజులు పెట్టేటి చిత్ర హింసకు భరింపలేకా
ఆ రాజుల గూర్చి ప్రార్థిస్తాదయ్యా!

శ్లోకం : శ్రీహరీ.....ఓ రాజులారా............
కొట్ట వద్దు నన్ను కొల్లలాడ వద్దూ
సదా నూరు వేళ్ల వెళ్లిన ముసలి విద్దాపిని తండ్రీ....
అన్నము లేకా నా ప్రాణము.......ఆ పోయి యున్నదో....
దాకము లేక నా ప్రాణమూ...ఇక దగదట్టియున్నదో.....
నడువలేను నేను ఓ రాజులారా......
రాజులారా!
కళ్యాణపు దేవిగిరి పట్టణము కదిలివచ్చి
నాయకొన్న పొట్టకంత
అన్నమడుక్కోని అనభగిస్తునయ్యా
ఓ రాజులారా.......
ఉర ఉర లేసినాయి నా కాలియందు
ఉసిరిపి కాయంత బొబ్బలు..
అరికాళ్ళను లేసినాయి తండ్రులారా!
ఇక కలేకాయంత బొబ్బలూ.....
ఓ రాజులారా.....

మాటలు : దరమానికి పాలు పడ్డవాడు దర్మ సూడాని రాజు
తమ్ముడా వీరస్వామి రాజా!
అన్నము లేక ఆ భామ ఎంత ఆపోయి పలికెనో
దాకము లేక ఈ భామ ఎంత దగదట్టి పలికెనో
కొట్ట బోకరా తమ్ములారా........
అనీ,
అందరి కన్న సిన్నవాడు, వీరస్వామి రాజు

అన్నా! దర్మ సూడాని రాజా!

బుజాని మాంకాళి పట్టణమందు
ఈ భవనము ఉన్నంతసేపూ ఈ భామ,
మన పట్టణము ఆసించుకొని వచ్చేది నిజమనీ,
ఊరూరి ఉప్పర్లి, ఊరి పేరున పిలచీ
తన ఊరి ఉప్పర్లి, దాయంగ పిలచీ
వెండిదీ సుట్టు, పైడిదే తట్టు,
పైడిదే సుట్టు, వెండితే తట్టు,
ఉప్పర్లను బిలుసుకొనీ అమ్మవారి సుట్టూ
పంచేతి ఆసులు పంచేతి బదులూగీస్తారట

వర్ణము : ఈ బరిదాటి వస్తివో..........ఓ అంకమ్మో
శృంగారపు వనమందు తపస్సు చేయుచున్నాడు
మాకైన తాత దేవాగి దేవ రుద్రుండు పాదంబులానో.....
ఈ బరి దాటి వస్తివో.......
కల్యాణములో ఉన్నాడు కళ్యాణపు శంభుని పాదమాన
ఈ భరిదాటి వస్తివో.........
ఓ అంకమ్మో......
మీకైన చెల్లెళ్లు నూటొక్క శక్తులు పాదమాన
ఈ బరిదాటి వస్తివో
సూర్యచంద్రుల పాదమాన
ఈ భరి దాటి వస్తివో........
భూమి ఆకాశంబు పాదమాన

మాటలు : దైత్యా! ఈ బరి దాటి వస్తివా,
నీకే నీ పాదమాన అని
ఉప్పర్లను దీసుకొని, భుజని మాంకాళి పట్టణము
కదలి వచ్చిరి రాజులు
రాజులు వచ్చేటి ఉరవడీ పరవడులకూ
చూచి మాటొక్క శక్తులూ, తమ్ముడు పోతురాజు,

శ్లోకం : ఈ రెవ్వరోయీ.......పాపాత్ములయ్యా...
ఈరు బెట్టేటి హింస బాదలకు మనియప్పా
ఇక మనముండేటి తోవదెల్పనేమో........
అని మాటొక్క శక్తులు తమ్ముడు కళ్లివీరి పోతురాజు
ఇక భవనమున వదలి, హిమగిరి పర్వతముల
మీదికి పారెల్ల సాగెనూ....ఓ దైవమా......

మాటలు : కదలి వచ్చె రాజులు, వేనిగి శిరసంత లావు గడ్డలు
భవనమును లేవదీయించి
కోట నగడ్తిన, దాట బొయ్యించీ,
నాలుగు మూళ్ల, నలిగడ్డ లేకుండ,
సద్ర పెట్టించీ, లింగనాలు గావించీ,
లింగాహారము పూజ్జేస్త ఉన్నారు మారాస్ప రాజులు
వీళ్ల చరిత్ర విట్ల వుండగా,
ఏడు నెర్తముల నుంచి, వెండి పోయి వున్నా
శివవీళ్ల సింతలకు, యవ్వనము తేవాలనీ,
గంగను గూర్చి ప్రార్థిస్తాదట, ఆధీ భయంకరి.

శ్లోకం : శ్రీహరీ....
గంగా........ చెల్లెలా......
ఇక ఏమి ఉన్నదీ..... ఏమున్నదమ్మా
నా ఏడు భవనములు కొట్టించినారు
లింగనాలు ఘావించీ
లింగాకారం పూజ్జేస్త వున్నారూ.....
ఓ చెల్లెలా......
పన్నెండు సేతుల ఓ భాగిర్త గంగా
యనిమిది హస్తములా.... ఓ యాదవుల గంగా......
నాలుగు హస్తములా ఓ నల్లనీ గంగా
నా పరమందు రావమ్మా....... ఓ చెల్లెలారా!

మాటలు : అనీ ఏడుగడిలు, ఏనాడు ప్రార్థించినాదో

ఉత్తరమున ఒక రాజు, ఒడ బడా ఉరమీ,
దక్షిణమున ఒక రాజు, దగదగా మెరసీ,
కార్తిలో కుంభవర్షము కురిసినాదట
ఏనాడు కుంభవర్షంబు కురిసెనో
ఏడు నెర్ధముల నుంచి వెండిపోయి ఉన్నా
శివనీళ్ల చింతలకూ, సల్లని వుతకములు పారి
సన్నని విగురు వేసినాదట
సన్నని విగురులో సన్నని ఆకు
సన్నని యాకు అందు, సన్నని పూత వేసెను
ఏడు గడియలకల్లా, పళ్లా కాయలూ
విలవిల విలవీగుసున్నాయట.
దాసేత ఆ కొమ్మ దండిగా బట్టీ,
కుడి సేత ఈ రొమ్మ కుదురుగా బట్టీ,
గల గల గల ఘూ పాత్ర మీదిగి ఊపెను
అడ్డము ఆరు మూళ్లు,
నిడిమి తొమ్మిది మూళ్లు
బుట్ట గావించీ, అల్లునేరేడు పళ్ళన్ని వేరి
శివవీల సింత పళ్లన్ని వేరి
ఆ బుట్టలో ఒక వైపున బెట్టెను
మంగ కాయలకు మసిబూసీ,
అయ్యి ఒక వైపున బెట్టెను
ముప్పయి మూళ్ల కాయవస్త్రంబు ముత్యమంత సుట్ట జుట్టీ
సుట్ట మీద ఈ గంప సూటిగా బెట్టె
కదలి కల్యాణము కదలి వస్తు వున్నది

వర్ణము : నా సేతి పళ్లు గొనరో........
ఓ సెడెలారా.......
అరగల సురాధేవి – ఓ అక్క వల్లుపరాల
మల్లెల మాధేవి – ఓ రుద్రాళ్ల గంగా...
నా సేతి పళ్లు గొనరో.....

ఓ సెడెలారా.........

మాటలు : అనుసూ, సూర్య సోమ వీధుల యందు
సుడిపడి తిరుగుతా అమ్మత ఉన్నదట
రుద్రాళ్ల గంగా, సేట యందు, రవరత్నములు
మరకత మాణిక్యములు, సేట యందు బోసుకొని,
ఓ జననీ, నీ సేతి పళ్లు తినినవారికీ
ఏమి ఫలములు గలుగుసున్నాయమ్మా
అని యడిగెను రుద్రాళ్ల గంగ
అడగగా, అమ్మవారు, మాయల బన్నుతాదట ఎట్లనంటే
ఓ తల్లి రుద్రాళ్ల గంగా, నా సేతి పళ్లు తినిన వారికి
పన్నెండు ఏళ్ల నాటి యమనప శ్రీభాలలు
భుజియించినట్లయితే, సదా నూరువేళ్ళు
వెళ్లిన ముసలి విద్ధాపులు అవుతూవున్నారు
సధా నూరు వేళ్ళు వెళ్లిన, ముసలి
విద్ధాపులు భుజియించినట్లయితే
పన్నెండు ఏళ్ల నాటి, యమనప శ్రీబాల లవుతవున్నారు
విలలేక భోంకెను, ఆ మాటతో
అమవారు సాయ ద్రిష్టింప సూచెను
మాడంత రుద్రాక్షె అమ్మవారి లలాటమందు లేదు
గోటెడు ఈ భూది అమ్మవారి సందిటను లేదు
ఏడుగురు తన్నకైన మనవళ్లను బిలుస్తాదట
సన్నవి ధ్వని ఎత్తి పిలుస్తాదట
రాజులు వెట్ల యున్నారంటే
కాశీ ముస్తాభులు ధరియిస్తు ఉన్నారు

పాట : కాశి మీదను కాశి అనుమంతు కాశి
అనుమంతు కాశిపై పింజముల దండ
పింజముల దండపై పీసుకురియాలూ
ఎలపటా జముజాల ఎలసెక్కినారూ
దాపటా వంకీలు దాసెక్కినారూ

మాటలు : కాశీ ముస్తాబులు ధరియించి
ఏడుగురూ ఏడు పేము బెత్తములు
అస్తమున బూనీ
మనికైన అవ్వ, దేవరుద్రుల గంగ,
మనలను పిలుస్త ఉన్నాదనీ
అవ్వ సన్నిదికి కదలి వచ్చిరి
ఏడుగురు మారాస్ప రాజులు
అవ్వా! మమ్మల బిలిసిన కారణంబులేమి?
శ్రీగ్రంబుగా దెల్పుము, అని అడిగినారట,
రాజులారా! ఇదే విధాంబురాలుగా ఉన్నది
అవియును గాకుండా, మాడంత రుద్రాక్ష
దీని సందిట లేదు
గోలెడు ఈ బూది దీని లలాట ముందులేదు
విధే విధాంబురాలు, ఆదిశక్తి, అంకాళ దేవత
భుజని మాంకాళి పట్టణము,
ఎళ్ళవురికించంద్రా రాజులారా!
అని సెప్పినాదట రుద్రాళ్ళ గంగ
అమ్మ వారి భుజంబుపైని ఉన్నది బుట్టా
ఏడుగురు మారాస్పురాజులు బుట్ట బెరికే
సూర్య సోమ వీథులయందు
పళ్లన్నీ వెగజల్లి, పుట్ట కోమలు పెట్టించినారట
మెడల మింద హస్తంబులు వేసి,
పదమని పడనెట్టేటి రాజులు కొందరు
ఏడుగురు ఏడు పేము బెత్తములు దీసుకోని
గబగబ కొట్టేటి రాజులు కొందరు
మాంకాళి పట్టణము వెళ్ళ వురికించినారట
"తమ్ముడా వీరస్వామి రాజా!
ఆధ దేవుతురాలు, అనాధీకురాలు
పిండి గోరు శక్తి, గోడ ఏల్పురాలు,
కొంచెపదైత్య, అమ్మ వారిని మనము తాకి వున్నాము

కల్యాణము యందు, కల్యాణపు శంభునకు
అంటు సోకి యున్నది.
ఒట్టి గుంటల్లోకి పొయ్యి, వానార గోళ్లతో
జలముల వొలసీ, ఆ పరాత్పరుని గురించి
ప్రార్థించినట్లయితే, ఏనిగ తొండాములావు జలము
బైటికి ఉప్పొంగి వస్తూఉన్నది
స్నాన పానములు దీర్చుకోని
సందీ జపములు వీడార్చుకోనీ
ఆ పరాత్పరునికి పూజలు చేస్తాము
తమ్ముళ్లారా!
అని కుమ్మరింటికి కదలి వచ్చిరి
మారాస్పు రాజులు
కొత్త భాండవ హస్తమున అందుకొని
ఆ ఒట్టి కుంటల్లోకి పొయ్యి
వానార గోళ్ళతో సెలముల వలసీ
ఆ పరాత్పరుని ప్రార్థిస్తారట

శ్లోకం : శ్రీ హరీ.........
ఓ జగదీశ్వరా......
రారా కనకాద్రి మలిమి కొండయ్యా......
కారుణ్యాధామా.......
చిట్టేటి రేవులు నీకు శ్రీమలిమికొండా
కొండ వీర మామిడి కోన కిందా..
ఇక మంచి గందపు స్తళమో.....మంచి గందపు
స్తళము సరసన నీకు తెల్లజిల్లేళ్ళూ
తెల్ల జిల్లేళ్ల సరసన ఈబూది గుండములో
ఈ బూది గుండములలోన హడుగులు తడబడకుండా
జడలు ముడిబడకుండా
స్నాన మాడినావా..........
ఓ పరంధామా......
మా యింట హోడవారు బుట్టినా......

నీ పేరు బెడుదుమూ
మగవారు బుట్టినా, నిను సేరి కొలుస్తుమూ
మా మారాస్వారి వంశమున లేవా......
ఓ పరంధామా......

మాటలు : ఏనాడు ఆ పరాత్పరుని గురించి ప్రార్థించినారో
ఏనిగి శిరసంత లావు తొండంబు
జలంబు పొంగి వచ్చినాదట
మారాస్వు రాజులు, స్నాన పానంబులు తీర్చుకొని,
సంధీ జపములు వీడార్చుకొని
కొత్త భాండవతో తీర్థంబు తీసుకొని
కదలి కల్యాణము వస్త ఉన్నారూ మారాస్వు రాజులు
వీళ్ల చరిత్ర విట్ల యుండగా
అమ్మ వారు ఏ విధమున వున్నదయ్యా
ఏరుడు పిడకలు వేరి
అడ్డము ఆరుమూళ్లు, నిడిమ తొమ్మిది మూళ్ళు
అడుగు లేని వేప బుట్ట కావించుకోనీ
ఆవేరుడు పిడకలు వేరి,
మోకాటి ఎత్తు కుచ్చి పేర్చినాదట గంపకు
భక్తీ తాత్పర్యముత బోత వున్నారు మారాస్వురాజులు
పొయ్యేటి రాజులకు ఎదురు బొయ్యా
వందనము ఆశీర్వదించీ
ఓ రాజులారా!
ఆ పిడకల గంప ఎత్తి, నా శిరసునందు ఉంచినా
కల్యాణము కదలివచ్చి, నా యాకొన్న పొట్టకు
అన్నమడుక్కొని అనబగిస్తునయ్యా రాజులారా!
అని పిలిసినాదట మారాస్వు రాజులను
అందరకన్న పెద్దవాడు, దర్మసూడానిరాజు తమ్ముళారా!
అన్నము లేక ఆ భామ ఎంత ఆపోయి పలికెనో
దాకము లేక ఈ భామ ఎంత దగదట్టి పలికెనో
ఆ కొత్త భాండవ భూ పాత్ర మీద దించండర్రా తమ్ముళారా

అనీ, గంప దగ్గరకు కదలి వచ్చిరి మారాస్పు రాజులు
ఏడుగురు మారాస్పు రాజులు ఆ గంపను ఒకవైపున బట్టిరి
సతానూరు వేళ్ళు వెళ్లిన ముసలి వ్రిద్ధాపి
ఒక వైపున బట్టెను
అమ్మవారి పక్కనే లేస్తు ఉన్నాది కాని గంప,
రాజులు పక్క లేవంగ లేదు
శ్రమ పడుతు, మొకాటి వెత్తున, వెత్తిరి
మారాస్పు రాజులు గంప
అక్కడి నించీ, వెత్తలేక గంపను
మారాస్పు రాజులు వొదిలిరి
అడుగు లేని పేప గంప కదూ
భూపాత్ర మీద నిలువ బొలకా
భూమికి వొరిగెను.
ఎక్కడి పిడకలక్కడా, చెదిరిపోయెను
అక్కడి నుంచి, రాజులు, భాండవదగ్గరకి కదలి వచ్చిరి
భాండవని హస్తముల యందు ఉంచుకొనీ
కల్యాణము కదలిపోత యున్నారు మారాస్పురాజులు
పొయ్యేటి రాజుల అమ్మవారు సన్నని ధ్వని
ఎత్తి పిలుస్తాదట
ఓ రాజులారా!
అని వెనుకకు పిలిచెను రాజులను
రాజులారా! మీకైన తాత దేవాగి దేవరుద్రుని
మాటలు విని
నా ఏడు భవనములు కొట్టించినారు
నన్ను గుబగుబ కొట్టి యున్నారు
మెడల మింద హస్తంబు వేసీ
పడనెట్టేటి రాజులు కొందరు
చిత్రహింసలు బెట్టి యున్నారు
నా యర చేతికి పళ్లు వచ్చినాయా
ఒక్కొక్క రాజు, ఒత్తి ఒత్తి చూచినారు
నా యర చేతికి పళ్లు వచ్చిన నాడు

ఒక్కొక్క రాజుని, వొత్తి వొత్తి చూడక
మానసురా రాజులారా'
అని గద్దించి పలికెను
దైత్యా! ఆడ దేవుతురాలా! అనాథీకులారా,
పిండి గోరు శక్తి, గోడ ఏలుపురాల
కొంచెప దైత్య, ఏగిలేచి నీ మొకార బింబము
మా మారాస్పువారలము చూడదోషంబు
వీ అరె చేతికి పళ్లు వచ్చిననాడు
ఒత్తి ఒత్తి చూస్తువు ఫో" అని గద్దించి
పలికిరి రాజులు
అక్కడ నుంచి అమ్మవారు నందల నల పెరువు
కట్ట మీద
నూటొక్క గుడిసె గావించెను. ఎరుకల సింగడు
అవుతారము దాల్చెను అమ్మవారు.
పశువుల మందలు, గొర్రుల మందలు
గాడిదల మందల, పందుల గుంపులు కావించీ
మారాస్పు వారి పండి యున్న పాలాపు జొన్నంత,
పాడాంబరము చేయిస్తు ఉన్నాడు
ఎండొడులు తొక్కించినాడు
పండొడులు మేపిస్తు ఉన్నాడు
ఎండొడులు తొక్కించినాడు
ఎండొడులు మేపిస్తు ఉన్నాడు
పశువుల మందలు చూచె మారాస్పు రాజులు
శృంగారపు వనమునకు కదలివచ్చినారట
మారాస్పురాజులు
వొంగి పొయ్యే దేవ రుద్రుడుకు వందనము జేసి
మణే రెండు హస్తములు మనమకి గట్టి
ఆ తాతకు చెపుతారట
ఓ తాతా! దేవరుద్రా!
ఎవరో కొండ ఎరికలి వాడట తాతా!
వాడు గుర్రముల గుంపులు, పశువుల మందలు

గొర్రుల మందలు, వేనుగుల గుంపులు
ఏమి జెప్ప వచ్చును తాతా!
మన మారాస్పువారి పండి యున్న పాలాపు జొన్నంత
పాడాంబరము చేయిస్తు ఉన్నాడు తాతా!
దేవ రుద్రుండు, నేత్రముల నెత్తి
మనమల సాయ తప్పక జూచెను
మనమలారా!
ఆ మందలన్ని తోలుకొని వచ్చి
మన మారాస్పువారి దొడ్డి దోలి
పరస, పొలవరి, బందీ తీసుకొని
వొదలి పెట్టండి రా రాజులారా
అని చెప్పెను దేవా రుద్రుండు
రాజులూ, తెల్లటి నేత్రములకు ఎర్రటి కోపాగ్ని గలిగి
రౌద్రాకారంబుతో కదలి వస్తు వున్నారు
వచ్చేటి రాజులను తప్పక జూచెను కొండ ఎరికలివాడు
ఎక్కడి మందల నక్కడ మాయము గావించెను
చేటుగానక రాజులు, నా మీదకు చెలరేగి వస్తు వున్నారని
నూటొక్క గుడిసెలయందు, కడ గుడిసిలో
సతా నూరు వేళ్లు వెళ్లిన ద్రిద్దాపాయెను
కుంకి మంచము గావించుకొని
గొర్రి ఎరువు కుంపటి ఎత్తుకొని
మంచము కింద ఉంచుకొని
మంచములో పండుకొని నూరు మూలుగులు
మూలుగుతున్నదట
ఏడుగురు మారాసపు రాజులు
దగ్గరికి కదలివచ్చిరి
"ఓ ఎరుకులు భామా!
మీ సింగడెటు బోయ?
మీ సోడికాళ్లెటు బోయిరీ?
మీ మందా మార్బలమెటు బోయెనే
ఎరుకులు భామా"?

అని పలికిరి మూరాస్సు రాజులు
"రాజులారా! మాసింగలు నందల నల్ల జెరువులో
కొంగ ఉచ్చులు ఒడ్డుకో బోయున్నారయ్యా
మా సోడికాళ్లు, తట్టా బుట్టా ఎత్తుకొని
కల్యాణము కదలిపోయి, అన్నము అడుక్కోనీ
భక్షించుటకై పోయి ఉండిరి"
అని పలికెను అమ్మవారు.
అన్నా! ధర్మసూడాని రాజా!
ఇదంతా అమ్మవారి మహిమలే కాని,
వితర మహిమలు కావు అన్నా!
ఏడుగురు ఏడు పేము బెత్తములు దీసుకోని
గుడిసె పైన గబగబ కొట్టిరి
అమ్మవారు కోపాగ్ని సేత,
ఆ ఎరువు కుంపటే బుస్సున ఊదినాదట
భగ్గున మండినాది
ఎరుకల గుడారి అంతా ధగద్మాయముగా
తగల బెట్టినాదట
హగ్ని జ్వాలలకూ, నిలువ జాలక
మూరాస్సు రాజులు
వెనుక్కి వెనుక్కి కళ్యాణము పారి వెళ్లినారట
అక్కడ నుంచి అమ్మవారు సాష్టాతు రూపము ధరియించి
కొండల కొల ఏరులు
మా మ్మీరు పర్వుతముల మీదకు కదలిపోయి
తనకయిన సెల్లెలు, భండి వీరమాలక్ష్మి ని ప్రార్థిస్తాదట

శ్లోకం : శ్రీ హరీ..... ఓ దైవమా.......
రావే నక్షత్ర వీర మండలీ, నాగభయంకరీ,
ఆది వీర ఓ భద్రకాళీ....
ఓ సెల్లెలా.......
హిమగిరి పర్వతముల మీద,
పగడసాల ఆడుతున్నావా.....

ఓ చెల్లెలా...
ఏడుగురు మారాసు్ప రాజులు నన్ను కొట్టి
కొల్లలాడియున్నారు
రాజులు పెట్టేటి చిత్ర హింసలకు
నేను భరింపలేక, నిను ప్రార్థించితినమ్మా.........
నా వరమందు రావే...... చెల్లెలా.....

మాటలు : అని ప్రార్థింపగా,
గజ్జెల అంజెలతో గలు గల్లున మ్రోగుచు
అమ్మవారు వెదుట దూకి నాదట
"అప్పా! నన్ను బిలిచిన కారణంబులేమి?
శీఘ్రముగా విన్నవింపుడి" అని అడుగగా
"చెల్లలా! ఏడుగురు మారాసు్ప రాజులు
నన్నుకొట్టి యున్నారు, కొల్లలాడి యున్నారు
చిత్ర హింసలు వెట్టియున్నారు
బాదలకు భరింపలేక నిను ప్రార్థించితిని"
"అప్పా! ఇప్పుడు నన్ను ఏమి చెయ్యమనెదరు
శీఘ్రుంబుగా వెరిగింపుడి"
వెడలేని కళ్యాణపు దేవిగిరి పట్టణములో
దగ్గులు,పడిశములు, వాంతులు, బేదులు,
సలీ జ్వరములు, పన్నెండు వేళ్ళ నాటి
యమలపు (శ్రీ) బాలలకు, గర్భము యందు సొచ్చి
రక్త మాంసములు కురిపించు
పాలు దాగేటి బాలలు పాలారగించకుండ
ఉగ్గు దాగేటి బాలలు ఉగ్గారింకించకుండ
రేపో పీనుగ, మాపో పీనుగ
ఏడు కొళ్లార బళ్ల మీద, వెల్ల దోలించ వమ్మా!
గుర్రములకు శూలకుట్లు గావించి,
కొన్ని గుర్రములు అతంబు చెయ్యి
వేనుగులకు గజ్జ గావించి

కొన్ని వేనుగులు హతంబుచెయ్యి
అటుమంటి వేళలో, నేను వెరికల వేషంబు దరించి
మారాస్పు వారికి వెరికల పోది జెప్పి
ఏ విదమునైన కొలిపించు కోవలెను

ఎరుకల
వేషం : కొన కొన మాసినట్టి, కోనలమ్మ సీరగట్టి
సింపిరి, సింపిరి వేలికలు,శీగ్రమున దరిబంచి
పేప బుట్ట గావించుకొని
సిన్న బురగడను ఊపుకు కట్టుకొని
బుట్ట సంకన ఉంచి
నిలువుటద్దముల కాడ నీడలు జూచి
తగుమ తగుమ, ఎరుకల వేషమునకు నాకు తగునని,
బంగారపు శ్రీనివో పక్కున నవ్వి,
కల్యాణము కదలి వచ్చెను
కల్యాణములో రేపో పీనిగ, మాపో పీనుగ,
ఏడు కొళ్లార బళ్ల మీద
హరహరా ఓలింగ నమశ్శివాయ అని
వెళదోలిస్త ఉన్నారు.
అటుమంటి వేళలో, కల్యాణము కదలివచ్చి
సూర్య సోమ వీథులందు,
సోదో గద్దని ఆలాపన అందినది
సోద నే శబ్దంబు వింటున్నారే కాని
అమ్మవారిని కళ్ళ జూసినవారు లేరు
పరమటు వీథికి వచ్చినది
సోదో గద్దని ఆలాపన అందినది
సోదనే శబ్దంబు వింటు వున్నారే కాని
అమ్మవారిని కళ్ల జూసినవారు లేరు.
తూర్పు వీథికి వచ్చెను
సోదో గద్దని ఆలాపన అందినది
సోదో అనే శబ్దంబు వింటున్నారే కాని

అమ్మవారిని కళ్ల జూసిన వారు లేరు
దక్షిణ వీథికి వచ్చినది
సోదో గద్దని ఆలాపన అందినది
సోదనే శబ్దంబు వింటున్నారే కాని
అమ్మ వారిని కళ్ల జూసినవారు లేరు.
ఉత్తరము ప్రదేశమునకు వచ్చి
చేడెలు చేదేటి చెంగవల్లి బావి దగ్గర కొలువు దీరి
జలంబుని పాతాళ లోకము క్రుంగదోయించెను
చేడెలు మలి తడవ వెత్తుకొని పోయి
రెండో తూరి రాగా జలము క్రుంగిపోయెను.
కళ్యాణపు దేవిగిరి పట్నములో,
నిప్పూ నీళ్లకు కొరవాయెను కదా
ఎవరో ఈ ఎరుకల భామ పిలసీ
సోదో గద్ది అడిగిన
వున్నె మాట వున్నట్టు, లేనిమాట లేనట్టు చెప్పనని,
బిందెలు బావి దగ్గర ఉంచి
ఆ రుద్రలగంగ కడకు కదలిపోయిరి
అప్పుడు అవ్వని లేపుటందుకు శక్తి సాలక
అవ్వను ప్రార్థిస్తారట:

శ్లోకం : ఇంకేటి నిద్రపోయేవు ఓ నీరజాక్షీ..
అవ్వా.....
కళ్యాణపు దేవిగిరి పట్టణంబు
ఆలగోడు పాలగోడాయెను
ఇక ఏమి ఉన్నదీ ఓ అవ్వా........
నిప్పూ నీళ్లకు కొరతాయె నేడూ అవ్వా...

మాటలు : అని గంగను ప్రార్థింపగా,
సేడెలారా! ఏమి సంగతులు ఎరింగింపమనెను
తొలి తడవల తెచ్చి మలి తడవకు పోగా,
పైన ఉన్న జలము క్రుంగి పోయెను.

ప్రక్కనే ఉన్నది వెరుకల సాని,
ఆ వెరుకల సానిని బిలచి
సోద్ గద్ది ఆలాపనందిన
ఉన్నె మాట ఉన్నెట్టు చెప్పాను అవ్వా!
అని పలికిరి
రుద్రుల గంగ బోయీలను బిలచి,
పల్లకీ దెప్పించి
ఈ పల్లకీలో ఆ వెరుకల సానిని కొలువుదీర్చి
తీసుకొని రండిరా భోయీల్లారా!
అనిపంపెను.
బోయీలు అమ్మవారి దగ్గరకు కదలి వస్తూ ఉన్నారు.
వచ్చేటి బోయీలను కళ్ల జూచెను అమ్మవారు
చూచి, మాయలు కావిస్తున్నాదట
తిగుడాల బోయీలు వస్తు ఉంటే
ఎగుడాల అమ్మవారు యున్నది
ఎట్ల మాయలు కావిస్తున్నదంటే
అడుగు ఎత్తితే, అద్దెడు సీమూ రక్తంబు
పాదమెత్తితే, పందుము సీమూ రక్తంబు
వజ్ర దండ మల్లెలు వలవలా వ్రాలుత వున్నవి.
దుర్గంధమైన వాసన కావించెను
బోయీలు వాసనకు నిలువజాలక
ఈ వాసనలోన, ఏ విధముగా వెరుకల సానిని దెత్తుమురా
అని అనుకుంటూ అమ్మవారి దగ్గరకు
కదలి వచ్చిరి భోయీలు
అమ్మవారు ఎట్ల ఉన్నదంటే
సతా నూరు వేళ్ళ వెళ్లిన విద్దాపిగా
నడువ లేక అమ్మవారు గడ గడ వణుకుచున్నది
వెరుకల భామా! ఈ పచ్చల పల్లకీ
యందు కొలువు దీరుము, ఏ విధముగ పల్లకీ లోకి
వస్తునయ్యా బోయీలారా! అని పలికెను.

భోయీలు అస్త్రములు పట్టుకుంటే అస్త్రములు వీడొచ్చినట్లున్నవి
ప్రాదములు పట్టుకుంటే, పాదములు వీడొచ్చినట్లున్నవి
ఏ విధమున పల్లకీ యందు వుంచుదుమురా అని సింతించుచుండిరి
అమ్మవారు ఉపాయముసే, పల్లకి యందు కొలువు దీరెను
భోయీలు పల్లకి ఎత్తుకొని వస్తు ఉన్నారు నగరికి
మల్లి పుష్పము మీద వీగ వాలితే,
వెంత బరువు వుంటున్నదో అంత భరువుగా కనుపించెను
మనకు ఇది ఏమి భరువని గర్వించిరి భోయీలు
తూముడొడ్లు బరువాయెను,
కొద్ది దూరము పోగా, ఇద్దు మొద్లు బరువాయెను
ఇంకా కొద్ది దూరము పోగా నలు తూమొద్లు బరువాయెను,
మోయజాలమే ఈ బరువు, భరింప లేమని
పాథములు భూమి మీద నిలువలేదు భోయీలకు
గడగడ వణుకుసున్నారు
భరింపలేమని ఎత్తి పల్లకి భూమి మీద వేసిరి
ఆ ఒడుపు తప్పించుకొని, అమ్మవారు మిట్టె దూకెను
బోయిలారా! నన్నేమన్న సంప దలిస్తిరా?
లేదు తల్లీ మోయజాలక
ఈ బరువు భరింపలేక వేచి యుంటిమి,
సిన్నముగా నడచి నగరికి వచ్చెను.
రుద్రాళ్ళ గంగను జూచి, నమస్కరించి,
తల్లీ! ఎందులకు పిలిపించితిరి, అని అడుగగా ఎరుకులు భామా!
ఏ వూరు నీ వూరు? ఎంత దూరంబు
తూర్పు పరమటు, నీతుద పూర్వ మేమి?
ఎరిగింపవే ఎరుకుల భామా?
అని అడుగగా విలలేక బొంకుతాది.

పాట : అల్లూరు, నెల్లూరు, ఆది పోలేరీ, ఆది పోలేరీ
చినకంచి పెద కంచీ తీరైనా తిరుపతి మాదీ

మాటలు : ఎరుకుల భామా!
ఎప్పుడు లేదు ఈఘోరంబు ఎన్నడు లేదు
మా కల్యాణ దేవిగిరి పట్టణంబు,
అల్లకొల్లారంబవుచున్నది
ఎందు నిమిత్తార్థంబుయ్యి, జరుగుసున్నదో, అని యడిగెను
ఆదిశక్తి మహిమలగా యున్నవి,
నీకైన భర్త దేవాపి దేవ రుద్రుండు
అమ్మవారిని కొలసి కొన్నాళ్లు, కొలియక కొన్నాళ్లు,
మద్గర్వించి, మదంబు సేబూని మలబడియున్నారు
నీ భర్త శిరసున యున్నది,
లక్షలు దీరిన పచ్చల కిరీటంబు
తెచ్చి నా బుట్టికి దాపినట్లయితే
ఉన్నె మాట ఉన్నట్లు, లేని మాట లేనట్లుగా,
నిజంబుగా దెల్పెదను,
అక్కడ నుంచి రుద్రాళ్ల గంగ,
శృంగారపు వనమునందు వచ్చి
చుట్టు పరదక్షిణ దిరిగి,
ప్రాణేశ్వరునకు నమస్కరించి
ప్రాణేశ్వరుని పలకరించుటకు శక్తి చాలక ప్రార్థిస్తాదట.
శ్లోకం : ఇక ఏమి ఉన్నదీ. .... ఓ ప్రాణ నాథా
రేపో పీనిగ మాపో పీనుగ
ఏడు కొల్లార బల్ల మీద వెలదోలిస్తున్నారు
అల్ల కల్లోల మవుసున్నది కల్యాణ దేవిగిరి పట్టణము
ఓ ప్రాణనాథా ....

మాటలు : అని శోకించెను. తన నేత్రంబులు వెత్తి
ఆ ప్రాణేశ్వరి సాయ తప్పక చూచెను
భామా! ఎందులకు వచ్చితివి
కారణం భేమని అడిగెను
ప్రాణేశ్వరా, మని పట్టణంబు,
అల్ల కొల్లార మవుచున్నది
అటుమంటి వేళలో ఎవరో ఎరుకల భామ
సత్తెమయిన వెరుకల భామగా వున్నది
నీవు శృంగారపు వనము యందు
తపస్సు జేసేటి సంగతి
ఆ ఎరుకల భామకేమి తెలుసోగాని
నీ శిరసున యున్నది, లక్షలకు దీరిన
పచ్చల కిరీటంబు, తెచ్చి.......
ఎరుకల సాని బుట్టకు దాపినట్లయితే
ఇంకా కొన్ని వాక్యములు దెలుపుత ననెను
అని సెప్పగా, శిరమున వున్న లక్షలకు దీరిన
.పచ్చల కిరీటంబు ప్రాణేశ్వరి చేతికిచ్చెను.
అది తీసికోని, కల్యాణము కదలి వచ్చెను
దేవ రుద్రల గంగ
ఎరుకలసాని బుట్టికి దాపెను
ఆ కిరీటంబు బుట్టలో ఉంచుకొని
సోది చెప్పినట్టులుగ నటించి— పక్కన యున్న బుట్ట
మోకాటి యందుకు దీసెను
మోకాటి యందు ఉన్నబుట్ట, నడుముకు దీసెను
అకస్మార్గముగా ఆకాశమున కెగిరిపోయెను
ఓ రుద్రల గంగ, నీకైన ప్రాణేశ్వరుడు
నన్ను కొలసి కొన్నాళ్లు, కొలియకకొన్నాళ్లు
మదించి, మద్దుర్వించి, మదంబు సేబూని
మొలబడియున్నాడు
ఎప్పుడైన నీ సేత నేను కొలిపించుకో పోను

అమ్మవారు అట్లుండ –

శ్లోకం : ఇక ఏమి ఉన్నదీ ఓ పాపాత్మురాలా...
నా ప్రాణేశ్వరుని శిరమునయున్న
పతకంబు తీసినా తదుపరి
నా ప్రాణేశ్వరునకు కళ తగ్గిపాయెనో....
ఓ పాపాత్మురాలా.....

మాటలు : అని శోకించెను
అక్కడ నుంచి అమ్మవారు
మామీరమునకు కదలి వచ్చి
జంగము వేషము ధరిస్తాదట
ఒల్లెళ్ల ఈ ఘూది, ఒప్పగ ధరియించి
జడ జడ కోటేలు, చంద్రకాయంత లింగములు
జడ జడ కోటేలు, సూర్యకాయంత లింగములు
వెయ్యి లింగములు, పంచలింగములు ధరియించి
వేదుము శంకు, పందుముగంట, అస్తమున ఉంచి
నిలువు టద్దముల కాడ నీడలు చూచి
తగును తగును జంగము వేషమునకు నాకు తగునని
బంగారపు శ్రీనవ్వ పక్కన నవ్వి
భద్రగిరి సింతామణి పట్టణంబు
కదిలి వస్తాడు మాయజంగంబు
భద్రగిరి సింతామణి పట్టణము వేలుట రాజులు
రచ్చజేరి రాయభారంబు సేస్తు ఉన్నారు
సెన్నూరు వేలువాడు ఆ చెన్నరెడ్డి
పద్మనాభుల రెడ్డి పెంచెలరెడ్డి
పరమట ఏలువాడు భళ్లానిరాజు
తూర్పు వేలేటి వాడు తుంగ తత్రిగ రాజు
రచ్చ జేరి రాయభారము చేస్తూ ఉన్నారు
అటువంటి సమయమందు జంగము
కొలువు సావిటి కడకు కదలివచ్చెను
ఏదుము సంకు భవ్వన ఊదెను

గంట గణగణ వాయించెను
ఇక్కడ జంగము సెంకు ఊదితే
కాశిలో చతుసూరు సెంకులు ఊదిన
చందముగా యున్నది
రాజులు, ఏ వూరు నీ వూరు జంగమా?
ఎంత దూరంబు?
తూర్పు పరమట ఓ జంగమా, నీ తుద పూర్వమేమి?
ఉత్తరము దక్షిణమా! ఓ జంగమా, నీ
ఊరు పేరేమి? అని యడిగిరి
వెలలేక బొంకుతాడట మాయ జంగము

వర్ణన : అల్లవిగో కొండలు గలవో..... ఓ రాజులారో
కొండలకు ఆరునూరు ఆమడ దూరంబున
మామ్మేరంబు కలదో,
మామ్మేరంబునకు దాపున మామటములు గలవు
మటములకు గలిగినట్టి, మటము జంగాన్ని
దేవంపు బహుదొడ్డ దినంబుల నుండి
ఈ రాత్రి కొలను యందు పుష్పములు బండించ
బహు ప్రియముతో నేనూ...... ఓ రాజులారో

మాటలు : అని పలికెను జంగంబు
జంగమా! కొంతమంది జంగములు వచ్చి
మా రాతి కొలను యందు పుష్పములు పండించలేక
ఓడిపోయిరి జంగాలు
ఓడి పోయిన జంగాలికి, వాత బియ్యంబు కట్టెలు
వారి వెంట బంపి యున్నాము
మలిమి పొయ్యిన జంగాలు,
మలిమి కొండ జేరి యున్నారు
ఒంటి జంగమా! మా రాతి కొలను యందు
ఏమి పుష్పములు పండించేవు జంగమా?
అని పలికిరి రాజులు
రాజులారా, ఆ ఓడిపోయిన జంగాలలో
కొంత మందిని నేను ఎరుగుదును,

నన్ను కొంత మంది జంగములు ఎరుగుదురు, ఎట్లనంటే,
హరహరా బసవయ్య చంద్ర జూటయ్య,
బీవన్న బసవయ్య సూర్యకోటయ్య
ఇట్ల వాళ్లు నన్ను ఎరుగుదురు
వాళ్ళు నన్ను ఎరుగుదురు
రాజులారా! మీ రాతికొలను యందు,
పుష్పములు పండించలేని పక్షమునకు,
నా వేదుము శంకు పందుము గంట,
రచ్చ దీరి రాయ కొలవులో ఉంచి,
కోటిడి అగ్గేసి, బగబగ మండించి బస్మాంగము జేసి,
మా జంగము కొలములో వైలైపోదును
అని పలికెను జంగము
రాజులు, రాయ ప్రధానులు, భట్టులు, బ్రాహ్మలు,
నియోగులు, నీతి మంతులు, అందరు కదలి,
ఊరికి ఉత్రాన, ఉభయర్ల కాటిలోన,
రణరంగ ప్రదేశమున, రాతి కొలను యందూ,
సగము భూభాగంబు పంచిచ్చిరి జంగముకు
సరిహద్దులు బెట్టిరి, ఎక్కడి రాజులను
వారి వారి ఇళ్లకు పోయిరి రాజులు
రాజులు పోయినా తదుపరి, మాటొక్క శక్తులను
తమ్ముడు పోతురాజును ప్రార్థిస్తాదట

శ్లోకం : శ్రీహరీ ... ఓ సెల్లెలా ...
ఏడుగురు మారాస్ప రాజులు నన్ను
కొట్టి యున్నారు కొల్లలాడియున్నారు
రాజులు పెట్టేటి చిత్ర హింసకు
నేను భరించలేక, మిమ్ము ప్రార్థించితిమమ్మా
ఓ సెల్లెలా.....
రారా! తమ్ముడ పోతురాజ!
మండు వీర కోటల మీద, రాక్షసుల మీద
విద్దంబు సేసి

ప్రళయము గావించినావా......
ఓ తమ్ముడా.....

అని ప్రార్థించెను,
నూటొక్క శక్తులు, తమ్ముడు పోతురాజు,
మనకైన అప్ప పిలుస్తున్నాదని
గలగల గలమని, అప్ప ఎదుట దూకిరి.
అప్పా ! మమ్ము బిలిచిన కారణంబు లేమో
వెరికింపవమ్మా? అని తెలిపిరి
ఈ రాతి కొలన యందు, పుష్పములు పండించ
ప్రేమతో వచ్చి వుంటిని, కాబట్టి
పెద్ద వెముకులు వేరి, ఆవల దాట బొయించండి
సిన్న సిన్న వెముకలు వేరి, గుట్ట బొయ్యండి
తమ్ముడా పోతురాజా! కొర్రు దోలరా అని
కొర్రు గావిస్తాదటు:
నాగుబాములు బట్టెను, కొర్రుకు నగలు గావించెను
జర్రెపోతులు బట్టెను, కొర్రుకు చక్రములు గావించెను
తాచు బాములు బట్టెను, కొర్రుకు పరములు గావించెను
పసికిరి పాములు బట్టెను, గొర్రుకు పగ్గములు గావించెను
మునీశ్వరుడంటె పాములు బట్టెను
గొర్రుతు ముళ్లగర్ర గావించెను
అరణ్యములో తిరుగుత యున్నారు, నక్కల నారాయుడు
పొట్టి పొట్టి నక్కలను బట్టి, గొర్రుకు వెద్దులు గావించెను
గొర్రుకు వెద్దులు గట్టి, తమ్ముడా పోతురాజా!
కొర్రు తూర్పు మందల నించి, పరమట మందలకి
వెలదోలించరా?
పరమట మందల నించి, దక్షిణాపు మందలకు
దక్షిణ మందల నించి, ఉత్తరపు మందలకు
వెల్లదోలించు అని చెప్పెను.
అమ్మ వారు హడ్డముడి గట్టి

అడ్డ శార వడిలో, సన్న సన్నని ఎముకలు బోసుకొని
తమ్ముడు గొ్రుతోలుతూ వుంటే
   అమ్మవారు విత్తనము వేస్తు ఉన్నది
అమ్మ వారు విత్తనము వేస్తూ వుంటే
అమ్మవారి వెనుక సన్నని ఆకేసుకొని వస్తూ ఉన్నది
అమ్మవారు పూర్తిగ గింజ వేసేటప్పటికి
నాలుగు ప్రదేశములకు ఆకు మోాము వెలవెల వచ్చెను
అమ్మవారు మహిమ చేత, ఏడు ఘడియల కల్లా
పుష్పములు, మల్లెలు, మొల్లలు, మాను సంపెంగి,
పారంజోతి పుష్పములు పర్వనాధులు నిడసాగెను
మూాడు పుట్ల ముప్పందుముల పుష్పములు కోసి
బుట్టిలో వుంచుకొని, భద్రగిరి సింతామణి
   పట్టణము కదలివచ్చెను
ఆ రచ్చ జేరి రాయభారము సేస్త ఉన్నారు రాజులు
ఆ కొలువు రచ్చలో గుట్ట పోసెను
మెచ్చితిని ఓ జంగమా, ఏమి కావలెనో కోరుకొనుము
తప్పక విచ్చెదను, అని పలికిరి రాజులు
రాజులారా, మెప్ప మీ బండారున ఉంచుకొని
కుంచెడు బియ్యము, కూర కట్ట
నలుగురు తలవరులను దయ సేయండయ్యా రాజులారా !
అదే విధంబున, కుంచెడు బియ్యము కూర కట్ట
నలుగురు తలవరులను ఇచ్చిరి.
వారిని దీసుకొని పూల వసంత్రము
   దగ్గిరికి కదలి వచ్చెను
తలవరులారా ! ఈ బియ్యము భుక్తి చేసుకొని
భుజించుచూ, పూల వసంత్రము దగ్గర
కావలి ఉండండ్రా! తలవరులార అని
భద్రము, మాకై మీ రెవరికన్న కోసి
   యిచ్చెదరేమో పుష్పములు

లేక, దొంగతనంబుగ వచ్చి కోసికొని పోయెదరేమో జాగ్రత్త
ముప్పందుము పుష్పములు గోసి,
తలవరులచే ఎత్తించి
కల్యాణము పంపించెను.
కల్యాణములో ఎట్లు వున్నదంటే
పుష్పములు లేక వారికి హరి పూజ ఆగి ఉన్నది
శివునికి శివ పూజ లేక సిద్ధై యున్నది.
పుష్పములు జూసి, ఏడుగురు మనమల్లు జూచి
దేవరుద్రుల కడలకు కదలి వచ్చిరి
తాతా! భద్రగిరి సింతామణి పట్టణమట
జంగమా భక్తుండు, పుష్పములు బండించివాడట
మనకు పుష్పములు బంపించెను
మనమల్లారా! శివునికి శివపూజ జెయ్యండి
వెంటనే ఆ జంగమా భక్తుణ్ణి
నా సన్నిధికి పిలిపించండిరా మనమల్లారా!
అని పలికెను దేవరుద్రుండు
పుష్పములు దీసుకొని, తలవరుల పంపించెను
సింతామణి పట్టణంబు
జంగమా భక్తుండా, నిన్ను రమ్మాన్నె దేవరుద్రుండు

భలె ప్రేమతో బలికెను
కదిలి అరదెంచవయ్యా అని పలికిరి
రెండో దినమందు, పుష్పములు గోసుకొని
కల్యాణము కదలివచ్చెను మాయజంగంబు
శివాలయము దగ్గర పుష్పములు పోసి
శృంగారపు వనమునకు కదలిపోయెను
దేవ రుద్రునకు నమస్కరించి నిలబడెను

జంగమా! ఏ వూరు నీ వూరు? ఎంత దూరంబు?
తూర్పు పరమట నీ తుదపూర్వమేమి?
ఉత్తరము దక్షిణము నీ ఊరు పేరేమి?
వెరికింపవయ్యా జంగమ భక్తుడా?
అని పలికెను దేవరుద్రుండు
దేవరుద్రా! కొండలకు ఆరునూరు ఆమడ దూరంబున
మామ్మేర్రంబు గలదు, మామ్మేర్రంబునకు దాపున
మా మటంబులు గలవు
మటమునకెత్తినట్టే, మటమ జంగాన్ని అని పలికెను
నీవు చేయు మేలు ఎప్పటికి మరిచిపోము
నీ పుణ్యమున పూజలు సేసుకొనుచున్నాము
ఏమి గావలయువో కోరుకొనుము.
దేవరుద్రా! మెప్పు మీ బండారమున నుంచుకొని
కుంచెడు బియ్యము కూరకట్టు
నలుగురు తలవరులను ఈయవయ్యా దేవరుద్రా!
అని పలికెను మాయజంగంబు
నలుగురు తలవరులను, కుంచెడు బియ్యము కూరకట్టు
ఇచ్చెను జంగంబుకి,
జంగమా! నిక్షంబు ముప్పందుమ పుష్పములు
పంపిచ్చువయ్యా అని పలికెను.
సింతామణి పట్టణము కదలివచ్చెను జంగము
అప్పటి నుండి పుష్పములు కల్యాణము పంపంగ లేదు
ఒకటి రెండు మూడు దినములు జూచెను
పుష్పములు పంపంగలేదు
ఏడుగురు మారాస్పరాజులు
కదలి శృంగారపు వనమునకు వచ్చిరి
తాతా దేవరుద్రా! జంగము పుష్పములు పంపిచ్చులేదు
మళ్లీ యదాప్రకారంబు
హరికి హరి పూజ ఆగి యున్నది
శివునికి శివపూజ ఆగియునుది

మనమలారా! మారాస్పరాజులారా!
మీరు పోయి, భద్రగిరి సింతామణి పట్టణంబు పోయి
పుష్పములు గోసుకొని రండిరా మనమలారా!

తాతా! దేవరుద్రా!
పోనేగలము, రానేగలము,
మేము పొయ్యి వచ్చే దారిల్లో
ఆదిమార్గపు బాటలు గాసియుండును.
ఆదీ భయంకరి
కాబట్టి నడచిపోవుటకు సాధ్యపడదు తాతా,
అని పెద్దల నాటి ఎండి రథాలు, మేగ రథాలు
కంచు రథాలు, విశ్వబ్రహ్మను పిలచీ
ఆ రథముల యందు, బంగారపు పుటికీలు అమర్చి,
రథములను "యగ్నా పరమేశ్వర" వంటి
అంతంత రథములు, ఆకాశ మార్గమున వెఘలి
పూల వనంత్రము దగ్గర ఆగేటట్లుగ
అక్కడ పుష్పములు కోసుకొని, "విగ్నా పరమేశ్వర" వంటి
కల్యాణము కదలి వచ్చేటట్లుగ చెయించవయ్యా
అని పలికిరి రాజులు
అదే ప్రకారంబు, విశ్వబ్రహ్మను పిలచి,
ఆ రథముల యందు, బంగారు పుటికీలు హమర్చెను
ఆ రథములలో కొలువు దీరి రాజులు
"యగ్నా పరమేశ్వర" అనగ,
అంతంత రథములు ఆకాశ మార్గమున లేచి
భద్రగిరి సింతామణి పట్టణము కదలి వచ్చెను
అమ్మవారు ఎట్ల ఉన్నదంటే
జంగము మేషము మారి,
బంగారపు రామ సిలుక అయ్యి
శివనీల సింతల పైని వాలియున్నది
దొంగలు గోసిన సందమున పుష్పములు కోసిరి

ఆ పుష్ప వసంతరమంతా పాడాంబరము చేసిరి
పుష్పంబులు కోసుకొని,
బంగారి పుటికెల యందు అమర్చి
'జమ్మా పరమేశ్వర' యనగ
అంతంత రథములు ఆకాశ మార్గమున లేచి
కల్యాణము కదలి వచ్చెను
శివనీల సింతలదిగి, అమ్మవారు
జంగమయ వేషములు ధరించెను మరల
పుష్ప వసంత్రము సాయ నేత్రములెత్తి
తప్పక సూసెను
దొంగలు గోసిన సందమున,
దూసి ఉన్నది వసంత్రంబు

ఈ ఎనిమిది మంది తలవరులను బిలిచి,
తలవరులారా! మీకై మీరు ఎవరికన్న
పుష్పములు కోసి యిచ్చి ఉంటిరా
లేక మిమ్ముల అగాతంబు సేసి,
ఏమైనా కోసుకొని పోయి ఉంటిరా ?
తెలియంగ్రా తలవరులారా!
మీరైతే నిజంబు చెప్పుడి, లేదా,
నా అస్త్రంబున ఉన్నది అగండ వీర గత్రి చేత
మీ ఎనిమిది మంది శిరంబులు అట్లా కండింపజేతును

గడగడ వణుకుచు తలవరులు
మరో రెండు హస్తము మనవికి గట్టి
జంగమా! మాకై మేము ఎవరికి కోసి యివ్వలేదు
మిమ్ముల అగాతంబు సేసి ఎవ్వరు కోసికొనిపోలేదు
అని పలికిరి తలవరులు

సరే! తలవరులారా!
మీమీ ఇళ్లకె వేంచేయుండి
రేపు వచ్చిన దొంగ మాపు రాకపోడు

మాపు వచ్చిన దొంగ రేపు రాకపోడు
అని తలవరులను బంపిచ్చెను.
బంగారపు రామ చిలుకయ్యె
శివనీల చింతల మీద వాలి యున్నది.
కల్యాణములో ఎటుల ఉన్నవి అంటే
ఏడుగురు ఏడు రథంబుల పైన కొలువుదీరి
అంతంత రథములు యగ్నా పరమేశ్వర యనగ
ఆకాశ మార్గంబున లేచెను రదంబులు
పూలవనంతరములో దిగి
దొంగలు కోసిన సందమునా
కోయుచుండిరి పుష్పములు
శివనీల చింతల మీద నుండి
ఆరుగో దొంగలని, ఊరుగోదొంగలని
కాశీ దొంగలనగా బట్టెను ఏడుగురు మారాస్పరాజులను
వారి వారి ఉత్తరములను దీసి
పెడ రెక్కలుగా బంధించి
కాకులు దూరని కారడివికి దీసి
సీమలు దూరని చిట్టడివి దీసి
గండాభేరుండ అరణ్య ప్రదేశంబున దీసి
అమ్మవారు మహిమ సేత
ఉక్కు స్తంభములు గావించెను
అక్కడ నుంచి అమ్మవారు జంగము వేషము వదలి
ఆదిశక్తి అంకాళ దేవతాయెను

రాజులారా!
అలనాడు, మీ అరిసేతికి పళ్లు వచ్చిననాడు
ఒక్కొక్క రాజులను ఒత్తి ఒత్తి చూసినారు
నా యరి చేతికి పళ్లు ఇయిగో
మిమ్ములను వొత్తి వొత్తి సూడక మాననురా
రాజులారా! అని పలికెను
అమ్మవారు శాయ నేత్రము లెత్తి తప్పకా

సూసిరి రాజులు
నాగస్వరము వంటి నడుములు రాజులకు
నక్కున విరగెను
"తమ్ముళ్ళారా! జంగము కాదువీడు,
మన పాలిటకు మృత్యువై కాచి ఉన్నది"

"రాజులారా!
నా మహిమ సేత, ఉక్కు స్తంభములు
గావించి ఉన్నాను
మీ కల్యాణపు శంబుని మహిమ చేత
ఉక్కు నార్జాలు గావించుడి
అప్పుడు ఆ కల్యాణపు శంభుని గురించి
ప్రార్థిస్తారట మారాస్వ రాజులు:

శ్లోకం : శ్రీహరీ .... ఓ పరంధామా....
చిట్టేటి రేవులు నీకు శ్రీ మలిమికొండా
కొండ వీర మామిడి కోన కింద మంచి గందపుస్తళము
మంచి గ్రందపుస్తళము సరసన తెల్లజిల్లేళ్లు
తెల్ల జిల్లేళ్ల సరసన విబూది గుండములో...
ఓ పరంధామా....
విబూది గుండములలోన అడుగులు తడబడ కుండా
జడలు ముడిబడకుండా స్నానమాడివానా ....
ఓ పరంధామా....
మా యింట ఆడవారు బుట్టినా నీ పేరు పెడుదుము.
మగవారు బుట్టినా నిను సేరి కొలుస్తుము
మా మారాస్వవారి వంశమున లేవా?
ఓ పరంధామా...
ఉక్కు స్తంభముల పైన
నీ మహిమ చేత ఉక్కు నార్జాలు కావించవయ్యా
ఓ జగదీశ్వరా....

మాటలు : అని ప్రార్థింపగా,
ఆ ఉక్కు స్తంభముల లోనుంచి

పిడి మూరెడు, మొగిలి రేకులవలె
పెరికి వచ్చినాయట ఉక్కు నార్జాలు

రాజులారా! అలనాడు మీ తాత
దేవాంకి దేవరుద్రుల మాట విని
నన్ను చిత్ర హింసలు పెట్టి యున్నారు
ఈ నాడు మీ తాత దేవాకి దేవరుద్రుల
దలచుకొండిరా రాజులారా!
అని పలికెను.
దేవ రుద్రుణ్ణి దూషిస్తారట
మారాస్ప రాజులు:

శ్లోకం : ఓ... ఓరి పాప కర్మా... తాతా ....
ఎన్ని దినంబులు మతిని దలంచి మమ్మిలా
నేటి కాలమునకు హోడదాని చేతికి అందించినావా
ఓ దేవ రుద్రుడా... తాతా ....
నీ కొండంత బొజ్జ సైన ఎన్నడు కూలు బాణములూ....
ఓ తాతా ....
ఎడతేని కల్యాణపు దేవగిరి పట్టణము యందు
వాంతులు బేదులు సలిజ్వరములు
దగ్గులు పడిశంబులు, రేపో పీనిగ, మాపో పీనిగ,
ఏడు కొళ్లార బళ్ల మీద
హర హర ఓ లింగ నమశ్శివాయని
ఎల దోలించు వార్తా....
ఇక మేమెన్నడిందుమో....
ఓ పాప కర్మా... తాతా ...
అందరి పట్టణంబుల యందు పాల కావిళ్లు తెచ్చి
చెలగి కల్యాణపు దేవిగిరి పట్టణము యందు
రక్త కావిళ్లు తెచ్చువార్తా...
ఇక మేమెన్నడిందుమో.....
మా యవ్వ రుద్రాళ్ల గంగ మెడలో ఉన్నదీ
పురుషుడు కట్టిన పుణ్యాంపు తాళీ...

మంచి మధ్యాన్న కాలమందు
మెడలో ఉన్న మాంగల్య సూత్రంబు
నల్ల పూసలు, నల్ల గాజులు,
చిట్టేటి రేవుల యందు
పట పట త్రెంచి పోసిన వార్తా
ఇక మేమెన్నడిందుమో.....
ఓరి కూలకర్మా......

మాటలు : అని దూషించెను దేవ రుద్రుని
రాజులారా!
మీకై మీరు ఒరిగెదరా ఉక్కు నార్జాల పైన
నా హస్తముల గుండా ఒరగదియ్య
మనెదరా రాజులారా!
ఆడ దేవుతులారా! అనాధీకురాలా !
పిండి గోరు శక్తి, గోడ ఏల్పురాలా
కొంచెపు దైత్య
నీవు మమ్ముల ఇక్కడ తాకి నట్లయితే
కల్యాణప దేవిగిరి పట్టణమున యందు
మారాస్ప వారికి అంటు సోకుత ఉన్నది
ఎడంగా ఉండవే దైత్యా!
అని పలికిరి మారాస్ప రాజులు
ఉక్కు నార్జాల పైన,
హర హర ఓ లింగ నమశ్శివాయ యని
ఆ ఉక్కు వార్జాల పైని ఒరిగిరి మారాస్పరాజులు
రక్త ధారలు భూ పాత్ర మీదకు
జడ జడ కారుచునున్నవి
ఆ రక్తము చూసి అమ్మవారు
ఆ రాజులకు దశకట్లు కడతాదట
కారేటి రక్తంబు కరుణు గట్టకుండ

అంకమ్మ కథాచక్రము

రెండవ వీరగాథ

# రవద్దేవిరాజుకథ

పాడిన వారు : శ్రీ డక్కా దేవదానం
వయస్సు : 24సం.లు
కులం : పంబలవారు
స్వగ్రామం : కంచరపాలెం – హరిజనవాడ
ఉటుకూరు మజరా
నెల్లూరుజిల్లా,
ఆంధ్రప్రదేశ్.
నేర్చుకొన్నది : శ్రీ డక్కా రామయ్య దగ్గర
సేకరించిన కాలం : 1966 జూలై 26, 27 తేదీలు

# రవద్దేవిరాజుకథ

మాటలు : ఏడుగురు మారాస్ప రాజులు
అఖోర ఖోరముగ ప్రళయాపించుచుండ
ఆకాశ మార్గమున పార్వతీ పరమేశ్వరుడు
నంది వాహన ధీరులై, భూమి సంచారించుటకై

ఆ మార్గమున వచ్చుచుండిరి
రాజులు అఖోర ఘోరముగ,
హర హర ఓ లింగ నమశ్శివాయని
ధ్యానముతో యున్నారు
అటువంటి శివస్మరణ వినెను పార్వతి
ప్రాణ నాయకా! జగదీశ్వరా,
ఇది మానవులు తిరిగే అరణ్య ప్రదేశము
కాదు కదా నాథా
అవును దేవీ! ఈ అరణ్యములో
ఓ లింగ నమశ్శివాయనే ధ్యానముతో ఉన్నారు.
ఎవరు ప్రాణేశ్వరా ?
ప్రాణేశ్వరీ, ఆ చరిత్ర చెప్పుటకు
సాధ్య పడదు దేవీ!

నాథా, మనము భూమి సంచారము కదలి వచ్చినది మునుపు, నాయమెంతటిదో, అన్యాయమెంతటిదో, విచారించుటకే కదా నాథా మనము వచ్చినది, తప్పక, ఆ రాజుల చరిత్ర విన్నవింపుడు ప్రాణేశ్వరా, అటులనే భామా విపించెద వినుము, కల్యాణపు దేవగిరి పట్టణము వేలుట రాజు దేవాగి దేవ రుద్రుండు, దేవాగి దేవ రుద్రుని కుమారుడు దేవి జల బ్రాహ్మణుడు, జల బ్రాహ్మణునికైన కుమారులు ఏడుగురు మారాస్ప రాజులు, ఈళ్ల ఉభయ మొత్తంబయి, అమ్మవారిని కొలుస్త ఉన్నారు అంకాళ దేవతను, కొలిచి కొన్నాళ్ళు, కొలియక కొన్నాళ్ళు

మదించి, మద్గర్వించి మదంబు సేబూని, మలబడియున్నారు, ఆ దేవరుద్రుని మారులు విని, అమ్మవారు ఏడు భవనములు కొట్టించినారు, చిత్రహింసలు పెట్టి ఉన్నారు, అన్నిటికి ఓర్చుకొని, భద్రగిరి చింతామణి పట్టణమునందు పుష్పములు పండించి, కాచి, దొంగలను గాబట్టి, ఈ అరణ్య ప్రదేశంబందున, కొర్లకు స్థాపము గావించెను, రాజులు కొరలు బడే ముందు, ముదువొప్ప మూడు గడియలు ముందుగా, పాము రాయుల పట్నమేలుత వున్నది పద్మ నందుల భాగీరతమ్మ, ఆమె గర్భమయందు వేపకాయంత పిండంబు వేరుపడి యున్నది, ఆడు రమా రమద్దేవి రాజు, అమ్మవారికి వైరె జన్మించబోతున్నాడు, ఆ బాలుడొచ్చి,అమ్మవారిని ఓడించి, కొరల లేపవలసినదే కాని, మనకు సాధ్యపడదు భామా, పోదాము రమ్మనెను పరమేశ్వరుండు, అక్కడ నుంచి ఆకాశ మార్గమున కదలిపోయిరి.

పాట : ముదవ గర్భిణితో ఉన్న మూడు ఘడియలకూ
నాతి గర్భిణితో ఉన్న నాల్గు గడియలకూ
అలివ గర్భిణితో ఉన్న అయిదు గడియలకూ
కడుపులో పిండంబు కదిలాడసాగే
దంటి నొప్పులతోన తాళంగలేక....
అడుగడుక్కు ఆ నోము అధికమై తోసె....

మాటలు : దండి నొప్పులతోన తాళుకొన లేక
ఆ పుణ్య పథాదులను గూర్చి ప్రార్థిస్తాదట

శ్లోకం : శ్రీహరీ... ఓ దాదులారా....
పుట్టింటి వారు ఇచ్చినారు పుణ్యపు దాదులారా
అత్తగారు ఇచ్చినారు ఓ అమరపు దాదులారా
దాదులారా ....
ఎప్పుడు నేను ఇట్లు కన్న దానను కాదు...
ఓ దాదులారా...

మాటలు : ఓ తల్లీ! మీకైన ఇలవేల్పుకొలవేల్పు

ఆ కళ్యాణపు శంభుని, పరమేశ్వరుని గురించి
ప్రార్థించవమ్మా, అదే విధమున ప్రార్థింప సాగెను

శ్లోకం : రారా కనకాద్రి మలిమికొండా
కారుణ్యధామా....
ఓ పుణ్యధామా...
చిట్టేటి రేవులు నీకు శ్రీ మలిమికొండ
కొండ వీర మామిడి కోన కింద
మంచి గందపు స్తళమో....

ఓ పరంధామా...
మంచి గంధపుస్తళము సరసన తెల్ల జిల్లేళ్లు
తెల్ల జిల్లేళ్లు సరసన వీబూది గుండములో
విబూది గుండములోన, అడుగులు తడబడకుండ

జడలు ముడి బడకుండ,
స్తాన మాడినావా.....
ఓ పరంధామా....
మాయింట ఆడవారు బుట్టినా నీ పేరు బెడుదుమో...
మొగవారు బుట్టినా నిను సేరి కొలుస్తుమో....
మా మారాస్వారి వంశమున లేవా...
ఓ మలిమికొండా....

మాటలు : అని ప్రార్థింపగా, నవాతొమ్మిది గడియల కల్ల, ముదమొప్ప ముగ్గురు బాలలు జల్మించిరి. ఆ బాలకులను చానార్చి, సందీజపములు చేసి, ఉయ్యాల తొట్ల యందు ఉంచి, జోలెలు పాడుతారట.

క్రోల పాట : మగవాడు కలిగెనమ్మ, మోహనాంగికీ !
లలనా – మోహనాంగికీ,
శానార్చి బాలుణ్ణి – సేటా నుంచరే
లలనా – ఉయ్యాలూపరే,
కోటీ పాటీగా జూచి బొడ్డూ కోయరే
లలనా – బొడ్డూ కోయరే,

బొడ్డూ కోసిన మంత్రాసానికి సీరాలివ్వరే
లలనా — కోకాలివ్వరే,

మాటలు :దాదులారా, ఈ ప్రపంచము యందు ఒక్క స్త్రీకు, ఒక్క బాల జల్మించేది అసాధ్యము, నా గర్భమున ముదమొప్ప ముగ్గురు బాలలు జల్మించినారే, ఈళ్ల జల్మ నక్షత్రమెట్టిదో ఈళ్ల పూర్వ పుణ్యములెట్టుల యున్నదో, అని, బ్రాహ్మలను బిలపించెను; వేదబ్రాహ్మలను, పండిత బ్రాహ్మలను, కవులను బిలపించెను, బ్రాహ్మణోత్తములు, కదలి వచ్చిరి. కొంత మంది బ్రాహ్మలకు బంగారు కుర్చీలు వేసెను. కొంత మంది బ్రాహ్మలుకు సింహాసనముల పైని కొలువు దీరిరి. కొంత మంది బ్రాహ్మలు బంగారు సిరిసాపల మీద కొలువు దీరిరి. కుశిలించేటి బ్రాహ్మలను కూర్చోమని చెప్పెను. భోజన పదార్థములు సంపూర్ణముగా భుజయించి బ్రాహ్మణోత్తములు, కర్పూరపు తాంబూళములు వేసి, విశ్రాంతిగా కొలువు దీరిరి. అటువంటి సమయమున, బ్రహ్మణోత్తములారా ! నా గర్భమున ముదమొప్ప ముగ్గురు బాలలు జన్మించియున్నారే, ఈళ్ళ జన్మ నక్షత్రమెట్టిదో ఎరిగింపండయ్యా బ్రాహ్మణోత్తములారా? వెండి పంచాంగములు బ్రాహ్మలు, పారబెట్టిసూసిరి. పైడి పంచాంగములు విప్పిసూసి, ఆయాకు అటువేసి ఈయాకు ఇటువేసి, తల్లీ! పద్మనందుల భాగీరతమ్మ! తొలుచూలు జన్మించి యున్నాడే కుమారుండు, ఆ కుమారుడు వీపున వింజామరలు, అరికాలిన పద్మరేఖ, బొడ్డున సింతామణి, నాలికన నక్షత్రము కలిగినవాడు. ఈ బాలుడు అమ్మవారికి వైరయ్యి జన్మించియున్నాడు. ఈళ్ళ తండ్రిగారిని కొరలు వేసి ఉన్నది ఆదీ భయంకరి, ఆ కొరలు లేపుటందుకై జల్మించినట్టి బాలుండు, ఈ బాలుని పేరు రమారమద్దేవి రాజు, రెండో బాలుడు జల్మ నక్షత్రం బెట్టిదంటే,

కాలిసిన పందికొక్కులక్కు, కాలవని పందికొక్కులకు,కొట్లాట పెట్టేవాడు; బోడి నెత్తులకు, మోకాళ్లకు ముడేసేటి వాడు; కనక రావేంద్రుడు, ఈ బాలుడు జల్మ నక్షత్రము విది. మూడో ఆడ బాలిక జల్మనక్షత్ర మెట్టిదంటే, చాలా సౌందర్యముచే జల్మించి యున్నది, సూడబోతే రాజుకు నేత్రములు లేవు, ఊసబోతే రాజుకు హస్తములు లేవు, నడవబోతే రాజుకు పాదములు లేవు, వినబోతే రాజుకు రెండు వీనులు లేవు, ఉబ్బుడు బత్రం వంటి ఓర్పు లింగంబు, హరి హరమంటే, హరిగంటలు మోగును, శివ శివ మంటే, శివ గంటలు మ్రోగును, ఈమె కంటే ఏడేండ్లు చిన్నవాడు, శివన్మహద్దేవి రాజు, ఆ రాజుకిచ్చి శ్రీ కల్యాణము వొనగూర్చవలెనని వ్రాసియున్నది తల్లీ అని పలికిరి బ్రాహ్మణోత్తములు.

ఆ మాటతో పద్మనందుల భాగీరతమ్మకు, నాగస్వరము వంటి నడుములు నక్కువ విరిగెను.

శ్లోకం : శ్రీ హరీ.... ఓ దైవమా....
ఇది ఎక్కడి పాపమో ఈ ఘోరమయ్యా....
ఓ పరంధామా...
ఆ ఉప్పుడు పౌత్రమునకు,
చాలా సక్కని సౌందర్యవతినిచ్చి,
శ్రీ కల్యాణము ఏ విధమున ఒనగూర్తు తండ్రీ....

ఓ పరంధామా...
ఈ భాల పాపిష్టి గర్భమున
జన్మించకా పోయెనో తండ్రీ.....
ఇలలోకి ఈ బాల జల్మించక పోయిన
ఈ పాపిష్టి గర్భమునకు శోకమే లేదూ
ఓ పరంధామా...
ఎందరికి హేడబాలలు జల్మించలేదు
ఎవర్కైన ఈ పాపిష్టపు రాత రాసెనా బ్రహ్మ.....

ఓ బ్రహ్మదేవా....
ఈ ఆడబాల ఏ జన్మమున ఏమి ఖర్మ
చేసి ఉన్నదో, తండ్రీ....
ఈ కాలమునకు ఇట్టి అవస్థలు జన్మించెను
ఈ బాలకయ్యా....
ఓ బ్రహ్మదేవా....

మాటలు : అని శోకించి, బ్రాహ్మణోత్తములను వారి వారి నగరుకు పంపినాదట; ఆ బాలకులను రేపు పెంచు బాలకులను, పూట బెంచుతున్నది; పూట బెంచే బాలకులను, రేపు పెంచుతున్నది, అంత హంత బాలకులా, ఆడుతా పెరిగిరి, వీథుల యందు, గోళీలు ఆటలు ఆడుచు ఉండగా, చిన్నవాడు కనక రవీంద్రుడు, అన్నా రమద్దేవి రాజా, ఆడితే బొంగరముల పందె మాడవలెను, సూడవలెనని వేడుక సభవారు, అని పలికెను ; ఆడేటి గోళీలు అట్లు సాలించి, తల్లి వుండేటి అంతఃపురమునకు కదలివచ్చిరి తనయులు, వొంగి దండము బెట్టి వందనము చేసి, మణి రెండు హస్తము మనవికి గట్టి, వినయపూర్వకముతో తల్లి ఎదుట నిలిచిరి తనయులు, కుమారా, రాజాధిరాజులు నీకు మ్రొక్కంగ మారాస్ప రాజులు నీకు మ్రొక్కంగ, ఆడవారికి మ్రొక్కిన ఆశ్చర్యమేమి?, తల్లియే దైవంబు, తండ్రియే గురువు, ఇంతకు మించిన వారు ఎవరమ్మా జగములోన?, కొని తెచ్చుకున్న వారే కాని, తల్లీ దండ్రులకు మించిన దైవమే లేరు, జననీ ఆడవలెను భొంగురముల పందెంబు, చూడవలెను వేడుక సభవారు, వేడుక్కి భొంగురంబు వెత్తాడవలెను, పంతానికి భొంగురంబు పట్టాడవలెను, సెలవులిచ్చి నను పంపవే ననుగన్న తల్లి; కుమారా మారాస్ప వారికి బొంగరముల పందెము అచ్చి రాదు తండ్రీ, నీకూ నీ తమ్ములకూ, ప్రొద్దుల బోకుంటే, కాశి నించి రామేశ్వరము, రామేశ్వరము నుంచి కాశికి, అన్న సలింద్రలు పెట్టించవయ్య, అందున కొంచెము ఫలితముంటుంది, అందున నీ తమ్ములకు నీకు

ప్రొద్దులు పోకుంటే, పల్లాన చెరువులు వేయించు, మిట్టన బావులు తవ్వించు, అందున నీ తమ్ములకు నీకు ప్రొద్దులు పోకుంటే, కోడి పందెమాడరా తండ్రీ కొదువ లేకుండ; జననీ కోడి పందెమంటే సామాన్యమనుకుంటివా?, ఆడది నాయకురాలు, అబద్ధీకురాలు, పిండిగోరుశక్తి, పణాతినాయకురాలు, ఆ విష్ణు వీశ్వర, బ్రహ్మయవతారమున జన్మించి యున్నాడు బ్రహ్మనాయుండు, నాయకురాలితో కోడి పందెము వొప్పి, గెలువలేక, కోడి రెండు తుండెములు, గోపన్న రెండు తుండెములు, అయిన వార్త ఎరుగవా జననీ; అదియును గాకుండ, మూడు పుట్ల ముప్పందుమ నల్ల పూసలు నల్ల గాజులు, చిట్టేటి రేవులయందు, పట పట తెంచి పోసిన వార్త ఎరుగవా జననీ? అది కోడి పందెమనగా, పల్నాటి వారికే కాని, మారాస్పవారికి వొమ్మిరాదు జననీ, అని పలికెను, ఎన్ని నీతులు చెప్పినా వినడాయెను కుమారుండు, జననీ, నీవు సెలువులిచ్చినా నేను బొంగరములాడవలెను, సెలువు లియ్యక పొయ్యిన పచ్చముగా బొంగరము లాడవలెను; అని తనయుండు బలికెను; కుమారా, అదే విధంబున, సోద్యమైన సోమవారము నాడు, చెన్నూరు వేలువాడు ఆ చెన్నరెడ్డి, పద్మనాభులరెడ్డి, పెంచెలరెడ్డి ఆరు నూరు గుఱ్ఱములకు సమద్వారి ఆదూరి బెమ్మిరెడ్డి, వన్నె గుఱ్ఱములకెల్ల, వనతూరి వీరరాగవుల రెడ్డి, వర పత్రికలు గొట్టించవయ్యా, ఎటువలెనంటే, పాముదాయల పట్నము ఏలుత వున్నది పద్మనందుల భాగీరతమ్మ, కయిన వర్ణ కుమారుడు రామారమద్దేవి రాజు, సోద్యమైన సోమవారము నాడు, ఊరికి ఎలుపల, బొంగరముల పందెము ఆడుతున్నాడని, మీ దండూ దళమూ, మంధూ మార్బలము, సీభందీకపు నాయకులు, సేనాధిపతులు, రావాలని, శుభలోఖలు రాయరా తనయా అని పలికెను; అదే విధంబున తనయులు శుభలేఖ వ్రాసిరి,

సోద్యమైన సోమవారము నాడు, రాజాధిరాజులు, ఆ ఊరికి వెలుపల మైదానముల యందు, గుడార్లు వేసుకొని, కొలువు దీరి యుండిరి, రెండు మూడు ఘడియలు చూసినా, బొంగురముల పందెము ఆడంగలేదు, రాజు బొంగురముల పందెము ఆడేది లేదని, వచ్చినవారు సభవారు చూచేది లేదని, వెళ్లిపోవుచున్నారు. తమ్ముడు కనక రావేంద్రుడు కదలి వచ్చి, అన్నా రమద్దేమిరాజా, నీవు భొంగురముల పందెమాడేది లేదని, వారి వారి నగరకు వెళ్లిపోవుచున్నారు, అని చెప్పగా, ఎండిదే ఝూలి, పయిడిదే బొంగురమ్మా, పయిడిదే భొంగుర్రంబు, వెండిదే జాలి, అస్తమున ఉంచుకొని, ఏదుము సాంబ్రాణి ఏక దూపము వేసి, పందుము మై సాక్షి పట్టి వెలిగించి, సాంభ్రాణి కర్పూరము సంకల్పము చేసి, ఆ మైదాన స్థలమున, భొంగురముల పందెము ఆడుతాడట, గర గర సుట్టెను, ఆంభ్రము మీదికి వేసినాడట బొంగురము, అంతంత భొంగురము ఆడుతా వచ్చి, బాలుని హస్తంబులో వ్రాలెను, మరల రెండవ తూరి గరగరా చుట్టి, ఆంభ్రము మీదికి వేసెను, అంతంత భొంగురము ఆడుతావచ్చి, బాలుని హస్తములపై వ్రాలెను, మూడోతూరి గరగరాచుట్టి, ఆంభ్రము మీదికివేసెను, ఆంభ్రము మీదకి వేయగా భొంగరము వ్రాలలేదు, ఒక గడియ జూచినాడు, బొంగరము వ్రాలలేదు, అయిదూ హేరు ఘడియలు చూచెను, బొంగురము వ్రాలలేదు. నవా పదకొండు గడియలు చూచెను, బొంగురము వ్రాలలేదు, తాంబూళము యందు పాలు పోసి, తమ్ముడా కనక రావేంద్ర, బొంగరము నీడలు చూడమనెను; ఆ పరాత్పరుని గురించి ప్రార్థిస్తాడట రామా రమద్దేవి రాజు.

శ్లోకం: రారా ... ఈశ్వరా... ఓ పరమేశ్వరా ... తండ్రీ
చిట్టేటి రేవులు నీకు శ్రీ మలిమి కొండా
కొండ వీర మామిడి కోన క్రింద మంచి గ్రందపుస్తళమో

మంచి గ్రంథ పుస్తకము సరసనా, తెల్లజిల్లేళ్లు
తెల్లజిల్లేళ్ళు సరసనా విబూది గుండములు
వీబూది గుండములోన అడుగులు తడ బడకుండ
జడలు ముడి బడకుండ, స్నానమాడినావా....
ఓ పరంధామా...
మా యింట హాడవారు పుట్టినా నీ పేరు పెడుదుమయ్యా....
మగవారు పుట్టినా తండ్రీ.... నిను సేరి కొలుస్తుము
మా మారాస్వారి వంశమున లేవా...
ఓ జగదీశ్వరా....

మాటలు : అని ప్రార్థింపగా, నల్ల మబ్బుల సాటున నా రూపు దాపాయెనని బొంగురము, అంతంత బొంగురము ఆడుతా వచ్చి, కోయటి వేసోదమ్మ మీ గాళ్లపై వ్రాలెను; బొంగురము ఏనాడు వ్రాలినాదో, చిమ్మించె రక్తంబు, చెలగి చిమ్మించెను, రక్త జూచి వెసోద మూర్ఛజెంది, భూపాత్రము మీదికి వరిగెను. వేసోద తల్లి ఎవరి గుండా ఈ అన్యాయము జరిగినాదని, వేచించి, ఆ రామా రమద్దేమి రాజును దూషిస్తాదట:

శ్లోకం : ఓరి క్రూరకర్మా... ఒక్కగాని ఒక్క కుమార్తె నాకూ
నేటి కాలమునకు, నీ హస్తముల గుండా,
ఒరగదోశావా ఓరి క్రూర కర్మా......
ఇంత గంఢభేరుంటి భాలుడవు కాబట్టే,
నీవు పుట్టీపుట్టక మునుపే
మీ తండ్రిగారిని ఆది భయంకరీ, లోక లోకాంభవీ...
ఆ గండ భేరంటి అరణ్య ప్రదేశంబున
మీ తండ్రి గార్లను కొర్లకు స్థాపము గావించెనూ......
ఓరి పాపకర్మా....

మాటలు : అని దూషించెను కొమటి యశోదమ్మ తల్లి. ఆ మాటతో రమద్దేవి రాజుకు, తెల్లటి నేత్రములకు ఎర్రటి కోపాగ్ని

కలగి, తన యోర్వగ కోపంబు సహించలేక, తల్లి యుండేటి హంతరపురంబునకు వేతెంచెను తనయుండు, ననుగన్న ఓ తల్లి నాయనదేవి, కంచు గుబ్బల భోరుతలుపులు ఓర్చెల్లవమ్మా, ఓర్చెల్లితే ఓర్చల్లినావు, ఓర్చెల్లకుంటే, ఇదిగో నా అస్తమున యున్నది చంద్రహాయుధంబు, చంద్రహాయుధంబుచేత నీ శిరంబు ఒక్క ఏటుకి అట్లా కండింపజేతును, అని కోపాగ్నీ తుండై గాంభీరముగా బలికెను. పట్టె మంచము పైన మరి పవళించి యున్నది తల్లి, ఘరుగు ఘరుగున వచ్చి, బంగారు భోరు తలుపులు ఓర్చిల్లెను, వంగి దండము బెట్టి వందనము చేసి; మణి రెండు హస్తములు మనిమికి గట్టి, జననీ, మా తండ్రులెవరు? ఎందు నిమిత్తార్థమై ఎచటికి వేంచేసి యున్నారు ? శీఘ్రముగా తెలపవే ననుగన్న జననీ, అని పలికెను తనయుండు;

శ్లోకం : ఇదేమి పాపమో కుమారా ఓ తండ్రీ...

మొదుళ్లు పోయినాయని ఒక ఆశ చేత ఉంటినీ.

మోములుండాయని సంతోషము చేత ఉంటిని తనయా...

మోములకు మొక్కవీరు పోసిన పాపాత్మురాలు ఎవరురా

ఓరితనయా...

మాటలు : అని పలికెను. జననీ, మా తండ్రి గారు ఎచ్చట ఉన్నారు, మా తండ్రిగారు చావులు నేను కళ్ల జూడవలెను, అమ్మవారట, ఆ రణరంగ మధ్యమున కొర్లకు స్థాపము గావించి ఉన్నాదట, ఆ చరిత్ర ఎట్టిదో, ఎరికింపవమ్మా, అని పలికెను తనయుండు, ఇన్ని సెప్పినా వినంగలేదు కుమారుండు, కాబట్టి కుమారా చెప్పెద వినుము, నీకైన ముత్తవ తాత మూడో తరము తాత, దేవాగి దేవ రుద్రుండు, అమ్మవారిని కొలచి కొన్నాళ్లు, కొలియక కొన్నాళ్లు, మదించి మద్గర్వించి, మధంబు సేబూని, మలపడి యున్నాడు, మీ తండ్రిగార్లు

అమ్మవారిని చిత్రహింసలు బెట్టియున్నారు, ఆ హింసలన్నీ భరించి అమ్మవారు, భద్రగిరి సింతామణి పట్టణమందు జంగమువేషము ధరించి, పుష్పములు ఖండించి, కాశీ దొంగలను బట్టి, మీ తండ్రిగార్లను, ఆ రణరంగ మధ్య ప్రదేశంబున, తాటి కొర్రులు గావించి, ఆ తాటి కొర్లకు స్థాపము గావించి ఉన్నది మీ తండ్రులను; అదీ కుమారా సంగతని పలికెను.

జననీ, శీగ్రముగా నాకు సెలవలిచ్చి పంపుము, మా తండ్రిగారి సావులు, నా కళ్లల్లో మెదులుసున్నవి, శీగ్రముగా సెలవలిచ్చి పంపవమ్మా, కుమారా, నీవెక్కడ అమ్మవారు ఎక్కడ తనయా, చూడ ప్రాయంబు లేదు, అమ్ముమవారును ఎదిరించు శక్తి చాలదు తనయా, అమ్మవారు ఎక్కడా? నీవెక్కడరా కుమారా?; జననీ, ఏ విధంబుననైనా మా తండ్రిగారిలిని, కొరల లేపవలె జననీ, అంతవరకు నా మనస్సుకు స్థిమితము లేదు జననీ, శీగ్రముగా నాకు సెలవలిచ్చి పంపుము. కుమారా, నీవు ఆకానన భూమి యందు మరణించినట్లయితే, నాకు నీ వార్తలు ఏమి దెలుస్త వున్నని కుమారా?; జననీ తెలిపెద వినుము. ఎట్లనంటే నేను కానల భూమియందు మరణించినట్లయితే, మనద్వారము దగ్గర తులసి మొక్క మలమల మాడినట్లయితే, కానల భూమియందు నా కుమారుడు చెల్లినాడనుకో, లేకుంటే నా కుమారుడు క్షేమాన ఉన్నాడనుకో, మన కల్యాణపు శంఖుని ద్వారము దగ్గర యున్నది, నాలుగు కాళ్ల తెలుపు, నడి నెత్తిన సుక్క, గురుడు బసవయ్య, అంబా అని అరసి, నేలకి ఒరిగినట్లయితే, ఆ కానన భూమియందు నా కుమారుడు చెల్లనాడనుకో, లేకుంటే క్షేమాన ఉన్నాడనుకో, నేను కానల భూమియందు చెల్లినట్లయితే, నీ సనురొమ్ము పాలు గుబ గుబ పొంగి, ఉప్పొంగి నట్లియితే, కానల భూములయందు, నా కుమారుడు చెల్లినాడనుకో, లేకుంటే క్షేమాన ఉన్నాడనుకో, జననీ, నీవిక్కడ శోకిచ్చినట్లయితే, ఆ కానన భూముల యందు

నాకు బహూ కష్టము కలుగు చున్నది, సంతోషముగా సెలవులిచ్చి పంపవమ్మా. కుమ్మరింటికి వెళ్లి, కొత్తభాండవ తెచ్చి, అడ్డ శారడు వడినట్టు బియ్యము జోలియందు ఉంచుకొని, తల్లీ నన్ను దీవించి పంపవమ్మా. కుమారుణ్ణి, దీవిస్తాదంట పద్మనందుల భాగీరతమ్మ; కుమారా, అత్త మామల వంటి ఆవిస్సులు గలిగి, తొక్కన దరణమ్మ నీకు తోడునీడయ్యి, పగవాడి హస్తంబు నీకు కిందు గావలెను, నీ అస్తంబు మీదు కావలెను, క్షేమాన బోయి లాభాల వర్ధిల్లరా తనయూ, అని దీవించెను. అక్కడ నుంచి కుమారుండు, అరణ్య ప్రదేశంబు, దారి మార్గము బట్టి, కదలి వేంచేసెను, పొయ్యేటి కుమారుని చాయతప్పకా చూచి, ఆ పుత్ర శోకము భరింపలేక, బహూ సింతాక్రాంతముతో ఆ తల్లి, వింటికి వేంచేసెను. కుమారుండు గండ భేరంటి అరణ్య ప్రదేశమునకుబోయెను. అరణ్యములో ధారి కానక, పోయిన దారినే పోతాడు, పోయిన దారినే ఎనక్కి వస్తాడు, కడుపులో కుద్బాధకు నిలువజాలక బాలుండు, తత్తరిల్లిపోసాగెను. అక్కడకు దివ్య మున్నూరామడ దూరంబుయున్నది, చుక్కలకు ఎదిగి ఉన్నది పక్షారి వృక్షంబు, ఈ రుక్షంబు కడల కేగి, రుక్షంబునెక్కి చూచిన ఎక్కడైన అగ్నియుండును, అగ్ని యున్నచోట నీళ్ళు ఉండును, భుక్తిత్వము చేసికొని భుజింపవచ్చును, అని భీతి చేత బాలుండు, ఆ పక్షారి వ్రిక్షంబు కడలకు వేంచేసెను, ఆ వ్రిక్షంబెక్కి చూడ, అక్కడికి దివ్య మున్నూరామడ దూరంబున, కుంభస్థానమై అగ్ని జ్వాలలు వెలుగుచున్నవి, ఆ యగ్ని ఉన్న చోట జలంబు ఉండును, బోజనము చేసుకొని భక్షింపవచ్చునని, ఆ పరమట ప్రదేశము కొమ్మను, అడ్డ వాకలేసుకుండూ, సెట్టు సాలా దిగెను బాలుండు, ఆ దారి ప్రదేశమును బట్టి, ఆ యగ్ని జ్వాలల కడకు వేంచేసెను, అక్కడ మునీశ్వరుండు తపస్సు చేస్తూ ఉన్నాడు. దివ్య మున్నూరు సంవత్సరముల నుండి తపస్సు చేస్తూ ఉన్నాడు. ఎటుల చేస్తూ ఉన్నాడంటే, ఆ ఋషి సెవ్వల యందు గిజిగాని గూడులు బెట్టి యున్నవి, ఆ ఋషి

శిరముయందు, ఎదురు భొంగులు మొలచియున్నవి, ఆ ఎదురు బొంగులు పరమటు గాలి శాంబరమ్మునకు రాచుకొని అగ్ని జ్వాలలు మండుచున్నవి. ఈ ఋషిని నేనుపలకరించి నట్లయితే, ఈ ఋషి నాకు ఏదో శాపగ్రాతము చేస్తు ఉన్నాడని, బాలుండు అగ్ని తపస్సు చేయ ప్రారంభించెను, చారెడు బియ్యమునకు రెండు చారల ఉతకంబు పోసెను; మూడు పక్కల మూడు రాళ్లను ఉంచి, ఒక్క ప్రక్క తన మోకాలను ఉంచి, చిచ్చుకు హగ్ని అంటించెను; ఘుస్సున ఊదెను, భగ్గున మండినది, సగ్రన కాలెను కాలు, ఆ మోకాలు పక్కకు ఓర్చిల్లెను, భాండవ భూమ్మీద ఒరిగెను, ఈ విధమున అగ్ని తపస్సు చేస్తూ ఉన్నాడు బాల చంద్రుండు; తన రెండు నేత్రములు ఎత్తి మునీశ్వరుడు భాలుని సాయ తప్పక చూచెను; భాలుడు చాలా సౌందర్యవంతుడుగా నుండెను. ఈ భాలుడు ఇంత సౌందర్యముగా నున్నాడే, ఈ బాలుని కన్న తల్లి గర్భము ఎంత ఆనందముగా నుండవచ్చును, ఈ బాలుని కానల భూములకు పంపి, ఆ తల్లి మనసు ఎట్లు వొప్పెను, ఓరి భాలకుమారా! నీదే పట్టణము? నీ జననీ జనకులు ఎవ్వరు? నీవు స్త్రీ గర్భమున జన్మించిన బాలుడవు కాదా? రెండు చేతులూ ఎత్తి ఆ మునీశ్వరునికి నమస్కరించెను. ఓ పరాత్పరా, నేను శ్రీ గర్భమున జన్మించినవాడనే స్వామీ, మీబోటి ప్రభువులకు బుక్తిచేసి పెట్టిన వాడనె, మునులకు ముక్కువ వుంటాది ముని కోపమని నేను అగ్ని తప్పసును చేసితిని స్వామీ, అని పలికెను, బాల కుమారా! నీదే పట్టణము?, పాముచాయి పట్టణము, ఎందు నిమిత్తార్థమై ఈ అరణ్య ప్రదేశములకు వస్తివి బాలుడా? స్వామీ! పాముచాయిల పట్నము ఏలుతున్నది పద్మనందుల భాగీరతమ్మ, నాకైన జనని, మా తండ్రిగారు ఏడుగురు మారాస్వరాజులను, ఊరికి ఉత్తరావ ఉభయర్ల కాటిలో రణరంగ ప్రదేశమున, గండా భేరుండ అడవి ప్రదేశములో, కొర్లకు స్థాపము గావించినదట ఆదీ భయంకరీ, లోక లోకాంభవీ జగత్కల్పవల్లి, మా తండ్రిగారి సావులు కళ్లు

చూచుటకై, అరుదెంచితిని స్వామీ ; బాలుడా! నీవు ఎక్కడ, హమ్మవారు ఎక్కడ? ఒక సెంపగొడితే వసగారుచున్నది, ఒక సెంపగొడితే పాలుగారుచున్నవి, కత్తి పెట్టి విర్థంబు సేయలేవు కుమారా, పసివాడవే, అమ్మవారిని ఎదిరించుటకు శక్తి చాలదు, తిరిగి ఇంటికి పోతనయా. ఆ చేతులు జోడించి, శరణాని వేడెను మునీశ్వరుని, మా తండ్రిగారిని కళ్ల జూడలేని పక్షమునకు, ఇదిగో నా అస్తమున యున్నది చంద్రహాయుధము చేత, నా శిరంబు గోసుకొని, నీకళ్ల ముందరనే ప్రాణంబు విడుతు తండ్రీ, అని పలికెను బాలుండు, ఇంత చెప్పిన బాలుండు వినడాయెను, బాల చంద్రా ఇదిగో పన్నెండు మెట్టుల పైడి కిన్నెర కిన్నెర జేయిస్తున్నా, ఈ కిన్నెర హస్తమున బెట్టుకొని, అరి నామస్మరణ జేయుచు, నీ తండ్రిగారిని కొరల వేసిన సింత లేకుండా ఇక్కడికి దివ్య మున్నూరామడ దూరమున, భుజని మాంకాళి పట్టణమున్నది, ఆ పట్టణము సమీపంబునకు పోయి, ఒక్క మెట్టు కదిలించు తనయా, అమ్మవారు ఎక్కేటి, అసర వాహనము వచ్చుచున్నది, హసర వలె అచ్చోట నొక్కు, ఆ అసర వాహనము నాలుగు ప్రదేశములు జూచి, అరణ్యముల కెళ్లి పోవుచున్నది. ఒకటి, రెండు, మూడో మెట్టు కదిలించు అమ్మవారు ఎక్కేటి నక్కవాహనము వచ్చుచున్నది, నక్కవలె అచ్చోట నక్కరా తనయా నవ పదకొండవ మెట్టు కదలించు, అమ్మవారికి ఎక్కడలేని ఉల్లాసంబు గలిగి మెట్టు మెట్టుకు మేడ మేర్పలములు దిగి వస్తున్నది. ఆ ఆనందకోపులు వాయిస్తూ, ఒట్టే రేగడి గెడ్డల్లోకి తియ్యరా తనయా, అమ్మవారికి నీవు వాయించేటి వాయిద్దపు కోపులకు ఎక్కడలేని ఉల్లాసంబు కలుగుచున్నది, హోడి, హలసి, సొలసి, ఆగ్రురాలయ్యి, బాల చంద్రా, ఇచ్చటనే యుండుము, నా పన్నెండు భద్ర ఆయుధంబులు, భవనంబుపై ఉంచి మరచి వచ్చినా, వెత్తుకోని వస్తానని అమ్మవారు పోతది. అమ్మవారు పోయినదా, నీవు కనుక్కో జాలవు, ఇదీ సంగతి బాలచంద్రా.

ఆ పన్నెండు మెట్ల పయిడి కిన్నెర వీబూదితో మంత్రోపదేశము చేసెను మునీశ్వరుండు, ఆ పన్నెండు మెట్ల పయిడి కిన్నెర హస్తమున ఉంచుకొని, హరి నామస్మరణ జేయుచు, ఆనందముతోనూ, తన తండ్రిగారిని, కొర్లేసిన దుఃఖము లేకుండా, అక్కడికి దివ్య మున్నూరు హామడ దూరము నడచెను. భూజని మాంకాళి పట్టణము సమీపమునకు వచ్చి, ఆ పయిడి కిన్నెర తొలి మెట్టు వాయించెను. అమ్మవారెక్కేటి అసుర వాహనంబు, వచ్చెను. అసరమై బాలుండు అట్ల నక్కేను; ఆ ఆసర వాహనము నాలుగు ప్రదేశములు జూచి అరణ్యమునకు వెళ్లిపోయెను. అయిదో మెట్టు కదిలించెను. అమ్మవారు ఎక్కేటి నక్క వాహనము వచ్చెను. నక్కవలె అచ్చోట నక్కేను. నాలుగు ప్రదేశంబులు చూచి అరణ్య ప్రదేశమునకు వెళ్లిపోయెను. నవా పదకొండవ మెట్టు కదలించెను. అమ్మవారికి ఎక్కడలేని ఉల్లాసము కలిగి, ఆనందము తొక్కుతూ, మెట్టు మెట్టుకు మేడ మేర్భలము దిగి వచ్చెను. అమ్మవారిని ఆనందకోపులు వాయిస్తూ, ఒట్టి రేగడి గెడ్డలకు దీసి, ఆనందము దొక్కించి, అమ్మవారికి శాంతము పెట్టాడట.

ఏ విధమున బెట్టాడయ్యా?

వర్ణము : మా తండ్రి తాతల తరమునా... నిన్ను గొలిస్తిమమ్మా
నా బిడ్డ బిడ్డ తరముల నిన్ను కొలిస్తిమమ్మా
ఓ దైవమా....
శాంతమే రేణుకా, శాంతమే ఆదిశక్తి
శాంతమే మహమ్మాయీ...
శాంతమే శారదాంబా.

మాటలు : అని అమ్మవారికి శాంతం పెట్టినాడట. శాంతము బెట్టి, బాల కుమారా, నా పన్నెండు భద్రాయుధంబులు, నా భవనంబు పై పెట్టి మరిచి వచ్చినా, ఇక్కడనే ఉండరా బాలచంద్రా , నేను పోయి అమిత త్వరితముగా వచ్చెదను, అని పలికెను. ఓ తల్లీ జగన్మోహినీ, నీవు హోడీ అలసీ సొలసి ఉన్నావు

తల్లీ, నేను బోయి నీ చంద్రహాయుధంబులు ఎత్తుకొని అమిత త్వరితముగా వస్తాను, అని పలికెను బాలుండు. నా ఏడు భవనముల పైన, నూటొక్క శక్తులు తమ్ముడు పోతురాజు ఉన్నారు. అక్కడకు పోయినా ఈ బాలుడు , అరటి పండు దిగ్రమింగిన చందమున మింగేస్తారు. అట్లనయిన బాలుడు నశింపబోతాడని, అమిత సంతోషపడెను. అర్వై ముగ్గురు తొమ్మనూ్నట సిద్ధులు అరినామ స్మరణ జేయుచూ, ఆ దారి మార్గ ప్రదేశంబున వచ్చుచున్నారు. ఓ సిద్ధులారా, మా యమ్మ వారు ఎచ్చటికైన పోతాదేమో భద్రం, ఆ భవనమునకేగి, పన్నెండు భద్రహాయుధములు ఎత్తుకొని అమిత త్వరితముగా వచ్చెదను. జాగరీకులయియ్యి మెలుంగరయ్యా సిద్ధులారా!, అని పలికెను బాలుండు, అమ్మవారు చుట్టూ, తొమ్మనూ్నట సిద్ధులు కొలువు తీరి రాం భజన చేస్తూ ఉన్నారట.

శ్లోకం : శ్రీహరీ... ఓ పరంధామా..
గండ భేరంటి బాలుండూ, భవన మార్గము సూపా...
ఇక రవుద్రుకారుండాయెనూ...
తన తండ్రి వారలను కొర్లకు స్థాపనము చె నందులకు
తన కోపంబు ఓర్వ జాలక
తెల్లటి నేత్రములకు ఎర్రటి కోపాగ్ని కలిగి
రవుద్ర కారము మీదా...
ఇక ప్రళయ రుద్రుడు వలె వస్తాడూ...
బాలుడు భవనంబు దగ్గరకూ..
బాలుడు భవనంబు దగ్గరకు వస్త వుంటే
కారంత మబ్రులు క్రమ్మీ
ఇక కమ్మెను ఎర్ర గావురులూ..
ఎర్ర గావురలోన ప్రళయరుద్రుడు వలె
బాలుడో కదిలె భవనముకు...

మాటలు : బాలుడిట్ల వచ్చుచుంటే, తమ్ముడు పోతురాజు, మాటొక్క శక్తులు, మన అప్పగారిని తోలుకొని పోయి ఉన్నాడు ఈ పాప కర్ముండు, మన అప్పగారిని— ఎక్కడనో మృతి జెందించెను, వీడు పెట్టేటి చిత్రహింసలకు భరించలేక మన అప్ప మనముండేటి పోబిడి చెప్పేను. కాబట్టే ఈ బాలచంద్రుడు ఇంత ప్రళయరుద్రుడు వలె వచ్చుచున్నాడు మన దగ్గరకు, అని మాటొక్క శక్తులు తమ్ముడు పోతురాజు, ఆ హిమాగిరి పర్వతములను బట్టి, భవనమును వదిలి పారిల్లి నారట; ఆ భవనమునకు వేంచేసిన బాలచంద్రుడు, పన్నెండు హస్తముల పన్నెండు భద్రాయుధములు, సేతను ఉంచుకొని, ఏమిటి ఆ ఆయుధము లంటే?—

దుష్టుల మర్దించ దుడ్డు ఒక చేత,
అసురుల మర్దించ అంబు ఒక చేత ,
చేడెల మర్దించ శక్రము ఒక సేత
శూరులు మర్దించ శూలము ఒక చేత గంటవక
చేత గాలము ఒక చేత
విల్లు ఒక చేత మనంబు ఒక సేత
చంద్ర హాయుధంబు ఒక చేత

ఇన్ని భద్రాయుధంబుల చేత ఉంచుకొని, భవనము దిగి వస్తున్నాడు బాలచంద్రుడు, వచ్చేటి బాలుని సాయ, తన నేత్రములు ఎత్తి తప్పక చూచెను అమ్మవారు, వీడు ఎవరో, గండ భేరండి బాలుడు ఉన్నట్లున్నది, నా చెల్లెళ్ళు మాటొక్క శక్తులను ఏమి చేసెను, వీడి హస్తమునకు చిక్కినా నేను, పెద్ద శ్రమ బెట్టుచున్నాడని, తను కొలువు దీరి యున్న సట్టుబండను, తను బద్దలుగా పగలదన్ని, నాగలోకంబు పోయి చేరెను. అమ్మవారు ఉండేటి తావుకు కదలి వచ్చినాడటు బాలుడు, ఓ సిద్ధులారా, మా అమ్మవారు ఎచ్చటకు పోయినదో, ఏ ప్రదేశమునకు పోయెనో, వెరిగింపుడయ్యా సిద్ధులారా?, ఓ బాల చంద్రా, తూరుపు ఉత్తరము నాలుగు ప్రదేశములకు పోలేదు, తన కొలువు దీరియున్న

సట్టుబండను, బద్దలుగా పగలదన్ని భూగ్గోణమునకు పోయెను అని చెప్పిరి సిద్దులు.

సిద్దులారా!, నాగలోకము పోయిన అమ్మవారిని, నరకలోకము దోడ్కొని వచ్చి, అమ్మవారికి దేవస్తానము గట్టించి, వేడు దినములు ఉత్సవములు చేయించెద, అందున ఒక రాత్రి సిద్దులకు సిద్దకూటములు పెట్టించెదను. మీ మీ తావులకు వేంచేయుడయ్యా సిద్దులారా అని పలికెను. అమ్మవారు పోయినా సోరణకంత, ఆ సోరణకంత గుండా, నాగలోకము పోత ఉన్నాడు బాలుడు, వచ్చేటి బాలుని చాయ తప్పక చూచెను అమ్మవారు, ఈ బాలుండు నాగలోకము కూడా వచ్చుచున్నాడని, అమ్మవారు వచ్చి నా సోరణకంతను, ఆ గడ్డ ఇటు, ఈ గడ్డ అటూ కలవొత్తినాదట, దారి కానలేదు బాలచంద్రుండు, పేగులు ఎముకలు కపబోతువున్నవి, తట్టుకొనజాలక, ప్రాణంబు పోయీ వచ్చినట్లు అనిపిస్తు ఉన్నది బాలునకు, ఆ పరమేశ్వరుని గురించి, ప్రార్థిస్తాడయ్యా,

శ్లోకం : శ్రీహరీ... ఓ పరమేశ్వరా... తండ్రీ
చిట్టేటి రేవులు నీకు శ్రీ మారిమి కొండా
కొండ వీర మామిడి కోన కింద మంచి గంధ పుస్తలమూ
మంచి గంధపుస్తళము సరసన, తెల్ల జిల్లేళ్లు,
తెల్ల జిల్లేళ్లు సరసన, విభూది గుండములు
వీభూది గుండములలోన, అడుగులు తడబడకుండా
జడలు ముడిబడకుండ, స్తానమాడినావా?....
ఓ పరమేశ్వరా..

మాటలు : అని ప్రార్థింపగా, నాగలోకమునకు దారి మార్గము గాన్పించెను, కాన్పించగా నాగలోకమున నలుగురు దేవతలు ఉండ, నాగలోకములో ఏమీ ఎరుగని వలె, పద్మ సాలివారి శ్రీ అయ్యి, ఒడుగులు వేపుకుంటున్నదట, శిరమెత్తి

ఆ శ్రీ సాయ తప్పక చూచెను బాలుండు, ఒడిసెంబు వారు వీరజడలటు బట్టెను. 'ఏ బాలుండా! ఎవడవురా నీవు?' 'దైత్య ఎవతెవె నీవు?' అని తరక వాదించి, ఆది కూర్మడు సాటుక బోయెను. అమ్మవారిని ఒడిచి పట్ట బోయెను బాలుండు, ఆది కూర్మండు, ఓరి భాలచంద్రా, మా పరుగున దాగిన అమ్మవారిని పట్టుటకు ఎంత మాత్ర పోడివిరా బాలుడా? అని పలికెను, చేతులు జోడించి, శరణాని వేడెను ఆది కూర్మని, పరాత్పరా, నాగలోకములో ఉన్న అమ్మవారిని, నరకలోకము తోడ్కొని పోయి, దేవస్తానము గట్టించి, ఉత్సవములు చెయించెద, ఒక నాటి రాత్రి ఆదికూర్మడకని, ఒకనాడు వేడుక చేయించెద, అని పలికెను బాలుండు, లంచమునకాశపడి, ఆదికూర్మండు, పక్కకు తొలిగెను, అమ్మవారు వీరజడలు ఒడిసిపట్టెను, అటుల తప్పించుకొని అమ్మవారు, ఒరే బాలుడా, ఎవ్వడవురా నీవు? దైత్యా ఎవతవే నీవు? నీవు పుట్టిన పుట్టుగడచెప్పరా బాలుడా? నీవు పుట్టిన పుట్టుగడ చెప్పవే దైత్యా? నేనుపుట్టిన పుట్టుగడ చెప్పితే బాలుడా, భగ్గున మండిపోతున్నావు, నేను పుట్టిన పుట్టుగడ చెప్పితే దైత్యా మండిపోతున్నావే దైత్యా, బాలుడా, నీ ఎదుట నేను, గరుకుల గరుకుల కాకరకాయనయ్యెదను చూడుము. దైత్యా నా యెదుట నీవు కాకరకాయవైతే కాకరకాయను కరుక్కున తెగ్గోసే రాంబాణము నయ్యెదను దైత్యా, బాలుడా, నీ ముందర నేను సాది కొంగను అయ్యి సప్త ఏడు సముద్రముల మీదికి, సందీ జపములకు పొయ్యెదను చూడు బాలుడా? దైత్యా! నీవు సాది కొంగవై సప్త ఏడు సముద్రముల మీదిగి సందీ జపములకుబోతే సాది కొంగను తన్నే, సార్వడేగనయ్యెదను చూడవే దైత్యా

అనిన, అమ్మవారు ఆదిశేషుని చాటుకు పోయెను, ఒడిసి అమ్మవారిని పట్టబోయెను బాలుండు, ఓరి బాలచంద్ర, మా మరుగున దాగిన అమ్మవారిని పట్టుటకు, నీవు ఎంత మాత్ర పోడివిరా? ఇదుగో చూడుము నిన్ను ఒక్క వేటుకి, మృతి జెందించెద, అని పలికెను ఆది శేషుండు, పరంధామా, నాగలోకములో ఉన్న అమ్మవారిని, నరలోకమునకు తోడ్కొని పోయి, అమ్మవారికి దేవస్థానములు గట్టించి, వేడుకు కొలుపులు చేయించెదను; ఒక నాటి రాత్రి శేష పానుపు అని, నీకు ఉత్సవము జేయించెదను. ఆ లంచమునకు పాలుపడి, ఆదిశేషుండు పక్కకు తొలిగెను. ఒడిసి అమ్మవారి వీర జడలు పట్టెను బాలుండు,

ఎవ్వడవురా బాలుడా! మాట మాటకి నాతో, తరకవాదిస్తున్నావు? నీ ఇలపొగురు, నా కొలపొగురు, పగడసాల పందెము వద్ద తెలుపుకొందము రారా బాలచంద్రా, నీవు పుట్టిన పుట్టుగడ చెప్పుము. దైత్యా! నీవు పుట్టిన పుట్టుగడ చెప్పుము అయితే చెప్పెద వినుము బాలుండా. కృత యుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము ఒక గుడ్డు పెట్టియున్నా, ఆ గుడ్డుకు మూడు అరలు గలిగెను.

ఒక అరయందు బ్రహ్మ గలిగెను ఆ బ్రహ్మ దేవుని సాయ సొచ్చి నాకు మోహ ప్రీతి కలిగెను బ్రహ్మ నా మోహము దీర్చుమంటిని, నీవు తల్లివి కావలెనని పలికెను బ్రహ్మదేవుడు.

రెండో అరయందు విష్ణువు కలిగెను, విష్ణుదేవా నా మోహము దీర్చుమంటిని, నీవు తల్లివి కావలెనని పలికెను ఆ విష్ణు దేవుండు. మూడో అరయందు పరమేశ్వరుడు కలిగెను పరమేశ్వరా నా మోహము దీర్చుమంటిని, శక్తి చాలదే తల్లి నీ మోహము దీర్చుటకు అని పలికెను పరమేశ్వరుండు ఆ మోహ ప్రీతిచేత నా బాహుబలములన్ని పరమేశ్వరునకంగీకరించితిని. నా

మూాడో చిత్ర కన్ను పరమేశ్వరునకిచ్చితిని. ఈశ్వరా! నా మోహము. దీర్ఘమంటిని ఈ జన్మములో నాకు తల్లివని పలికెను పరమేశ్వరుండు, దుడుకున పరమేశ్వరుని శపింపబోతిని, ఆ మూాడు చిత్ర కన్నువెత్తి నా సాయదృష్టించి చూచెను పరమేశ్వరుడు భగ్గున మండి బూడిదై పోతిని బాలచంద్రా, బూడిదయ్యి పోయి, బ్రహ్మకు సరస్వతినై, విష్ణుకు లక్ష్మీదేవినై, పరమేశ్వరునకు బాల పార్వతినై జన్మించితిని. కాబట్టి ఇదే నేను జన్మించిన పుట్టుగడ నీవు ఏ విధమున జన్మించితివో శీఘ్రముగా వెరిగింపరా బాలచంద్రా!

దైత్యా ! అయితే చెప్పెద వినుము ఏడుగురు మారాస్వరాజులను, కొల్లేరు పెంటన, కొర్లకు స్థాపన గావించిన నాడు పామురాయిల పట్నమేలుత వున్నది పద్మనందుల భాగీరతమ్మ పద్మనందుల భాగీరతమ్మకు వేపకాయంత పిండము వేరుపడియున్న, నీకు వైరై జన్మించితినే దైవమా అని పల్కెను నాకు వైరివి కాబట్టి బాలచంద్రా, నాతో మాట మాటకు తర్క వాదిస్తున్నావు బాలచంద్రా, నీ యిల పొగురు, నా కొలపొగురు పగడసాల పందెము దగ్గర తెలుపు కొందము రారా బాలచంద్రా అని పలికెను. పగడసాల పందెం బాడ ప్రారంభించిరి.

రాజు మీద అమ్మవారు మూాడాటలు ఎక్కువాడి యున్నది, అమ్మవారి మీద రాజు మూాడాటలు ఎక్కువ అడి యున్నాడు. రాజు మొఖార బింబము తప్పక చూచి అమ్మవారు, పక్కున నవ్వెను. చంద్రహాయుధము బర్రున దీసి అమ్మవారి కుతుక్కి దాపెను బాలుండు, నేను ఆడిన ఆటల్లో ఏమి తప్పులో ఏమి ఒప్పులో ఎరిగించవమ్మా,

బాలచంద్రా ఆడవారము మేము, అలసి నవ్వానో సొలసి నవ్వానో, ఆడవారి పైన ఇంత ఆందోళమేలనయ్యా శరణమే రేణుకా, సాక్షాత్తుగా విన్నవింపవమ్మా, అయితే బాల చంద్రా,

తెలిపెద వినుము మీక యిఖ జనని, పద్మనందుల భాగీరతమ్మ కయిన అన్నదమ్ముళ్లు, అరవై ముగ్గురు గోవింద రాజులు, అందరికన్న పెద్దవాడు, ఆదీ పెద బాల గోవిందరాజు, ఆ తుమ్మెద భల్లాళ రాజుతో యుద్ధంబు సేయలేక హిమాగిరి పర్వతంబులకు పారెల్లుచున్నారు, అని పలికెను అమ్మవారు.

జననీ, ఆ తుమ్మెద భల్లాణి రాజు మీదకు విద్ధంబు సేయుటకు నాకు సెలవులియ్యవే జననీ, వాడి మూాడు శిరంబులు, ఆరు హస్తములు ఖండించి, తప్పక నీకు కనక నివాళినిచ్చెద, అని పలికెను.

బాల చంద్రుని దీవించి తుమ్మెద భల్లాణ రాజుల మీదికి విద్ధానికి పోతువుండ, బాలచంద్రా, తుమ్మెద భల్లాణ రాజు సామాన్యమనుకొంటివా?

నీవు విద్ధమునకు పొయ్యినా తదుపరి తుమ్మెద రాండవల ప్రయోగము చేయును, అటువంటి సమయములో నన్ను ప్రార్థించినట్లయితే, మల్లె పుష్పముల రథము పంపిస్తును, వాడి తుమ్మెద రాండవలన్నీ పుష్పములపైన వ్రాలును, అమ్మిడే నన్ను మరల ప్రార్థించినట్లయితే, అగ్ని రథము పంపెంతును, ఆ అగ్ని జ్వాలల దెబ్బకు, ఆ తమ్మెదలకు నయనములు కోల్పోతు ఉన్నవి, అని చెప్పి, సెలవులిచ్చి పెంపెను. తుమ్మెద భల్లాణ రాజుతో విద్దంబు సేయ ప్రారంభించెను రామా రమద్దేవి రాజు అమ్మవారిని మరచినాడు, తన శక్తితో విద్దంబు సేయ ప్రారంభించెను, తుమ్మెద భల్లాణ రాజు, తుమ్మెద రాండవల ప్రయోగము చేసెను, రామా రమద్దేవి రాజుకు, అవతలకు ఇవతలకు రంధ్రములు కొట్టెసెను తుమ్మెద రాండవలును ఆ రంధ్రము గుండా మణిసిలు గనపడుచున్నారు ఆ బాధలకు భరించలేక రమద్దేవి రాజు, ఆ జగన్మాతను ప్రార్థిస్తాడట.

శ్లోకం : శ్రీహరే .... ఓ దైవమా..

నిన్ను మరచి ఇంతా రణములో విద్ధము చేయ నేనొస్తి

నమ్మా
మదించి మద్గర్వముచేత నిను మరచితినీ
శరణమే రేణుకా, శరణమే ఆదిశక్తీ
శరణమే తిరుబ్బయంకరీ,
శరణమ్మా మా పాలా....
ఇక మమ్ము కాచి రక్షించవమ్మా
మా పెద్దల పూర్వకము నుండి నిన్ను గొలుస్తుము
మాబిడ్డ తరముల నుండి ఓ జననీ...
నిన్ను గొలుస్తుమమ్మా!

మాటలు : అని ప్రార్థించినాడట, ప్రార్థింపగా,
మల్లె పుష్పముల రథము బంపించెను
ఆమల్లె పుష్పముల రథముతో
తుమ్మెద రాండవల ప్రయోగము చేసెను
తుమ్మెద ఖల్లాణ రాజు, ఆ తుమ్మెదలన్నీ,
ఆ మల్లె పుష్పముల పైని వ్రాలెను.
అమ్మిడినే మరల అమ్మవారిని ప్రార్థించెను రమద్దేవి రాజు
అగ్ని రథమును బంపించెను
ఆ తుమ్మెదలకు నయనములు కాలి
విలవిల ప్రాణంబులు విడిచెను.
అప్పుడు తుమ్మెద ఖల్లాణ రాజుతో
యుద్ధంబు చేసినాడట రమద్దేవి రాజు
ఒక శిరసు నరికి ఆంభ్రమము మీదికి వేసినాడు
రెండవ శిరసు నరికినాడు
అస్త్రమున ఉంచినాడు
మూడవ శిరసు నరికినాడు, ఆంభరము మీది
శిరసు వచ్చి మొండెమునకు కరుచుకున్నది.
ఈ విధమున శ్రమ పడుతున్నాడు బాలచంద్రుడు
సార్వడేగయై అమ్మవారు
ఆ మూడవ శిరసును తన్నుకొని
వీరభద్రుని దేవస్థానము యందు

పానుపట్నము సోట భద్రపరచెను
తుమ్మెద భల్లాణ రాజు
రెండు శిరసులు, మూడు హస్తంబులు, ఖండించుకొని,
అమ్మవారికి కనకని వాళివ్వను ప్రారంభించెను
బాలచంద్రా ! తుమ్మెద భల్లాణ రాజుకి
ఆరు హస్తంబులు, మూడు శిరంబులు గదా ఉండేది.
రెండు శిరసులు, ఆరు అస్తములు, తెచ్చావు
కారణమేమి రా బాలచంద్రా?
ఆ యుద్ధములో తల్లీ,
కల్లిలో శిరసు కాన్పడలేదు
ఆ శిరసుకు బదులు, ఇదిగో నా శిరంబు తీసుకోవే
దైత్యా!
అని బొడ్డులో ఉండేటి చంద్రహోయుధంబు బర్రున
పెరికెను
ఆ చంద్రహోయుధము అమ్మవారు పట్టుకొని
శాంతపడరా బాలచంద్రా!
నీ ధైర్య సాహసము ఎట్టిదో అని పన్నితిని
ఆ వీరభద్రుని, దేవస్థానము యందు
భద్రపరచి యుంటిని
శిరంబు వెత్తుకొని రారా బాలచంద్రా అని పలికెను
ఆ శిరంబు తెచ్చి బాలుండు
ఆ మూడు శిరంబులు,
ఆరు హస్తములు
అమ్మవారికి కనక వివాళ్లు ఇచ్చినాడట
ఓ తల్లీ, జగన్మోహినీ
ఇక్కడి నుంచి నేను కదలి పోయినది మూడు ఘడియలు
ఆడ విద్ధము చేసినది మూడు గడియలు
తిరిగగి వచ్చినది మూడు ఘడియలు
నవా తొమ్మది గడియలైనదే
ఈ శిరంబులకు ప్రాణములు పోక ఉన్నది

కారణంబేమి జననీ?
బాల చంద్రా! మీకైన మేనమామలు
అరవై ముగ్గురు గోవింద రాజులు
గోవిందరాజులకూ తుమ్మెద భల్లాణ రాజుకూ క్రూర
విరోధంబు
వారి మొకంబు చూచినా
తప్పక ప్రాణంబులు విడుచును
జననీ, నాకు సెలవలిచ్చి పంపవమ్మా,
అతి శీఘ్రముగా పోయి వచ్చెద

బాలచంద్రా, నవా తొమ్మిది గడియలు సెలవులు ఇచ్చి వున్నా.

ఈ తొమ్మిది గడియలు దాటినా తదుపరి, నేను నీ కళ్ళకు కన్పించను, అతి త్వరితముగా రారా బాల చంద్రా అని పంపెను; అరవై ముగ్గురు గోవింద రాజుల వద్దకు కదలి వచ్చెను రమద్దేవి రాజు; వాళ్ళ శిరంబులు చూపగా విల విల ప్రాణంబులు విడచెను శిరంబులు; అందరికన్న పెద్దవాడు ఆదీ పెదబాలగోవిందరాజు, బ్రాహ్మణోత్తములను బిలిపించి, పగవాడి శిరంబు కొట్టించి, మాకు సూపినాడు గనక, ఈడు మాకు ఏమి గావలెనో, మేము ఈ బాలునకు ఏమిగావలెనో, ఎరిగింపడయ్యా బ్రాహ్మణోత్తములారా, అని పలికెను; కవులు వేదంబులు చూచి, మీకైనా చెల్లెలు, పాము రాయల పట్నము ఏలుత యున్నది, పద్మనందుల భాగీరతమ్మ కయిన వర్ణ కుమారుడు రామారమద్దేవిరాజు అని పలికిరి, శుభ ముహూర్తము పెట్టించి, పెద బాల గోవింద రాజు కుమార్తె "ఉత్తర నలగంగ" ను ఇచ్చి ఒడుగుల శ్రీ కల్యాణము వొనగూర్చిరి, అప్పటికి నవాతొమ్మిది గడియలా యెను, బాలుడింకా రాలేదని, అమ్మవారు అచ్చట నుండే, కదలిపోయెను, భార్య భర్తలను, విశ్రాంతి గా పడకటింటియందు ఉంచిరి. ప్రాణేశ్వరీ, ఇప్పుడు నీ దగ్గర యుండుటకు నాకు హోలస్యము లేదు, ఇప్పటికే నవా తొమ్మిది గడియలయినవి, నీ మాయలోనున్న, అమ్మవారిని నేను కనుకో

[illegible], మా తండ్రిగారిని కొర్లేరు వెంటనా కొర్లకు స్థాపము [illegible] ఉన్నది, మా తండ్రిగారిని కొర్లను లేపి, తదుపరి వచ్చెదను [illegible]! సింత నీకేల అమిత త్వరితముగా వచ్చెదను ప్రాణేశ్వరీ, అని చెప్పి, భుజనీ మాంకాళి పట్టణము వచ్చినాడట రమద్వీప రాజు, అప్పటికి నవా పన్నెండు గడియలాయెను; అమ్మవారు ఏ విధమున ఉన్నాదంటే —

ఊరు లేని పాటి మీద
పేరులేని వృక్షంబునకు
హోదారము లేని కొమ్మ
ఆధారము లేని కొమ్మకు
చేరులేని ఉయ్యాలు
చేరులేని ఉయ్యాలి తొట్టి యందు
తొలీ ఉత్సాంబ్రముగా ఊగుచు ఉన్నదట
అచ్చటికి కదలి వచ్చెను రమద్వేమి రాజు
ఈ పాపాత్ముడు ఇచ్చటికి కూడా కదలి వచ్చు
చున్నాడని, పన్నెండు శిరసుల నాగేంద్రుడయ్యి
కోమలి పుట్ట యందుకు చొచ్చినాదట
అచ్చటికి వచ్చి రమద్వేవి రాజు,
నాలుగు ప్రదేశంబులు తిరిగి చూచెను,
అమ్మవారి జాడ కానంగ లేదు,
ఆ పరాత్పరుని జగదీశ్వరుని ప్రార్థించెను
శ్లోకం : శ్రీ హరీ... ఓ పరమేశ్వరా .... తండ్రీ
చిట్టేటి రేవులు నీకు శ్రీ మలిమికొండా
కొండ వీర మామిడి కోన కింది
మంచి గంధపు స్తళమో...
మంచి గంధపుస్తళము సరసన తెల్ల జిల్లేళ్ళు
తెల్ల జిల్లేళ్లు సరసన వీబూది గుండములో
ఓ పరంధామా...
వీబూది గుండములోన, అడుగులు తడబడకుండా
జడలు ముడిబడ కుండా

స్నానమాడినావా...
ఓ పరంధామా..
మా యింట ఆడవారు బుట్టినా నీ పేరు బెడుదును
మగవారు బుట్టినా నిను సేరి కొలుస్తుము
మా మారాస్వారి వంశమున లేవా..
ఓ మలిమికొండా...

మాటలు : ఈ విధముగా ప్రార్థింపగా, ఆ పన్నెండు శిరసుల నాగేంద్రుడు కన్పించెను, నాలుక లేని నాగస్వరము తీసుకొని, ఆనంద కోపులు వాయించెను. ఆ హానంద కోపులకు, అమ్మవారి మతి వోల్లిల్లెను. ఏ విధమున వాయించాడయ్యా అంటే

పాట : ఆనందమమ్మ నీ కానందమో...
ఆడేటి రాజులా కానందము
శివలాలో లాలి, శివలాలో...
రాజాధిరాజులకు శివలాలో
ఆనందమమ్మ నీకానందమే
మారాస్వారంకమ్మ ఆనందమే

మాటలు : అని ఆనందకోపులు వాయించగా, కోమల పుట్టలో నుంచి సర్పంబు బుసలు గొట్టుచు పైకి వచ్చెను. భీతిలేక బాలుండు, ఒడిసి కంఠంబు పట్టెను. అప్పుడు అమ్మవారు సాక్షాత్తు రూపము ధరించి, బాలచంద్రా, మెచ్చితిని నీ ధైర్య సాహసంబులకు, ఏమి కావలెనో కోరుకోరా బాలచంద్రా, అని పలికెను. 'జగన్మోహినీ, నీ మెప్పు నీ బండారాన్నుంచుకొని, మా తండ్రిగారిని కొర్ల లేపవమ్మా' అని పలికెను. బాలుడు ధైర్య సాహసములకు మెచ్చి, ఇద్దరును కలిసి, అరణ్య ప్రదేశంబునకు వచ్చిరి.

రమద్దేవి రాజా, నేను కోరిన వరములు, తప్పక విచ్చెదవా? తప్పక విచ్చెదను జననీ, ఎట్టివో అడగవమ్మా ? నీ తండ్రి ధర్మ సూడావిరాజుకు బదులు మీ తాత దేవరుద్రుణ్ణి బలి యివ్వరా బాలచంద్రా అని పలికెను.

జననీ, కలియుగము పుట్టబోవుచున్నది. నీకు ఎవరు బలిస్తున్నారు జననీ? మా తాత దేవరుద్రునికి బదలు మేకపోతునిస్తున్నా గైకొనవే జననీ!

అల్లాణె రాజు బదులు, గవిటి తలారి వాణ్ణి బలివ్వరా బాలచంద్రా! అని పలికెను. జననీ! నరులెవ్వరిచ్చుచున్నారు జననీ! తలారి వానికి బదలు గొర్రిని విచ్చెద గైకొనుము. కల్యాణ రాజుకు బదలు, బల్లి నిచ్చెద గైకొనవమ్మా! వీరస్వామి రాజుకు బదులు, పందెని విచ్చెద గైకొనుము.

అనుపద్మ రాజుకు బదులు ఎలికని విచ్చెద గైకొనవమ్మా

కనక సోమ రాజుకు బదులు పందికొక్కుని విచ్చెద గైకొనవమ్మా

బల్లాని రాజుకు బదులు దున్నపోతు నిచ్చెద గైకొనవమ్మా
వాళ్ళ తండ్రి గార్లను కొల్లులు లేపి
ఇవన్నీ ఆ కార్లకు స్థాపము గావించిచెను.
ధర్మసూడానిరాజు, "కుమారా! నాకు
బొందితో కైలాస మిప్పించు తనయా
నీ తల్లికి అగ్ని గుండమునకు కావించి
పంపరా కుమారా" అని పలికెను.
"అదే విధముగ జేసెద తండ్రీ!"
ధర్మ సూడాని రాజుకు బొందితో కైలాసమిప్పించెను.
వీరస్వామి రాజు, ఆడ ధేవుతురాలు
అనాథీకురాలు, పిండిగోరు శక్తి,
గోడ ఏల్పురాలు, కొంచెప దైత్య
వేగిలేచి దీని ముకార బింబము
మనమారాస్వారము చూడ దోషంబు
అమ్మ వారిని నేను కొలువనని
పల్నాటి వాళ్లలోకి పోయి చేరెను.
ఎక్కడనైన వీరస్వామి రాజు చేత
నేను కొలిపించుకోవలెనని

"పల్నాటి అంకమ్మ" అని పల్నాటి వారిలోకి సొచ్చి
కొలిపించుకొనుచుండెను.
రమద్దేవి రాజు, పాములాయి పట్టణము కదలివచ్చి
తల్లికి అగ్ని గుండమునకు సెలవిచ్చెను.
తల్లి దండ్రులకు అంటులు కార్యములు చేయించెను
తన చెల్లెలు శివగంటల మహాద్దేవమ్మను
ఆ ఉబ్బుడు పత్రమైన శివన్మహద్దేవిరాజు కిచ్చి
కల్యాణము చేసెను.
"అన్నా! ఆ ఉబ్బుడు పత్రమునకిచ్చి
నన్ను కల్యాణము చేయుచున్నావే
అతని పప్పూ పలువరుస నేను ఏమి అనబగిస్తునయ్య"
అని పలికెను శివగంటల మహద్దేవమ్మ
చెల్లెలా! ఏ విధమైన,
ఆ శివన్మహద్దేవి రాజును నీవు
కల్యాణము ఒప్పవలసినదే కాని,
తప్పదు తల్లీ బ్రహ్మవ్రాసిన వ్రాత"
" అన్నా, నీ యిష్టానుసారముగనే కల్యాణము అవుతున్నా
మొదమొప్ప మూాడు వరములు కోరెదను,
తప్పక విచ్చెదవా"
" సాష్టాంతముగా విచ్చెదను
కోరుకొనుము అమ్మా!"
"ఇప్పుడు వద్దు అన్నా,
నాకు అవసరాలు వచ్చినప్పుడు కోరుకొనెదను",
" భూమీ ఆకాశము సాక్షిగా,
సూర్య చంద్రులు సాక్షిగా,
మన కల్యాణపు శంభుని సాక్షిగా,
తప్పక విచ్చెదను తల్లీ!",
ఆ శివగంటల మహద్దేవమ్మను విచ్చి,
శివన్మహద్దేవి రాజుకు

శ్రీ కల్యాణము బసగూర్చెను.
ఆ భార్యయైన ఉత్తర నలగంగను గలసి,
భార్యా భర్తలు సుఖజీవులయ్యి
అమ్మవారు అంకాళ దేవతను
విశ్రాంతిగా కొలుచుకొనుచుండిరి.

*   *   *

# అంకమ్మ కథాచక్రము

## మూడవ వీరగాథ

# గంగురాజుకథ

కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా, కుచ్చికాయలపూడిలో ఉన్న శ్రీ కొడాలి సీతారామాంజనేయులు అనే కొమ్ములవాని దగ్గర నాకు 1964 సెప్టెంబరు 5వ తేదీన లభించిన తాళపత్రగ్రంథము నుండి ఎత్తి వ్రాసికొన్నది.

వ్రాత ప్రారంభం : 9–9–1964
ముగింపు : 17–9–1964

ఈ తాళపత్రగ్రంథములో 38 ఆకులున్నవి. తప్పులు ఎక్కువ. శైథిల్యము కలదు. కథ ఇంచుమించు చివరి వరకును ఉన్నట్లే.

# గంగురాజు కథ

శ్రీ గంగనాథుని చిత్తమున దలచి
శారదాంబకు మొక్కి ఘనత ప్రార్థించి
కాశివిశ్వనాథుని కాలక..... భక్తిలో దలచి
నిన్ను ప్రార్థన సేయ నేనెంతవాడను
ఆట పాటలను నేర్చిన అయ్యలకునెల్ల
అరిపాద శావ(కు) డు అలవంగ వినుడి
ఈడున దొడ్డవాడు బుద్ధిని దొడ్డవాడు
సాముసు దొడ్డవాడు సధ్యేశాన దొడ్డవాడు
గరిడీని దొడ్డవాడు గరిడి సామున దొడ్డవాడు
దీక్షకు దొడ్డవాడు దీక్ష సాముకు దొడ్డవాడు
వార్కికైన(మేన)త్త చివగంటుల మాధ్యేవమ్మ
ముగ్గురి కరుకోటి బాలల దీవించి
ఎత్తి ముద్దాడి యాడ బొడికెల పజే...
మూడు నేలకు గట్టించె రాజుకు ముత్యాల గరిడి
ఏడువేలకు గట్టించె రాజుకు ఎక్కువైన గరిడి
పదివేలకు గట్టించె రాజుకు పక్షుల గరిడి
ఎనిమిది మూలాలు పథాహారు సంధులు
శంకున చక్రాల గరిడి
దేవిగిరి కోట కొమ్ముకైన కారశెట్టి కట్టించె
గుత్తమైన గరిడి
ముత్తుము రాళ(గోత)ము రాజు మునిగాల చిమ్మెను
ఏదుము రాళగోతము రాజు ఎత్తి లెగవేచును
పధుము రాళగోతము రాజు పట్టి లెగవేచెను
అధింగాక
ఎ... త్త మైనపు గుండు ఏడు యోజనాల పొడుగు
ఎగవేసి (చి) వచ్చేటి మైనపు గుండు
కఠారి మొలను కదలక నిలిపె
అటు వలె పోయురా కటు సౌకళించి
గంగురాజు పిన తండ్రి

పంచమా పాపాత్ముడు కులకర్ముండు!
సకల సామిద్రయిాడు
పిన తండ్రి కనక రవిని...
వకనాడు మధ్యమందు
అన్నకుమారుని జూచి
తామోర్చ పోయి దరణికి వొరిగె
తామోర్చ తా దెలిసి దిగ్గున లెగచి
పెదబావ సెప్పిన మాధ్యేవి రాజు కొల్వుకు
దాయుంగ వచ్చెను
ఇనవోయి బావ శివ్వన్న మాధ్యేవి రాజ
నమ్మరాదు నమ్మరాదు
మా మార్రక్షవారి వొమిశాన్ని నమ్మంగరాదు
పులిదోడి వెళ్లిందని నమ్మితిని సాల
పులిదోడి వెళ్లలేదు దొడ్డిని పెనుగాడుచున్నది
మాకైన అన్న కుమారుడు రాజు గంగురాజు
విద్యను దొడ్డవాడు బుద్దిని దొడ్డవాడు
సాముని దొడ్డవాడు సాధ్యేశాన దొడ్డవాడు
గరిడీని దొడ్డవాడు గరిడి సాముకు దొడ్డవాడు
సముద్రాల మీద స్వాతి కొంగరాయ దళములు
ఎన్ని గల్గినా గాని కలికి సాల్వవంటివాడు
వక్కడే బంటు
దూది కొండల వంటి బలములు ఎన్ని గల్గినగాని
మిణుగురు వంటివాడు వక్కడే బంటు
నీ దళములు అన స్వాతి కొంగరాయ దళములు
నీ అల్లుడు గంగురాజు కలికి సాల్వవంటివాడు
దూది కొండల వంటి దళములు ఎన్ని కల్గినగాని
నీ అల్లుడు గంగురాజు మిణుగురు వంటివాడు
కొమ్మె వంగనివాణ్ణి మానై వంచంగ రాదు
కొద్ది సెప్పని కొంగున కట్టంగ దగదు
కొంగె కాలబోను సివ్వన్న మాద్యేవి రాజ

సుట్టుపై నున్న కోకలు కాలును సివన్న మాద్యేవి రాజ
గట్టిగా గంగురాజును నిముషమున సెము చూడవలెను
దిచమ సూస్తైనె కాని దేవగిరి పట్నం మనకం వర్తిల్లబోదు
నీవు తినంగ వక బ్రంహ్వాణితో సమానం
కాళ్లు చేతులు లేని కరమొండ్డిమవు నీవు
సూడబో నీకు నైనాలు లేవు
ఇసరబోతె నీకు అస్త్రాలు లేవు
నడవబోతె నీకు పాదాలు లేవు
ఇనబోతె నీకు ఈనులు లేవు
నీవనంగ వక బ్రంహ్వాణతో సమానం
గట్టిగా గంగురాజును నిముసమున శమ సూడవలెను
ఆ మాటకు శివన్న మాధ్యేవి రాజు అపుడిట్లగనియె
ఇనవోయి నా ముద్దుల మరది యివరంబుగాను
నీ గూటి పిల్లలి నీ హారగించితే
నేను వద్దన్నట్లాయెను బావ
ముక్కున చెప్పెను మున్నూరు కొండెములు
నాల్కన చెప్పెను నన్నూరు కొండెములు
కొండెం చెప్పక గాని నీ కొల్వు తగ్గనీ
నీ అల్లుడు కొల్వు మెచ్చును
మాపు నీ అల్లుడు కొల్వు అయ్యేటి మన్నీలు
రేపు నీ అల్లుడు కొలువు అవుతమన్నారు
నీ కొల్వు తగ్గేని నీ అల్లుడు కొల్వు మెచ్చేని
గట్టిగా గంగురాజును నిముషమున శమనుండ వలెను
శమ సూస్తైనె కాని దేవిగిరి పట్నం మనకు వర్తిల్లబోదు
ఇనవోయి ఓ బావ శివ్వన్న మాధ్యేవరాజ
నీ కొలువులో వున్న పధార్గురు జెట్టిలను సెలవిస్తి వంపైన
పనమట అరజాము పొద్దుకు నిముసమున
శముసూడి వొచ్చేము
అలాగునె సముసూసి రావోయి నా ముద్దుల మరది

కూర్చున్న సింహ్వాల గద్దె మీద నుండి దిగ్గున లేచెను
చెక్కిట బాగాలు చెదరంగ నవ్వేను
దేవిగిరి నడివీథిలోకి అతి శీఘ్రాన వొచ్చెను
రారోయి జెట్టిలులార రమ్మని పిలిచె
సుగతి దేవిగిరికి నేడు చేటుబుట్టినాది
పెద్దలనాటి దేవిగిరికి నేడు పగలు వచ్చినాయి
చిర్నాలు నాటి పగలు సుగతి దేవిగిరి నాటి పగలు
నీ పాల వొచ్చినాయి
యామైన యింద్ర సుతులని
దిగదిగ వచ్చి రాజుకు చేయెత్తి మ్రొక్కిరి
మమ్ముల పిలిచిన పనియేమి మాతోను చెప్పుమ
ఆ మాటకు శివన్న మాదేవి రాజు
పన్నెండు మంది జెట్టీలు అస్త్రాలు బట్టెను
ఇనరోయి జెట్టీలలార యిన్నవించెదను
మాకైన అన్నకుమారుడు రాజు గంగురాజు
యంచంగ పెంచంగ యేడేళ్ళ బాల కుమారుడు
పనమట అరజాము పొద్దుకు నిముసమున
శమసూస్తి వంటైన
నేను వేలే దేవిగిరి పట్నం మీకు నిగవిచ్చేను
మాయన్న రగద్దేవి రాజు వేలే
కల్యాణపురి పట్నం మీకు కడ మాన్యమిస్తు
అని పదార్గురు జెట్టీలకు తగజెప్పి
తాంబూల విడియంబు లిచ్చె
అప్పుడు పదార్గురు జెట్టీలు పయనంబులైరి
బొక్కిశ వీడెలు పొంకముగ గట్టిరి
మట్టి చెల్లణాలు మరి వేగ దొడిగిరి
అడె కోరులు కఠారి కోరలు అస్త్రాన బట్టిరి
ఆరింద కోరింద పైట శంకు శక్రల
గరిడి కాడికి దాయంగ వొచ్చిరి

ఏడి ఏడి అని గంగురాజును యెతుకులాడసాగిరి
అంతలో రవీంద్ర మంత్రి "వినవోయి బావ చివ్వన్న
మాద్యేవి రాజ విన్నవించేను
గంగురాజును మన కొలువులోకి తోడి తెప్పించితయ్య
పన్నెండుమంది కటికె నాయుల పైనంబు జేసిరి
శివ్వ మాద్యేవి కొలువుకు దాయంగ వచ్చిరి
శివ్వన్న మాద్యేవి రాజుతో సెలవందుకోని
దక్షిణ రామగిరి పట్నం ఆది బాటలు బట్టిరి
వచ్చేటి కటికి నాయకుల జూచి గరిడి జొచ్చినాడు
విది అనె కోరుడు నారిజామని కోరుడు
కటారి కోలలు భూమిపై విడిచిరి
బుద్దిగల తమ్ముడా భూపతిరాజ
కాంతిగల తమ్ముండ కరణమురాజ
దోసకారి మంచి వూహ సత్మకుండు
కులకర్మకుండు సకలశామిద్రోయిండు
పినతండ్రి కనక రావేంద్రుడు
పంపిన జయరేకలు చూడరోయి కరణము రాజ
అంతట కటికి నాయకులు దాయంగ వచ్చిరి
సలాము సలాము అని గంగురాజుకు సలాము జేసిరి
మదియనున్న అస్త్రాలు మనవికి జేర్చి
ఏమి కార్యానికి వస్తిరోయి కటికి నాయకులార
వినవయ్య గంగురాజ (విశదంబుగాను)
మీ మేనమామ శివన్న మాధ్యేవి రాజు
పడమట అరజాము ప్రొద్దుకు నిన్ను కొలువుకు రమ్మనెను
అంతట మారాస్పరాజు ఆశ్చర్యమందె
పోటు అంటేను గంగురాజు బోరువో నేను
సావు అంటేను గంగురాజు సంతోష పడెను
కయ్యమంటెను గంగురాజు కాలుదువ్వేను
దురుమార్కుండు రాజు ఏ మార్గాన పైనంబులాయెను
లఘువుగా బిగు చల్లానం లాగు తా తొడిగె
పన్నెండు మూళ్ళ పట్టురటె అమరంగ కట్టెను

చంద్రకావి రుమాళ చెంగుడిచి కట్టెను
ముత్యాల తురాయి ముందుగా ధరియించెను
వలపటు చక్రాల వొంకిణీ గట్టెను
దాపటు పక్షుల బ్యాకైన గట్టెను
పింజ్యముల అక్షింతలు గంధము అలర పన్నీరు
తులమెత్తు కస్తూరి తోడనె తెచ్చి
విధి అనె కొరుడు కఠారి నాజిం అస్తాన బట్టి కొని
దేవిగిరి ఆది బాటలు అతి శీగ్రాన బట్టెను
తన పాలి శిమున్ని ప్రార్థన జేసెను
ఇవవయ్య ఓ స్వామి దేవిగిరి వీరన్న
మాకు సాయము గావయ్య మము గన్న తండ్రి
పంచ అవతారములు గల వాడు
రాజు రవ్వద్దేవి రాజుకు సాయమైనట్లు
మాకు సాయముగావయ్య ధేవిగిరి వీరన్న
అలనాడు మాతల్లి ఉత్తమా గంగకు సహాయమైనట్లు
మాకు సాయము గావయ్య దేవగిరి వీరన్న
వినవమ్మ వో తల్లి దేవగిరి వెంకు
మాకు సహాయం గావమ్మ మముగన్న తల్లి
అలనాడు మా తండ్రి పంచ అవతారములు గలవాడు
రవద్దేవి రాజుకు సహాయమైనట్లు
మాకు సహాయం గావమ్మ దేవగిరి వెంకు
అనంగానె దేవగిరి వెంకు రక్షనావుల మీద
పచ్చని రామచిలుక అవతారములెత్తి
గంగురాజు కుడి భుజం మీద వ్రాలెను
ఎరవకోయి కుమార జడియకు నీవు
నీ పాల వచ్చిన కార్యం నా పాల వచ్చినాది
మండను వక్కాలె వేదు దొడ్డ యేనుగ వలెను
మదగజములు రెండు మార్కొన్నయట్లు
కొదమ సింహము రీతి కోరాడినట్లు
శివ్వన్న మాధ్యేవి రాజు సింహాసన ముందర

ఎదురుగా గాజు స్తంభము
బహు రావించి జూచి
ఆ గాజు స్తంభము విరగ గుద్దినాడు
ఆ గాజు స్థంభమువిరిగి పడ్డదాయెను
అప్పుడు పంచమా పాతుమ్రుడు కులాకర్మ్రుడు
సకల సామిద్రోహిడు పిన తండ్రి కాన రవేంద్రుడు
చూచి యామని పలికె
చూస్తివా వోబావ నీ అల్లుడు బంట్రోతు ధర్మము
చెప్పితిని నీకు చెవున విల్లు కట్టిన తీరు
చెప్పితే నీకు చెవుడై తోచె
అనగానె అతి వేగ్రాన వచ్చి
సలాము నీకు శివ్వన్న మాధ్యేవిరాజ
నీకు అతిక సలాములు
దోసి దోషకారికి సలాము
రాయ రాయకు సలాము
ఆ మాట పిన తండ్రి కాన రవేంద్రుడు విని
వినవయ్య ఓ భావ శివ్వన్న మాద్దేవి రాజా
నీ కొల్వుకు వచ్చి సలాము చేసిన కారణం అడగవోయి
భావ వినవోయి నా ముద్దులల్లుడ ఓ రాజా గంగరాజా
నా కొల్వుకు వచ్చి సలాము ఎటు జేస్తివి
వినవయ్య ఓ మామ శివ్వన్న మాధ్యేవి రాజా
సలామంటేను నీకు సలాము
అనేక సలాములంటె నీవు పట్టే ఆయుధముకు సలాము
దోషి దోష కారికి సలామంటె
మా పిన తండ్రి కాన రవీంద్రునికి సలాము మామ
రాయ రాయకు సలామంటె నీవు గొలిచేటె
రాయబండారముకు సలామె మామ
ఆ మాటకు శివన్న మాధ్యేవి రాజు అల్లున నవ్వెను
ఇనవోయి నా ముద్దులల్లుడా రాజు గంగురాజు
నా కొల్వున పదార్గురు జెట్టులు వున్నారు
ఆ జెట్టులు ఎటువంటివారు?
గుద్దులకు దొడ్డవాడు గుర్రపు జెట్టి వకడు

వీడె స్వాముకు దొడ్డవాడు వీరజెట్టి వకడు
పంధిరి మీద గుండు వకడు పైబడ్డ పిడుగు వకడు
నీళ్లల్లో ముల్లు వకడు నిఖరమైన బంటువకడు
కానరాని ముల్లు వకడు అంగిట గాల మొకడు
తాళేకు మంట వకడు దరిగొన్న చిచ్చు వొకడు
ఇష్టమంటి వారు పదార్గురు జెట్టీలు వున్నారు
అటువంటి జెట్టీలతో కొద్దిగా వకపరి తాళం పట్టుమా
నా ముద్దులల్లుడా!
ఆ మాటకు రాజు గంగురాజు అపుడిట్లగనియె
యినవె వో మామ శివన్న మాధ్యేవి రాజ!
యిద్దరిని వకడు కట్టిన గొర్రె అంధురె మామ
కత్తి బట్టినేరా గద్దించి పొడవనేరా
వీటెపట్టినేరా యెదిరించి పొడువవేరా
జముజాళి బట్టినేరా జా(డించి) పొడవ నేరా
ఎటువలె పదార్గురు మీద యుద్ధం చేతునే మామ
శివన్న మాధ్యేవి రాజ!
యినవోయి ముద్దులల్లుడ రాజు గంగురాజ!
నిన్ను మేదిని మీద దొడ్డవాడన్నారు.
విద్యను దొడ్డవాడవన్నారు బుద్ధివి దొడ్డవాడవన్నారు
సాముున దొడ్డవాడవన్నారు సదువుకు దొడ్డవాడవన్నారు
గరిడికి దొడ్డవాడవన్నారు గరిడి సాముకు దొడ్డవాడవన్నారు
కొద్దిగా పధార్గురి జెట్టీలతో యుద్ధము శాయుము
నా ముద్దులల్లుడా!
యినవోయి మామ శివన్న మాధ్యేవి రాజ
కాసుకున్న చల్ల వుట్టిని బెట్టినట్లు
మీదే కీర్తి వోరి జెట్టీలలార
అటు (వారి) దీవించి తిరుమణి అక్షింతలు నొష్ట
ధరియించెను
అక్షింతలు ఆయుధము హస్తానకెత్తి వంధైనా

అటువలె పఘార్గురు మీద యుద్ధము చేతునే మామ
అనగానె కన్నుల జూచి అల్లునీ మనసున దీవించెను
మనసునజూచి అల్లుని కన్నుల దీవించెను
దీవించి తిరుమణి అక్షింతలు నొస్ట ధరించెను
క్షేమాన బోయి అల్లుడా లాభాన రమ్మి
లాభాన బోయి అల్లుడా క్షేమాన రమ్మి
నీవు యెక్కిన ధరిణి దేవత నీకు తోడుగావలెను
పగవాడి అస్త్రము కిందు గావలెను
నీ అస్త్రము కిందు గాదనెను
సల్లంగ దీవించి సెలవిచ్చెనపుడు
యినవయ్య ఓ మామ శివ్వన్న మాధ్యేవి రాజా
దోషకారి పంచ మహా పాపాత్ముడు
కుల కర్మండు సకల సామిద్రోహిండు
మా పినతండ్రి కాన రవేంద్రుండు
దీవించి పొమ్మనవె మామ శివ్వన మాధ్యేవి రాజా
అప్పుడు కులాకర్మండు కుమారుని దీవిస్త వున్నాడు
వినవయ్య కుమార రాజు గంగురాజా
నీ పొన్నకాయ వంటి శిరస్సు కొట్టివేశినారని
ఆ వార్త యున్నడు విందు కుమార!
నీ పాలకాయ వంటి పేగులు దీశి జెట్టీలు
యెడ జంజాలు పెడ జంజాలు వేసుకున్నారని
యున్నడు విందు కుమార
చంద్రకాయ వంటి భాణాలు శంకు చక్రాల
గరిడిలో పోట్లు నాటెనని యున్నడు విందురా కుమార?
నీకు ముప్పదిమూడు పోట్లు అరువదియారు గాయాలు
శంకున చక్రాల గరిడిలో అతి భారమాయెనవి
యెన్నడు విందు
అంభోయన శంకున చక్రాల గరిడిలో
వరిగినావని యెన్నడు విందు?

అని కన్నుల జూచి కుమారుని మనసున దీవించె
మనసునజూచి కుమారుని కన్నుల దీవించె
దీవించి తిరుమణి అక్షింతలు నొష్ట ధరించె
అక్షింతలు ఆయుధము అస్త్రమున బట్టెను
యెగిసెను గంగురాజు వేదు యోజినాల పొడవు
తొండమొక్కటె లేదు మెడ యేనుగ వలెను
మదగజంబులు రెండు మార్కొన్నయట్లు
కొదమ సింహము రీతి కోరాడినట్లు
ఆ రౌధ కోరు బైట
శంఖున చక్రాల గరిడి కాడ దాయంగ వచ్చెను
అప్పుడు పదార్గురు జెట్టీల ఆడే కొరుడు కఠారి కోలలు
డేరా మొగసాలకు తల్ల కిందులుగ యాలాడ గట్టిరి
ఆడే కొరుడు కఠారి వంక జూచెను రాజు గంగురాజు
డేరా మొగసాల గుండ దూరి....
పదార్గురు జట్టీలు దూరిపో
ఏడు అడుగులు యెనకకు నడిచి వొచ్చెను
తనపాల శిముని ప్రార్థన జేసెను
దేవిగిరి యెంకును ప్రార్థన జేసెను
ఆ శంకున చక్రాల గరిడి లోకి గుభాల్లునా దుమికెను
వానలేని వొట్టి పిడుగు పడ్డ చందమాయెను
బొబ్బిలి బొబ్బిలి యుదరించినట్లు
స్వారసగమల్ల గుండ చూశి జెట్టీలు
గంగురాజును జూచి పసువులు బెదిరినట్లు బెదిరి
జెట్టీలు పారిపోతు వున్నారు
పారిపొయ్యే జెట్టీలను కన్నులజూచి
యినర్ర జెట్టీలలార
మా పినతండ్రి మీద పడి
చంపిన కార్యమేమొ చెప్పుమా జెట్టీలలార
అప్పుడు గవగొన్న పులివలె
పదార్గురు జెట్టీల కొక్క చువ్వ వీలెలు అస్తాన బట్టిరి

నవ్వీన కార్యం.... రాజు మీదికి గ్రక్కున వొచ్చిరి
జెట్టీలు గంగురాజు కళ్లు పెళ్లు విద్దము జేసిరి
పదార్గురుకొక్క సువ్వవీటెలు మోపుగట్టి వేశినట్టుగా వుండెను
(కుడి) మీసం దువ్వి గుడ్లెర్ర జేసి
ఢాకాల పెణ్ణము గళ్లన తాటించినాడు
ఎడమ చేతి కటారి కోలనుగొట్టి
కుడిచేతి కతారి కోలకు భలోయని బలదూరు విచ్చెను
కుడిచేతి కతారి కోలను గొట్టి
యెడమచేతి కతారి కోలకు భలోయని బలదూరు విచ్చెను.
గంగురాజు మీద యుద్ధము శాయలేక
పదార్గురు జెట్టీలు
శంఖున చక్రాల గరిడి పడమటు తట్టు విరగబొడుచుకొని
తలలు విరబోసుకొని జెట్టీలు పారిపోసాగిరి
పంచమా పాపాత్ముండు కులకద్మండు
సకల సామి ద్రోహిండు
గంగురాజు పినతండ్రి రహీంద్రు జూచి
యింక గంగురాజును సంపినారో లేవో యని
సోర్నగముళ్లగుండ తొంగి తా జూచెను
పారిపొయ్యే జెట్టీలను జూచి
రహీంద్రుడు యీమని పలికె
నమ్మితిని జట్టీలలార నమ్మితి మిమ్ము
మాకైన అన్న కుమారుడు రాజు గంగురాజు
(యన్నంగ) పొన్నంగ యేడేళ్ళ బాలకొమారుడికి
తలలు విరబోసుక పారిపొయ్యేది మీకు ధర్మంబుగాదు
మీ కులసతులు వింటేను అపకీర్తి వొచ్చేని·
అనంగానే పదార్గురు జెట్టీలు యీమనుచున్నారు
సాలుసాలు రవీంద్ర గంగురాజు మీద యుద్ధము
సాలునని పల్కిరి
ప్రాణాలు గల్గితేను బల్సుకూర అనుభవించేము

వ్రూపిల్లి గల్గితేను వుప్పుముక్క బ్రతికేము
అనంగానె రహేంద్రుడు పదార్గురు జట్టిలకు అడ్డంబు వొచ్చెను
పదార్గురు జెట్టిల అస్త్రాలు తన అస్త్రాన బట్టి
మీ కులసతులు వింటేను అపకీర్తి వొచ్చెను
పదార్గురు జెట్టిలను మారాక్షవారి
పాలకాయువంటె పట్నంకాడికి
పదార్గురు జెట్టిలను తోడుకొని వచ్చి
కంచుబోరు తల్పుల కడకు దీవించి
పదార్గురు జెట్టీల దోసిళ్ళు పట్టించినాడు
దోసిళ్ళనిండ వరహాలు పోయించినాడు
మాకైన అన్నకుమారుడు రాజు గంగురాజు
పడమట అర జాము ప్రొద్దుకు నిముషమున చమ సూడవలెను
నేను వేతె దేవగిరి పట్నం మీకు గావించేను
మా యన్న రాజు రావ్వఘెవి రాముడు వేలెటి
కల్యాణపురిపట్నం మీకు కడు మాన్యమిచ్చేను
అని పదార్గురు జెట్టిలకు
తగజెప్పి ఆరాజు తాంబూల మిచ్చెను.
అప్పుడు పదార్గురు జెట్టిలు పైనంబులైరి
గంగురాజు మీదను ఇర్వైవక్క జెట్టిలు వొరుగుదా మనుచు
అన్న గట్టిన నల్ల పట్టు కాశి తమ్ముడు గట్టినాడు
తమ్ముడు గట్టిన నల్లపట్టు కాశి అన్న అయిన గట్టెను
అన్న వేసిన వీరజడ .....తమ్ముడు వేసినాడు
తమ్ముడు వేసిన వీరజడ అన్నైన వేసెను
పదార్గురు జెట్టిలు సొక్క చువ్వ వీలెలు అస్త్రాన బట్టుకూని
శంఖున చక్రాల గరిడి కాడకి దాయంగ వచ్చిరి
ఏడి ఏడి గంగురాజు అని ఎతుకలాడ సాగిరి
గోయిందా గోయింధాయని సల్లిరి వీర గంధము
ఆ మాటకు గంగురాజుకు అగ్రమైన కోపంబువొచ్చి
కుడి మీసం దువ్వి గుడ్లెర్ర జేసెను
ఢాకాల వెన్నెము గళ్లున తాటించినాడు

ఇది అనె కోరండు కఠారి కోల అస్తాన బట్టెను
యెడమ చేతి కఠారిని గొట్టి కుడిచేతి కఠారికి
భలోయని బలాదూరు విచ్చెను
కుడిచేతి కఠారిని గొట్టి యడమ చేతి కఠారికి
బలో యని బలాదూరు విచ్చెను
పదార్గురు జెట్టిలను తన అస్తాన బట్టుకొని
తల్చుకోర్రా జెట్టిలలార మీ తల్లిదండ్రులాను
యేండుకోర్రా జెట్టిలలార మీ విష్ట దైవాలనెల్లా
దేవమీరు బుట్టిన దెవసము నేటికి చేరికై వొచ్చెను
అనంగానె పదార్గురు జెట్టి లప్పు డిట్లగనిరి
నమ్మితిమి గంగురాజ నమ్మితిమి నిన్ను
నన్నేమి నమ్మేరు జెట్టిలలార
మా పిన తండ్రి రాహింద్రుని నమ్ముమని పల్కెను
అని వలపటు వజ్రాల వంకిణీ దీసి
వక్కొక్క జెట్టిలను వరుసను వుత్తరించసాగెను
పొర్లేటి మొండెమూలు బొబ్బరించు శిరస్సులూ
అదిరేటి మొండెమూలు ఆవలించు శిరస్సులూ
నరికిన శిరస్సులు అస్తాన బట్టుకోని
మేనమామ శివ్వన్న మాధ్యేవిరాజా
సింహాసనం ముందర తప్పన వేశెను
అప్పుడు పంచమ(హా పా)పాత్ముడు కులకర్ముండు
సకల సామిద్రోయి పిన తండ్రి రహింద్ర జూచి
యామనుచున్నాడు
యినవోయి బావ శివ్వన్న మాధ్యేవి రాజ యివరంబుగాను
దేవగిరి పుట్టిన నాటి జెట్టిలను సంహరించినాడు
నేను యెటువలె దరయుంత యామందు నేను
చెప్పితి నీకు నేను చెవున యిల్లు గట్టి
చెప్పితి నీకు నే చెముడై తోచె
ఘట్టిగా గంగురాజును నిమషమున శమసూడవలెను
యెటువలె చమ సూశెవోయి నా ముద్దుల మరిదీ

నీవు యెక్కొటి యల్లయేనుగను శలవిస్తివైన
పడమట అరజాము ప్రొద్దుకు శమసూశి వొచ్చేని
అటువలె చమసూశి రావోయి నా ముద్దుల మరిదీ
కూర్చున్న సింహాసనం దిగ్గున లెగచి
దేవగిరి పట్నం నడివీథిలోకి శీఘ్రాన వొచ్చెను
పిలిపించె యేనుగా మాష్టిణీ ప్రియముతో నపుడు
వచ్చెను మాష్టిడు వేవేగమూనా
చమణాని రవీంద్రునికి చెయ్యెత్తి మ్రొక్కె
(మమ్ముకలను) పిలిచిన పని మాతోను జెప్పమా
యినవోయి యేనుగ మాష్టిడా విన్నవించేను
మాకుయ్యైన అన్న కుమారుడు రాజు గంగురాజు
ఎంచంగ పెంచంగ ఏడేళ్ల బాల కుమారుడును
పడమట అరజాము ప్రొద్దుకు గంగురాజును శమచూస్తేను
నేను వేలే దేవగిరి పట్నము మీకునిగా నిచ్చేను
మా యన్న రాజు రవద్దేవి రాజు వేతేటి
కల్యాణపురి పట్నము మాన్యమిచ్చేను
తగజెప్పి యేనుగ మాష్టీనికి తాంబూళమిచ్చెను
శివన్న మాధ్యేవి రాజు కొల్వుకు దాయంగ వచ్చెను
అంతట యేనుగా మాష్టిడు కట్టాయుత పడెను
యూ వరహాకు సల్లమందు గొనెను
గంజాయి నల్లమందు యల్లయేనుక్కు మదము వెక్కించి నాడు
తన దళము పరదళము గురుతు గానకుండ
మదము యెక్కించినాడు
దేవగిరి పట్నము నడివీథిలో యినపు గొల్సులు కట్టివున్నది
ఎల్లయేనుగు మధము చేత
యినప గొల్సులు తెంచుకొని
దక్షిణా రామగిరి పట్నము ఆది బాటలు పట్టుక పోంగాను
అప్పుడు గంగురాజు మేనత్త నగరి నుండి
అడపకేశవన్నను వెంట బెట్టుకొని

మేనమామ శివ్వన్న మాధ్యేవి రాజు కొల్వుకు వస్తువున్నాడు
కనిచూపు విరిమేల చూచి గంగురాజు యామని పలికె
వినరా తమ్ముడా అడప కేశవన్న
మన ఆవులలో మేసేది నల్ల దున్నపోతు గాదు
మీ మేనమామ శివ్వన్న మాధ్యేవి రాజా
యెక్కేటి యల్లటేనుగనెను
మా మేనమామ యెక్కేటి యెల్లటేనుగైతె
ఏమి కార్యాన్కి వస్తువున్నాదోయి అడప కేశవన్నా
ఎల్లటేనుక్కు ఎదురుగా బోయి
యేనుగు మాష్టిణి యీ బాట మార్గము తొల్గించుమని చెప్పు
ఆ మాటకు అడప కేశవన్న అవేగ్రముగ బోయి
వినరా వోరి యేనుగ మాష్టిడ
మా యన్న రాజు గంగురాజు
యీ బాట మార్గాన వస్తువున్నాడు
యెల్లటేనుగను తొలగించవయ్య
ఏనుగ మీద మాష్టిడు ఏమనుచున్నాడు
ఇనవయ్య అడప కేశవన్న ఇవరంబుగాను
రాగల వాడైతె రమ్మని చెప్పు
పోగల వాడైతె పొమ్మని చెప్పు
దారి తొల్గిపొమ్మనెను.
ఆ మాటకు అడప కేశవన్న అపుడిట్లగనియె
అన్నరో వోయన్న రాజు గంగు రాజ
ఆ ఏనుగా మీద మాష్టీడు కానక గర్వించినాడు
కండ్ల కావురం మద మచ్చుకం చేత
గురుతెరుగా కున్నాడు
రాగల వాడైతె రమ్మని చెప్పినాడు
పోగల వాడైతె పొమ్మని చెప్పినాడు
ఆ మాటకు రాజు గంగురాజు అగ్రుడై మండెను
కుడి మీసం దువ్వి గుడ్లెర్ర జేసెను

ఘాకాల పెణ్ణెము గళ్లున తాటించినాడు
విది అనే కోరండు కఠారి కోలా అస్తాన బట్టెను
ఎల్లమేనుక్కు గంగురాజు ఎదురంగా వొచ్చెను
తన పాలి శిముని ప్రార్థన జేశెను
దేవగిరి వీరన్నను ప్రార్థన జేసెను
తాతలనాటి యేల్పును దేవగిరి యెంకన్నను ప్రార్థన జేశెను.
ఎల్లమేనుగా గంగురాజు
కళ్లు పేళ్లునా యుద్ధము శాస్త వున్నారు
ఏనుగా మీద మాష్టిణ్ణి యడమాస్తాన బట్టుకున్నాడు
గిర గిర ద్రిప్పి నేలకేసి కొట్టెను
కూలెను మాష్టిడు కుంభిణి మీద
పెరుగు బుడ్డి వలె శిర్సు పక్కున పగిలె
విధియనె కోరుడు కఠారి కోలతో
యల్లమేనుగను గొట్టెను
గీపెట్టె యల్లమేనుగా గీకరింతలు బెట్టెను
దక్షిణ రామగిరి పట్నం ఆది బాటలు బట్టెను ఆ యల్లిమేనుగా
మగిడి దేవిగిరి పట్నానికి మళ్లి తావొచ్చెనూ
సింహాసనం మీద కొల్వుకూచ్చున్న శివన్న మాధ్యేవిరాజు
శ్రీపాదాల మీద శిరసు తాబెట్టెను
గుటగుటమని జీవనంబు గుటుక్కునా విడిచె
విడువగానే పంచమహా పాపాత్ముడు కులాకర్మండు
సకల సామి ద్రోయిడు
పినతండ్రి కాన రవీంద్రుడు యూమని పల్కె
వినవోయి బావ శివ్వన్న మాధ్యేవి రాజ విన్నవించెదాను.

మన దేవగిరి పుట్టిన నాటి జెట్టిలను సంహరించినాడు
నీవు యెక్కోటి యల్లతేనుగను సంహరించినాడు
నేను యెటువలె దరయింతు చివన్న మాధ్యేవిరాజా
చెప్పితిని నీకు నేను చెవున విల్లుగట్టి
చెప్పితిని నీకు నేను చెముడై తోచె
గట్టిగా గంగురాజును నిముషమున చమచూడవలెను
యెటువలె చమ చూశేవు నా ముద్దుల మరిదీ
కల్యాణం మీదికి గంగురాజును పయిన జేసి పంపిస్తివైన
కల్యాణంలో చెల్లిపోతాడు
వూర్కి వుత్రాన కాడేరు పరచి
కాటికి బోయ్ని పీనుగా మళ్లి వస్తేను
కల్యాణం బోయిన గంగురాజు మళ్లివస్తాడు
కల్యాణం బోయిన కాకులు మళ్లి మల్లంగలేవు
కల్యాణం మీద చెల్లెవాడుగాని మల్లెవాడు గాడు
ఇక నేటికి బావ శివన్న మాధ్యేవి రాజ
నీ అల్లుడు గంగురాజును
కల్యాణం మీద యుద్ధ రంగముకు
పంపవే బావ శివన్న మాధ్యేవి రాజ
అనగానె శివన్న మాధ్యేవి రాజు
గంగురాజు కొల్వుకు శీఘ్రాన వొచ్చెను
యినవోయి నా ముద్దులల్లుడ! రాజు గంగురాజ!
కల్యాణం మీద యుద్ధ రంగము నీ పాలవచ్చినాది
కల్యాణం మీదకి కదలిపోవోయి నా ముద్దులల్లుడా!
ఆ మాటకు గంగురాజు అపుడిట్లగనియె
యినవోయి మామ శివన్న మాధ్యేవి రాజ వివరంబుగాను
కల్యాణం లేని వార్కి కల్యాణ మేడదె మామ
ఆడ దెవ్వరు లేనివార్కి ఆయుధము బట్ట శెలవు లేదె మామ
నీకు యేడుగురు కుమార్తెలు వున్నారు

అందులో పెద్దది సుక్కల సూరధ్యేవిని
విచ్చి కల్యాణం చేస్తివంటైన
నొష్ట బాశికం నొష్టవుండగాను
కట్టిన కంఖణం కట్టినట్టె వున్నంగ
కల్యాణంమీద యుద్దరంగానికి కదలిపొయ్యేను
అనగానె శివన్న మాధ్యేవి రాజు అపుడిట్లగనియె
పంచమా పాపాత్ముడు కులకర్ముండు
పినతండ్రి రవింద్రునితో యాామనుచున్నాడు
యినవోయి బావ శివన్న మాధ్యేవి రాజ
కల్యాణం మీదికి గంగురాజును
పైనం జేసి పంపిస్తివైనా
కల్యాణంలో గంగురాజు చెల్లేవాడు
కాని మళ్లేవాడు గాడు
కల్యాణం బోయ్ను కాకులు మళ్లి మల్లంగలేవు
నీ కుమార్తె సుక్కల సూర్యద్యేవిని యిచ్చి
కల్యాణం చాయవె బావ
కల్యాణంలో గంగురాజు చెల్లిపోగానె
యిక్కడ చుక్కల సూర్యధ్యేవిని
అగ్ని గుణ్ణాన్కి అయుత పరుతాము
నాకు యేడుగురు కోమాళ్లు వున్నారు
అందులో నీ మనసు వచ్చిన వారిని
యిచ్చి కల్యాణం చేతువుగాని
ఏదో వాక నేర్పున గంగురాజును కల్యాణం......
.......................................... యిట్ల గనియె
యినవోయి నా ముద్దులల్లుడ రాజ గంగురాజు
కల్యాణం మీద యుద్ధరంగం గెల్చి వొచ్చిన తరువాత
అటువలె నా కోమార్తె నిచ్చి కల్యాణం చేతును గాని
నా కొల్వులో పన్నెండు వేలా చత్రాంగి బలములు
పైన మై పోయి
దట్టము పై మూడు ఆయుధాలతోను కట్టాయుతపడి

కల్యాణం మీద యుద్ధానికి కదలి పొమ్మనెనూ
ఆ మాటకు రాజు గంగురాజు అపుడిట్లగనియె
యినవోయి మామ శివన్న మాధ్యేవిరాజ
నీ కొమార్తె సుక్కాల సూర్యద్యేవినిచ్చి
శ్రీ కల్యాణం చేస్తేనె కాని
కల్యాణం మీద యుద్ధం శాయునని పలికె.
ఆ మాట వింటునె పంచమా పాపాత్ముడు కులాకర్ముండు యామని పలికె
వినవె బావ శివన్న మాధ్యేవిరాజ విన్నవించేను
గుడ్లల్లో వక గుడ్డు మురిగి పోయింది అనుకుందాము
సుక్కాల సూరద్యేవి మన గర్భాసాన పుట్టలేదనుకుందాము
అటు (వంటి నీ కుమార్తె) సుక్కాల సురాద్యేవినిచ్చి
కల్యాణం చేయుమని పల్కెను
అనగానె సుక్కాల సూరద్యేవికి గంగురాజుకు
కల్యాణం చేస్తు వున్నారు
సముద్రాము వర్జు బండావ
చెంద్రుడు గెడపుడక
పరగ దేవతల్ భార్యలెల్లా
పే రంటాళ్లై వొచ్చిరి పెండ్లి పాటలాకు
నఫిరీలు పిల్లన గ్రోవులు నాగస్వరములునూ
విష్ణు భార్య శ్రీమాలక్ష్మి త్రి
యీశ్వరుని భార్య పార్వతీ
బ్రహ్మ భార్య సరస్వతీ
పేరంటాళ్లై వొచ్చిరి పెండ్లి పాటలాకు
ధారలు జోరలు తమ్మటంబులూను
పంచమా వాయిద్యముల్ మించి మ్రోవంగా
వీరణాలు జేగంటలు యిజోడపడగా
గుంజ్కాలు కైవళ్లు దూటి మ్రోవంగా
బ్రాహ్మలు చదువంగ భట్లు పొగడంగా
సుక్కాలు అక్షంతలు సూర్య చంద్రాలు బాశికాలు
సుక్కాల సూరద్యేవికి రాజు గంగురాజుకు.....

కంచునా ఘనమేడ కట్టించినాడు
యేడంత్రాల కంచు మేడ మీద సుక్కల సూరధ్యేవి
కొలువు దీర్చి వుండెను
అత్తవారిచ్చినా ... దాదులూను
పుట్టింటి వారిచ్చినా పున్యాపు దాదులూను
దాది కొండమ్మ దాది బలభద్ర
బాపనవారి బలిజి కోమటివారి అన్నమ్మ
యిటువంటి దాదులు కనకమేడకు యేతెంచినారు
కంకణాల చేత గంగురాజు పైనంబులాయెను
దేవగిరి పట్నములో వున్న
తలారి మారినీన్ని దాయంగ బిలచి
వొచ్చెను తలారి దామన్న వోయి వేగమూన
చెయ్యెత్తి మ్రొక్కెను శరణార్థి జేసెనూ
నన్ను పిలిపించిన పని యేమి నాతోను చెప్పుమా
యినర వోరి తలారి దామన్న యివరంబుగాను
అక్షోణి అక్షో పన్నెండువేల చత్రాంగి బలములు
ప్రయాణం చేయమని పలికెను
అనంగానే తలారి వాడు వొగ్రాన వచ్చి
యెండిది జేగంట పైడిది కర్రా
పైడిది జేగంట యెండిది కర్రా
యెడతో దండ్లు యేగంటె సాటెను
దండంటె కూడెను అక్షోణి బలములు
యెంటెంట కూడెను అక్షోణి బలము
విచ్చు కత్తుల నారు వీటెలవాడు
పట్టా కత్తుల వారు బాణాల వారు
అంబుల తరకాచులవారు ఆయుధాల బంట్లు
ముకంధుకూరి బల్లేల వారు మునుస్నారుకోట్లు
యాట తుపాకుల వారు యెనుస్నారు గోట్లు
ఘన యాటకాళ్లు గడ్డరి బోయులు
దాగి పోట్లాడేటి దండి నాయకులు

వరస పోట్లాడేటి చాలుమన్నీలూ
ఢాబ కత్తులతోను తరమేటి వారు
సొక్క చువ్వ వీటెలు సుక్కలంటి వున్నారు
సాన కత్తులలోను సాగేటి వారు
అంబుల తరకాచులవారు ఆయుధాలవారు
గోడిగల నెక్కిరి కొందరు వారు
మిన్నంది వొచ్చిరి మీసుటెక్కెముల వారు
ఆకాశమున ఆడు ఆలవట్నములూ
డాలులు వెస్నారు డమమీలు యెస్నారు
పెద్ద పెద్ద బాణాలు పెద్ద ఫిరంగీలూ
యంత్ర...... డిచి యేడు గడియలు యెక్కేటప్పటికీ
అక్షోణి అక్షోణి పన్నెం(డువేల చత్రం)గి బలములు
గంగురాజు నగరున కొల్వుదేర్చి వుండిరి
అప్పుడు గంగురాజు అశ్వాల యెంచి తెమ్మనెనూ
అశ్వాల పేర్లు యెటువంటివి అంటేను—
గితపురివి దెండి, కీర్తిని దెండి,
వైలు రాయుని దెండి,
సారంగుని దెండి సారస్వతిని దెండి
నీర్జానిని దెండి నీలాన్ని దెండి
గజ వైరుని దెండి గాలాన్ని దెండి
పరుపకారిని దెండి పార్వతిని దెండి
యన్నెల మాధవుని దెండి యుగ్రనీలాన్ని దెండి
చంద్ర నీలాన్నిదెండి జలజాక్షినిదెండి
మనర అశ్వాన్ని మన్నిన్ని దెండి
తెల్లని ముత్యాలు చెక్కిన యజ్జు బొర్లి అశ్వాన్ని దెండి
పంచకల్యాణిని దెండి పరుపకారిని దెండి
యల్లి గుర్రాల నెల్లి వేర్చి తెమ్మనెను
తెమ్మనెను రాజు తేజీలనెల్లా
వేళమె యేర్ప(ర)చె పన్నె లక్షల అశ్వాలా
అప్పుడు గంగురాజు అశ్వాల నెల్లా

[illegible] రాజు తేజమీరగాను
[illegible] పూజించి రథికుల కిచ్చి
[illegible] పద్దుపై లక్షలు యెంచి తెమ్మనెనూ
[illegible] పట్టివాలు వరుసతో గట్టిరి
[illegible] గజములకు వరుస ముగ్గులేసి
[illegible] పట్టాకత్తుల వారు ఏపణిగించా
[illegible] కొల్వుకు గ్రక్కున వొచ్చిరి
[illegible] పోలరోనున్న మువ్వల భీమినీణ్ణి
[illegible] ఆ రాజు తాంబూళమిచ్చె
[illegible]లోనున్న యెరికల పోతినీణ్ణి దాయంగ బిలచి
[illegible]లోనున్న పక్షుల భీమినీని దాయంగ బిలచి
[illegible] వారికి తాంబూళమిచ్చె
[illegible] పంచె నాయకుల దాయంగ బిల్చి
[illegible] వారికి తాంబూళమిచ్చెనూ
[illegible] తమ్ముడు భూపతి కరుణము రాజును దాయంగ బిలచి
[illegible] తమ్ముడు భూపతిరాజు
[illegible] తమ్ముడు కరుణపు రాజు
[illegible] పెద తండ్రి కాన రవీంద్రుడు
[illegible] పాపాత్ముడు కులకర్మండు
[illegible] సామి ద్రోహిండు
[illegible] కళ్యాణం మీదికి కదలమన్నాడు
[illegible] ఆది బాటలో నీలి గుడారు యెత్తించుమనెను
[illegible] యెల్లటేనుగను పరగ దెప్పించుమనెను
[illegible] జెల్లమొప్పు గావించి జల్లులుగట్టిరి
[illegible] గంటలు మెడనిండా గట్టిరి
[illegible] పువ్వులు పరిపించిరి వేగా
[illegible] పచ్చడ సవడోలు యెత్తించి రపుడూ
[illegible] డాషేరి వేయించి కదలె గంగురాజు
[illegible] కొల్వుకు అతి వేగ్రాన వచ్చెనూ
( [illegible] ) [illegible]దేవులు ముత్తాత ఈశ్వరుని ప్రార్థన జేశెను

ఈశ్వర పరమేశ్వరా దేవామహారుద్రుండా
నేను కల్యాణంలోనేను కల్లికి వొరిగితి నంటైన
నీవుగన్న పంచలింగాల కొండ బగ్గు బగ్గున
మండవలెనో తాత ఈశ్వరుండా!
కల్యాణంలో నేను కల్లికి వొరిగితి నంటైనా
నీ కొమార్తె గంగవతి
అగ్ని గుణ్ణములో అంబోయని
వరగవలె తాత యీశ్వరుండా!
కల్యాణంలోనేను కల్లికి వొరిగితి నంటైనా
నీ కొమారుడు జలబ్రీముడు బట్టేటి
దశనందుల పువ్వుల కప్పెరా
ధరణికి వొరుగవలె తాత ఈశ్వరుండా
కల్యాణంలో నేను కల్లికి వొరిగితి నంటైనా
నీవు యెక్కేటి యల నంది పొట్లు కాటి
ధరణికి వరగవలె వో తాత ఈశ్వరుండా!
కల్యాణంలో నేను కల్లికి వొరిగితి నంటైనా
నీమెడనున్న రుద్రాక్ష తావళాలు
బద్రాక్ష తావళాలు పటపట తెగి
నీ పాదాల మీద వరగవలె తాత ఈశ్వరుండా!
కల్యాణంలో నేను కల్లికి వొరిగితి నంటైవా
నీవు బట్టేటి వాసంథల పువ్వుల కప్పెరా
ధరణికి వొరగవలె తాత ఈశ్వరుండా!
కల్యాణంలోను కల్లికి వొరిగితి నంటైనా
నీవు కూర్చుండే ధర్మ సింహాసనం
కుమ్మరాము చిచ్చువలె కుమారలు వలెనయ్య
వో తాత ఈశ్వరుండా!
కల్యాణంలో నేను కల్లికి వొరిగితి నంటైనా
నీవు బట్టేటి ఘూ శక్ర గొడుగులు
ఘామికి వరగవలె తాత ఈశ్వరుండా!

కల్యాణంలో నేను కల్లికి వొరిగితి నంటైనా
నీవు బట్టేటి పంచసంధుల కప్పేరా
పప్పులై వరగవలె తాత యీశ్వరుండా!
కల్యాణంలో నేను కల్లికి వొరిగితి నంటైనా
నీవు బట్టేటి నాగవీరా బెత్తము
నడిమికి నక్కున యిరగ వలె తాత ఈశ్వరుండా!
యిదలి నా హలు యీశ్వరా తనయా
అని తన ముత్తాత ఈశ్వరునితో సెలవందుకోని
మేనమామ శివన్న మాఛ్యేవి రాజు
కొల్వుకు దాయంగ వొచ్చెనూ
సలాము సలాము మామ నీకు సలాము
దీవించి పంపవే మామ ధీరుల మీదికి
సెలవిచ్చి నన్నంపు సేనల మీదికి
ఆ మాటుకు శివన్న మాఛ్యేవి రాజు అళ్లున నవ్వెనూ
అక్షింతలు ఆయుధం లాభానకిచ్చెనూ
లాభాన బోయి అల్లుడ క్షేమాన రమ్మి!
క్షేమానబోయి అల్లుడ లాభాన రమ్మి!
తొక్కిన ధరణి దేవుతా తోడు గావలెను.
పగవాడి అస్తము కిందుగావలెను
నీ అస్తమో అళ్లుడ మీదుగావలెనూ
నల్లంగ దీవించి సెలవిచ్చెనపుడు
మేనమామ శివన్న మాఛ్యేవి రాజు సెలవందుకోని
తన మేనత్త శివగంటుల మాద్యేవమ్మ
కొల్వుకు శీఘ్రాన వచ్చెనూ
చేరి వొచ్చి అత్తకు చేయెత్తి మొక్కెను
దాచివొచ్చి అత్తకు దణ్ణంబు బెట్టెనూ
యినవమ్మ వోయత్త శివ ఘంటుల మాద్యేవమ్మ
దోషకారి పంచమా పాపాత్ముడు కులాకర్ముండు
సకల సామి ద్రయిడు
పినతండ్రి కాన రవింద్రుడు

కల్యాణం... కే విద్దరంగానికి పంపు సున్నారు
అనగానె శివగంటల మాద్యేవమ్మ
నాగుబామంటి నడుము నక్కున విరిగెను
గుడగుడ కన్నీరు గ్రక్కుచు అడిలె
పగడపు కన్నీరు పలివరస జారెను
ముత్యపు కన్నీరు మొకమంటు జారెనూ
యినవోయి నా ముద్దులల్లుడా రాజు గంగురాజు!
నిన్ను కల్యాణం మీదికి పంపిన పాప కర్మలు
యువ్వరోయి నా ముద్దులల్లుడా!
కల్యాణం గాదు అది కాకుల పెంట
కల్యాణం బోయ్ను కాకులు మళ్లినావి గావు
కల్యాణం బోయిన కాకులు మళ్లకుండగాను
ఊరికి వుత్రాన కాడేరు పరచి
కాటికి బోయిన పీనుగా మళ్లి వాస్తేను
కల్యాణం బోయిన గంగురాజు మల్ల వస్తా(డు)
కల్యాణం యేనాడు నీవు యేనాడు
కల్యాణం పోవద్దు నా ముద్దులల్లుడ
అనగానె రాజు గంగురాజు అళ్లునా నవ్వి
యినవమ్మ వోయత్త శివగంటల మాద్యేవమ్మ
కల్యాణం మీద యుద్దరంగం శాయలేకా
నీతో చెప్పకున్నాడంటు
నాయత్త వారిలో నాకు తలవంపులమ్మ
చల్లంగ దీవించి శలవియ్యవమ్మ
అని కన్నుల జూచి అల్లుణ్ణి మనసునా దీవించెను
మనసునా జూచి అల్లని కన్నుల దీవించెను
ముమ్మార్లు దీవించి ముత్యాల సేస జల్లినాది
పలుమారు దీవించి పగడాల సేస జల్లినాది

యలది కుంకం పైన యెగజల్లినాది
దీవించి అక్షింతలు గంగురాజు వొష్క ధరియించినాది
అక్షింతలు ఆయుధము అస్తానకిచ్చె
తన మేనత్తతో సెలవందుకోని
కంచు రణభేరి వెయ్యించె కదిలె గంగురాజు
పట్టపు యేనుగా నెక్కి పరగ గంగురాజు
గుర్రాలనెక్కారి కొందరు రాజులు
ఏనుగుల నెక్కారి యెలమితో రాజులు
కదిలె గుర్రపు దండు కదిలె యేనుగులు
మంచువలె సముద్రాము మించిన రీతి
కంచు విరిగిన యట్టె కదిలె గంగురాజు
గుర్రాలు నడువంగ గుప్పె రవధూళి
యెనుగులు నడువంగ ఎగిచె రవధూళి
కాలారి నడువంగ కప్పె రవధూళి
పంచమా వాయిద్యములు మించి మ్రోవగను
భేరీలు తమటములు పెళ్లుకొని మ్రోవగను
తుడుములు తప్పెట్లు తుది మేర లేక
మ్రోగేటి రణభేరి మ్రోతలకు (దెసల)
పన్నెండు ఆమడ వున్న ఆడ స్త్రీల గర్భాలలో
పిణ్ణాలు దూశి పారినట్లాయె
కదిలెను గంగురాజు కల్యాణం మీదికి
ఆ రణభేరి మ్రోతలు
యేడంత్రాల కంచు మేడ మీద సుక్కాల సూరదేవి వినెనూ
యినరమ్మ దాదులార యిన్న వించెదనూ
ఆ కల్యాణం ఆది బాటలో
ఆ రణభేరి మ్రోతలు యాడది వో దాదులార
అనగానె దాది కొండమ్మ అపుడిట్లాగనియె
యినవమ్మ సుక్కాల సూరదేవి యిన్నవించెదానూ
నీ వక్క ప్రాణవిభుడు రాజు గంగురాజు
యెన్నంగ పొన్నంగ ఏడేళ్ల రాజు

కల్యాణం మీదికి కదిలిపోతు వున్నాడు
అనగానె సుక్కాల సూరద్యేవి యామని పలికెను
యినవమ్మ దాది కొండమ్మ దాది బలభద్రి
పోయేటి రాజుకు ఎదురుగా బోయి
మాకుల దైవము అమ్మవారు
అంకాళ పరమేశ్వరాలు వున్నాది
అమ్మవారి కొల్వుకు బోయి వచ్చినదాక
కల్యాణం బొయ్యే గంగురాజుని
యేదు గడియలు ఆగుమని చెప్పరమ్మ
గండ్రగత్తెర బెయ్యించి వాడిన బూసుకోనీ
పదివేలు దేరిన బంగారు కిరీటంబు
శిరసున ధరియించుకోని
అమ్మవారు కొల్వుకు అతి వేగ్రాన వచ్చెను
అప్పుడు అమ్మవారు అష్ట పద్మాల దేవిగిరి (యెంకు)
..................................................
వూరికి వుత్రాన వుంది వల్లకాడు (వునికి కావిం) చుకోని
కన్నెవాడి కాట్లో నీలిగుడారు యెత్తించుకోని
సూటొక్క చెల్లెంద్రతోను
పులితోలు గద్దె మీద అమ్మవారు కొల్వుదీర్చి వుండెనూ
అప్పుడు సుక్కాల సూర్యదేవి
అమ్మవార్కి తూర్పు మొకంగ దణ్ణ ప్రావణము చేశెను
పదమర మొక మాయెను పరగ దేవిగిరి యెంకు
పడమర మొకంగ వచ్చి మళ్లి దండ ప్రవాణం చేశెను
వుత్తర మొక మాయెను పరగ దేవిగిరి యెంకు
వుత్తర మొకంగా వొచ్చి మళ్లి దండ ప్రవాణం చేసెను
దక్షిణ మొక మాయెను పరగ దేవిగిరి యెంకు
దక్షిణానికి వచ్చి దండ ప్రవాణం చేసెటప్పటికి
మారచ్చి వారి మగువకూ అగ్రమైన కోపంబు వచ్చెనూ
( యినవె వోతల్లి) అష్ట ద్మాల దేవిగిరి యెంకు
నా పొన్న కాయవంటి శిరస్సు వుత్తరించి

నీ పాదాల కాడ పడ కానుకులు జేతు
నా గర్భములో వున్న..... దీసినీకు నరిదివ్వేలు(జేతు)
అని వొళ్లొవున్న గండ్రగత్తెర జారెలు....
...సల్వనా ఫ్రానుకోబోయెను
అమ్మవారు శిరస్సు నుండి శ్రీ పాదములు దాక
గడ గడ వొణికెనూ.
ఇనవమ్మ సుక్కాల సూరద్యేవి యిన్న వించెదాను
కొల్వుకు వచ్చి అగ్రామైన కోపంబు చేసిన కారణం బేమి?
యినవమ్మ సుక్కాల సూరద్యేవి యివరంబుగాను
నాలుగు మూలలు జూపితి నవసంధులు జూపితి
కోటి రుద్రాక్షలు జూపితి కోటి భద్రాక్షలు జూపితి
కోటి లింగాలు జూపితి ........
అని విన్నవించెను అష్ట పద్మాల యెంకు
అనగానె మారక్షవారి మగువకు మహాసంతోషమాయెనూ
యినవె వో తల్లి అష్ట పద్మాల దేవిగిరి యెంకు
నీ కొమారుడు గంగు రాజును దోషకారి పినతండ్రి
కల్యాణం మీదికి పంపుచున్నారు.
మారక్ష వార్కి కులదైవమై వున్నావు
మారక్ష వార్కి యియ్యపు చుట్టమై వున్నావు
కల్యాణం మీద యుద్ధ రంగానికి కదులమని పలికె
వినవమ్మ సుక్కాల సూరద్యేవి యిన్నవించెదాను
కల్యాణం మీదికి కదిలిపొయ్యే(ను)
(మగిడి దేవగిరి)పట్నం మళ్లి పోవమ్మ
అనగానె సుక్కాల సూరద్యేవి యామని పల్కెను
యినవమ్మ అష్ట పద్మాల దేవిగిరి యెంకు యివరంబుగాను
నమ్మరాదు నమ్మరాదు నిన్నెన నమ్మరాదు
పక్షుల పాలకి పరగ నీవు యెక్కి
గంగురాజు దళములోకి కదలి పోతెగాని
మగిడి దేవగిరి పట్నం మళ్లిపోను
అనగానె అమ్మవారు యే మార్గాన పైనం అవుతున్నాది
కట్టింధి అమ్మవారు కనక మాంధూళి చీరె

కాళ్ల పెనుగాడగాను
తొడిగింధి అమ్మవారు తొమ్మిది కొల్కు్ల దంతాపు రవికె
వీపున పిక్కటిల్ల గాను
యేసింధి అమ్మవారు యేనుగ తొండామంత కీలుకంట శికయు
యెన్నున జీరాడగాను
నక్షిత్ర వీరామండలి నాగ భైంకారి
త్రిపురాల గెలిచిన త్రిపురాసంహారీ
కురి కురి పాముల బట్టి కుంటేళ్లు గట్టెను
నాగు బాముల బట్టి నడికట్లు గట్టెను
జెట్టి పోతుల బట్టి చేకట్లు గట్టెనూ
వకపాటి పాముల బట్టి వడి జార గట్టెను
తాను పాములబట్టి తలసుట్టు గట్టెనూ
చిన్న చిన్న పాముల బట్టి శిరసున ధరియించినాది
ధూర్తుల మర్దించ కదుడ్డు వొక చేత
పగ రాజుల మర్దింప పముజు వక చేతా
కత్తినొక చేత గజశూల మొక చేత
పన్నెండు మెట్లది భైరపు కిన్నెరొక చేత
పన్నెండు చేతుల పన్నెండు ఆయుధాలు ధరించుకొని
అమ్మవారు బట్టెను అఖిల లోక మంతా
పక్షుల పాలకి ఎక్కెను పరగ దేవగిరి యెంకు
గంగురాజు దళములోకి గ్రక్కునా వచ్చెను
పట్టపు యేనుగ నెక్కెను పరగ గంగురాజు
ఏడడుగులు అమ్మవారికి ఎదురుగా వొచ్చెనూ
సాష్టాంగముగ అమ్మవార్కి దండప్రణామం జేసెనూ
యినవమ్మ వో తల్లి అష్ట పద్మాల దేవిగిరి యెంకు
కల్యాణం మీదికి కదులుమని పల్కెను
వెరవకోయి కుమార జడియకు నీవు
నీ పాలవొచ్చిన కార్యం నా పాలవచ్చినాది
తొణ్ణు మొక్కటి లేదు దొడ్డ యేనుగావలెను

రణభేరి వెయ్యించు రాజు గంగురాజు
పన్నెండు వేల చత్రాంగి బలములు ప్రయాణమాయెను
కదిలెను రాజు కల్యాణం మీదికి
రాంగ రాంగ వొచ్చేటప్పటికి
యేడేడు సముద్రాలు యెగ బెరిగి వచ్చెను
యేడు సముద్రాల వంక జూచి రాజు గంగురాజు
ఘడ గడ వొణికెనూ
ఇనవమ్మ ఓ తల్లి అష్ట పద్మాల దేవిగిరి యెంకు
ఇది యేమి సోద్యవమ్మ అష్ట పద్మాల యెంకు?
ఏడేడు సముద్రాలు ఏ మార్గాన దాటు వలె కోమార?
ఇనవమ్మ వో తల్లి అష్ట పద్మాల యెంకు
ఆ మాయ మాత్యం నీకె కాని నాకు తెలియదమ్మ
అనగానె అమ్మవారు కచ్చపాల వీబూది కైమంత్రించి
ఏడేడు సముద్రాల మీద యేసేటప్పటికి
వుబికి మీదై వొచ్చే నీళ్లు కిందై పోయెను
యేడేడు సముద్రాల దాటించినాది
ఏడు సముద్రాల కడవొడ్డు
ఆది శేషుడు మటముపున్నాది
ఆది శేషుడు ఘళములో గుండ కల్యాణం బాట
మార్గమూ వున్నదోయి కోమార
ఆ మాయ మాత్యం నీకే కాని నాకు తెలియదమ్మ
ఇక్కడ నేను మాయమౌతాను
నా శిరస్సు దీసి నాగస్వరము కాయ గావించు
నాయుగర్లు దీసి వొలుగులు గావించు
నా శిరస్సులో మెదడు దీసి మైనం గావించు
ఆదిశేషుణ్ణి ఆడిస్తి వంటైన
కల్యాణం మీదికి బాట మార్గము దొరకు నోయి కుమార
అచ్చోట మాయ మాయెను అంకాళశక్తి
అమ్మవారి శిరస్సు వుత్తరించినాడు నాగస్వరంగావించినాడు

హస్తములు ఖండించి వొలుగులు కావించినాడు
మెదడు దీసి మైనం గావించినాడు
ఆదిశేషుణ్ణి గంగురాజు ఆడిస్తున్నాడు
శ్రీ దర్వు ఏక తాళం:
"సుట్టేడు సముద్రాలు నట్టు నడుమననూ
పెట్టివున్నది పాము సూపెట్టి వున్నది పాము.
యంత సక్కని నాగుబాము
వెయ్యి శిరసులు గల నాగుబాము
పావణాలెల్లమ్మ పషిడి గద్దెల మీద
పండి వున్నది నాగుబాము
పండి వున్నది నాగుబాము
యంత సక్కని నాగుబాము
వెయ్యి శిరసులు గల నాగుబాము
గోపాల కృష్ణమ్మ గోవులు గాచేనాడు
కొండనున్నది నాగుబాము
కొండనున్నది నాగుబాము
ఎంత సక్కని నాగుబాము.
ఎయ్యి శిరసులు గల నాగుబాము!"
ఆడి పాడించి పామును అటసొక్కించీ
కన్ను మూసి కన్న తెరచేటప్పటికి
ఆది శేషుడు మటము దాటించినాది
ఆదిశేషుడు కడవొద్దున బండి
వీర (మహంకాళి కా) విలి వున్నాది
వుక్కుదికొర్రు యినపది కొర్రు
యిత్తడిది కొర్రు కంచుది కొర్రు
కలయెండిది కొర్రు... గిది కొర్రు వట్టుడది కొర్రు
ఏడు కొర్రుల కాడ బండి వీర మహంకాళి చెడ్డది కొడుకా
ఆ మాయ మాత్యం నీకె కాని నాకు తెలియదన్నాడు.
కొర్రకూటి కుంభాలు కొండల పొడుగు
వారి కూటి కూంభాలు వాములా పొడుగు
జొన్న కూటి కుంభాలు జోకులా పొడుగు

సజ్జకూటి కుంభాలు సారాయి బిందెలూ
యిలాగు యాగము కావించినాడు మార్తక్షరాజు
కుంభాలు ఆరగించి కూటి సొక్కులు బట్టెను
కన్నుమూసి కన్ను తెరిచేటప్పటికి
బండి వీరమహంకాళి మటము దాటించినాది
బండివీరా మహంకాళి మటము దాపునా బాలమండలపు
కోట
యినవోయి కోమార రాజుగంగరాజు
యీ మార్గాన బోతే
బాల మండలపు కోట స్వాధీనంగాదు కోమార!
మన దళములు మనమున్ను
యేడు లక్షల యెరికలు సోదిగాళ్ళ గావించుకోని
ఆశ్వాలనన్నిటిని గాడిదల గావించుకోని
యేనుగుల నన్నిటిని పందుల గావించుకోని
లొటిపిటలన్నిటిని జాగిలాల గావించుకోని
ఈ మార్గాన బోతె గాని
బాలమండలపు కోట మనకు స్వాధీనం గాదు
ఆ మాటకు గంగురాజు అపుడిట్లగనియె
కాదన అవునన కర్త(వు) నీవు
ఆ మాయ నీకె గాని నాకు తెలియదమ్మ
సంతోషపడి అష్టపద్మాల యెంకు
అంకాళ పరిమేశ్వరాలు
అశ్వాలనన్నిటిని గాడిదలు గావించెను
ఏనుగుల నన్నిటిని పందులు గావించెను
లొటిపిటలనన్నిటిని జాగిలాలు గావించెను
రగుతులందర్నీ ఎరికలు సోడిగాండ్ల గావించెను
అమ్మవారు ఒక ఎరుకల నాంచారి ఆయెను
శాషదంతమనియేటి తలచిక్కు దువ్వి
పదార్థమనియేటి పాపట దీర్చి
నున్నంగ పాపిడి సందునా నూనె పంక్షించి

వెంట్రుకలు జడదీర్చి యేలుముడివేశి
చెషపడిగెలబిల్ల జడను ధరియించి
తనవరుగు సూర్యచంద్రులా తాప్తము చేశి
తిన్నగా లలాటమున తిరుమణి ధరయించె
కన్నులకు సన్నంగ కాటుక బెట్టి
ముత్యాల చేరులు ముంగమురుగులును
ఆణిముత్యము అద్దిన నత్తు ధరియించె
కోన చెవు జంపులు కొన్ని యాలాడగాను
మట్టెలు పిల్లెండ్లు మద్దె కాయలును
కూర్చిన జలతారు కుషంబి రవికె
కంశములు పరికించి గోరుముడి వైచి
బ(టువులు) మెడ నూళ్ళు బాజి బొందులును
గొలుసులు పులిగోళ్ళు గుండ్ల పేరులును
అంధముగ సంధిట బాజి బొందులును
నడుము ఒడ్డాణం నార వొన్నె చీరె
పట్టెడ వడ్డాణము పైమొలను గట్టి
కలయ చేతులు మంచి కాళ్ళ అందెలును
ఎండి మట్టెలు సరస యాళ్ళ పిల్లెండ్లు
అన్నియు ధరియించి అంకాళ శక్తి
చెక్కిట చేతులు చంప గొలుసులును
పుక్కిట విడెయము బూది మేననను
మాయ ఎరుకుల బుట్ట శిరసున ధరియించుకోని
యెరుకుల చిన్నెలు దాల్చి బాలను సంకను బెట్టుకోని
ప్రబత్తె బట్టుక వొచ్చెను వాడ వాడలాను
శ్రీ॥ దర్వు॥ ఏ వూరు ఏ వాడ ఎరుకుల్ల సాని! ఎరుకుల్ల సాని!
పదము పాద పట్నము పణతి మావాడ। పణతి మావాడ।
కర్ణ వైకుంఠము మాకన్నవాడ మా కన్నవాడ
పుడమిలో తిరుపతి పుట్టిల్లు భామా। పుట్టిల్లు మాది।
చినకంచి పెదకంచి మాయత్తవాడా। మా యత్తవాడ
తరుణిరో! శ్రీహరి మాతల్లిదండ్రి। మాతల్లిదండ్రి।

తొలగాని హరిభక్తి మాతోడునీడా। మా తోడునీడా।
సకియ తిరు ఎరికలసాని నా పేరు। సాని నా పేరు
యెరుకో యవ్వ యెరుక మాయంబెదుమాన యెరు(క)
..............................లు యెరుక
తూర్పుద్వారాన గా చేవించితి యెరుకా
యేరుకోయని వుత్తరపుద్వా(రాన) ...... (యె)రుకా
యెరుకో యవ్వ
పడమర ద్వారాన బాగు చేయించితి యెదుకా
దక్షిణపు ద్వారాన భద్రాసి బట్టి....
యెరుకో యవ్వ యెరుకా మా అంచెరుమ.... యెరుకా
నెత్తిని యెరుకుల బుట్ట నెరవంఖ సుట్టా
బిత్తరా సూపులు బిడ్డనొకవంక
కొత్తంగ ధరియించె కొల్లపురమ్మను
మాయబాలను మరిసంక ధరియించుకోని
అప్పుడు రాజు గంగురాజు యే మార్గాన పైన మాయెను
సంకను సువ్వలు భుజాన కంబడి
ముడ్డిని కొడవలి
రాజు గంగురాజు ఎరికల సోదిగాడాయెను
అప్పుడు అమ్మవారు ఆడు వాక్యములు
యినవోయి కోమార రాజు గంగురాజు
మన దళములు మనమున్ను
బాల మండలపు కోట చుట్టు దిగంగానె
మధ్యానపు వేళ బాలమండలపు గంగు
మాయ కలలుగంటాది
కలగని దాదులతో చెప్పచుండంగానె
ఆ కల నేను చెప్పబొయ్యేటప్పుడు
వారి కోటలో గుర్రమంత నీలం
యేనుగంత పచ్చ వున్నాది
ఆ గుర్రమంత నీలం
యేనగింత పచ్చ నా బుట్టలో ధరియించగనె
బొటిమెనేల తేపుతాను చిటికెనేల చిమ్ముతాను

యెగిచినా యెరుకుల బుట్ట వచ్చి
నీ డేరా మీద వ్రాలంగనె
రణభేరి వేయించు రాజు గంగురాజా!
అని కదిలెను గంగురాజు కల్యాణం మీదికి
అప్పుడు బాల మండలపు గంగు కాని కలగంటువున్నాది
ఆర్గురు మరుదులు శిరస్సులు ఉత్తరించ కలగనెనూ
వకరాజు శిరస్సు యెండి పల్యాన పెట్ట కలగనెనూ
వకరాజు శిరస్సు పైడి పల్యాన పెట్ట కలగనెను
వకరాజు శిరస్సు పట్టువస్త్రాన పొదగ కలగనెను
ముగ్గురు రాజుల శిరస్సులు ముంగల పొగంబెట్ట కలగనెను
అదింగాక పగరాజు దళములు మనదళములు కలసి పోట్లాడి
యీావల దక్షిణాపు తల్పుగా వెరగ కలగనెను
బాలమండలపు కోటంత పట్టుచూర పట్ట కలగంటి
బాల మండలపు కోట పడిపోను కలగంటి
ఏడు కప్పెర్ల ధనము ఎత్తించుకపోను కలగంటి
కడిమి కావిడి యెంచుకపోను కలగంటి
బాల మండలపు కోట చెర సూర పట్ట కలగంటి
అధింగాక నన్ను నా యిఘుణ్ణి లకలుకలుగా విరచి
కట్టుకపోను కలగంటి
పద్నాల్గు ఘటము ఏనుగుల పట్టుక పోను కలగంటి
యీా మారాన కలలు చెప్పాతా వుండెను
బాలమండలపు గంగు
అంతలో ఎరుకల నాంచారి
తూర్పుగమిడి కాడ యెరుకోయని శబ్దంబు చేసెను
పడమిటి గమిడి కాడ యెరుకోయని శబ్దంబు చేసెను
దక్షిణా గమిడి కాడ యెరుకోయని శబ్దంబు చేసెను
వుత్తర గమిజా కాడ యెరుకోయని శబ్దంబు చేసెను
ఎరుకోయన్న శబ్దంబు బాలమండలపు (కోట చే)డులు వినిరి
ఇనవమ్మ బాల మండలపు గంగు విన్నవించెదము
ఎక్కడ నుండి వచ్చెనో ఏ స్థళం నుండి వచ్చెనో
వున్నమాట వున్నట్టు చెప్పాతాదేమో

కన్నకల కన్నట్టి చెప్పాతాదేమో
అనగానె బాలమండలపు గంగు అపుడిట్ల గనియె
తివరమున మన మేడమీదికి తోడుక రమ్మనెనూ
అనువేగ దాదులు అతివేగబోయి
పైడంధె దాదులు పరువున బోయి
మునికొని ఎరుకుల నాంచారి ముందర నిలచె
ఇనవమ్మ ఎరుకుల వాంచారి విన్నవించెదము
తీవరమున బాలమండలపు గంగు తీసుక రమ్మనెను
వొచ్చింది అందుకోసమె గనుకా
మహసంతోషపడి ఎరుకుల నాంచారి
గన మేడ మీదికి గ్రక్కున వచ్చెను
తొలదేరాజ దాటెను మలిదేరాజ దాటెను
బాలమండలపు గంగు వున్న మేడలోకి గ్రక్కున వొచ్చెను
అపుడు ఏ మార్గాన వస్తవున్నాదీ
అవ్వాయవ్వ యెరుక గోవింద వింద యెరుకా
దొడ్డ దొడ్డ రాజుల ముందర రమ్మని చెప్పితి యెరుకా
ఇటువంటి రాజుల రమ్మని చెప్పితి ఎరుకా
దర్వు|| గిద్దెడు ముత్యాలు గిలుకుల్ల బుట్ట| గిలుకుల్ల బుట్ట|
అరసోల్డు ముత్యాలు అల్లిన బుట్టా| అల్లిన బుట్టా|
సోలడు ముత్యాలు సోద్యమైన బుట్ట| సోద్యమైన బుట్ట
తవ్వెడు ముత్యాలు దాపిన బుట్ట| దాపిన బుట్ట|
మానెడు ముత్యాలు మలిశిన బుట్టా| మలిశిన బుట్ట
అద్దెడు ముత్యాలు అల్లినా బుట్ట| అల్లినా బుట్ట
కుంచెడు ముత్యాలు కుదురైన బుట్టా| కుదురైన బుట్టా|
బుట్ట పేరు భూమండలవమ్మ|
నా పేరు సక్కని యెరుకుల నాంచారి వమ్మ|
ఈ రకాన బాల మండలపు గంగువున్న మేడలోకి
అతి వేగ్రాన వొచ్చెను
తోలిదేరాజి దాటెను మలి దేరాజి దాటెను
మూడో దేరాజి దాటి రాంగానె
బాల మండలపు గంగు అమ్మవార్కి

ఏడడగులు ఎదురు వొచ్చెను
ఇనవమ్మ యెరుకుల నాంచారి విన్నవించెదాను
మా కోటలో వికల్పము నీవి చెప్పితివంటైనా
నీకు యిలవలేని సొమ్ము యిస్తువె యెరుకుల నాంచారి
అనగానె అమ్మవారు — యామనుచున్నాది
యినవమ్మ బాలమండలపు గంగు విన్నవించేము
నీవు యిన్న ముచ్చట యిన్నట్టె చెప్పేను
నీవు కన్న కల కన్నట్టె చెప్పేను
నీవు తలచిన తలంపు తలచినట్టె చెప్పేను
అనగానె బాలమండలపు గంగు ముత్యాలు గూర్చిన
కొలువు కూటములోకి తీసుక పోయెను
దంతము కూర్చిన పీట అందించి కూర్చుండమనెను
ధనము దెత్తున ఎరుకుల నాంచారి ధాన్యంబుదెత్తునా
ధనధాన్యానికి నేను వొచ్చిందానను గానమ్మ
సోకం నాకు రాదు ...... రాదు వో బాలమండలపు గంగు
ముత్యాన్కి నాయి మూడు మూటలమ్మ
వజ్రాన్కి నాయి వక్కటే మాట
పగడాన్కి నాయి పది మాటలమ్మ
అనగానె బాల మండలపు గంగు దిగ్గున లెగిచి
ముత్యాలు వజ్రాలు మణి మాణిక్యాలు
చాటకొమ్మున పోసుక యెరుకుల బుట్టమీద బెట్టెను.
చాటకొమ్మున చారెడు ముత్యాలు చేతికంటుకోని
కోరుకొండ మల్లమ్మ కోల్లపురమ్మ
పది ఆమడ వున్న పర్వతాల మల్లయ్యను ప్రార్థన జేసెను
ఏడామడ వున్న యోగభోగ లింగమును ప్రార్థన జేసెను
మూడామడ వున్న ముత్త లింగమయ్యను ప్రార్థన జేసెను
దేవిగిరి వీరన్నను ప్రార్థన జేసెను
వెయ్యి చేతికి విచ్చె చెప్పమనె యెరుకా
||దర్వు|| అవాయవ్వ యెరుక జెప్పాదునమ్మ
బంగరు తల్లి యెరుక జెప్పాదునమ్మ

ఇంధరిలోను యెరుక జెప్పేదునమ్మ
అమ్మ అమ్మలార యెరుక జెప్పేదునమ్మ
యెరుక జెప్పేదునమ్మ యెల్మితోడుత మంచి
కల్మిబల్మి చెప్పేదు కడుపున కొడుకులు బుట్టా
యెరుక జెప్పేదునమ్మ
అన్నభార్య వదినగారు అదృష్టముతో నుండె
పురిటి తగవు దెచ్చి బుద్దులు చేతులో బెట్టి
యెరుక జెప్పేదునమ్మ
మెచ్చి మేనకోడలకు మెడను బొందులు జుట్టి
యెరుక జెప్పేదనమ్మ
అన్నకు కొడుకులు బుట్టా ఆడబిడ్డకు దైతలు బుట్టా
అత్తకు తల్లికి మనమలు ఆడుచు పాడుచు నుండు
యెరుక జెప్పేదనమ్మ ||
అంటు ముట్టు లేని దైవం అంకిలిసో కూడినాను
మాసకమ్మ కీడు వుండినా మారునీళ్ళ సూలవుండినా
కడుపులోను చిక్కులుండినా కాన్పులు లేకుండినాను
ఎదురు సోమిడి తగిలి యుండినా యెనక సంతు లేకపోయినా
సూపిడి సోగిన బొందికి సుకము దుఖ్ఖము లేక యుండినా
బాలింత కోలలాడె బాలలు బ్రతుకరు తల్లి
యెరుక జెప్పేతానమ్మ
కడుపులోను కొంత నష్టి కలిగి లేకుండ నష్టి
పురిటిలోను బూత నష్టి పుట్టుకుంటే శూల నష్టి
కాళ్ళ ముందల గర్భ నష్టి కలిగితే కుండ నష్టి
సందు నష్టి చిందు నష్టి సంతు లేక పోతి నష్టి
పెద్దల పెరుమాళ నష్టి, పెట్టకుంటె మొగలి నష్టి
ఇన్ని నష్టలు యూకముగా యంట బెట్టుకపోత కొడకా
కోల గొట్టి బాల బుట్టి యేరు గట్టి పోతారావె
మైల కోక విడచి తెల్ల మాజెదుకోక గట్టుకా
వుప్పేవుల్లి మెరబగాయ వొడినిండ గట్టుకోని
ముంతనిండ నీళ్ళు బట్టుకా మొండెతోటి కోల్లు బట్టుకా

దంట మనిషిని యెంట బెట్టుకొ తానం మొగని దల్చుకుంటా
యిరుగు పొరుగు అక్కలాను అందరిని బిలిపించవమ్మ
అందరీ పిలిచి పీటలెయ్యి ఆలస్యమాయె వేగరావె
ఇతర మెరుగని, పెద్ద మనుషులు ఇద్దరు గద్దెక్కరమ్మ
పొందుగా బుట్టకి మ్రొక్కు సందడి శాయకు తరచు
చల్లగా జోకాల భిట్టు పదులు జెప్పదునమ్మ
వద్దెవారికి సొంపుగాను
సుద్దులు గావె నా తల్లి అబద్ధములు సెప్పనమ్మ
వాడకు కీడు లేకుండ కోడిని దెప్పించవమ్మ
జోడుగొచ్చి రచిప్పలమ్మ వీడకే ఆ రాములమ్మ
రవికె విడచి కోక విడచి మైల గోక మల్ల గట్టుక
తెల్లకోక నల్ల రవిక వీడకే మా కేలనమ్మ
తెల్ల నూలు, నల్ల నూలు తొగర, మూడు కూడ గట్టి
పసుపు బూసి దూపమేసి బాగం జేసి పోత కుండక
కీడు దీసి తాడుగడత పాడి బత్తైను తోలిపెట్టు
కోరిన గట్టె తాడు కొల్లాపురమ్మ తోడు
కోల్లేటి పెద్దమ్మ తోడు
మావూరాలెల్లమ్మ తోడు మంగళగిరి నరసింహతోడు
కంచి కామాక్షి తోడు కనకదుర్గమ్మ తోడు
శ్రీ రంగనాథుని తోడు చింత లేదె యెత్తి తల్లి
సంతు నా సంకనున్నది సక్కగ జెప్పతా కొడక
తక్కులు గావు నీ చోట బొంకులు రావె నానోట
చెయి జూపి చెడరొ నీ చెంత బలమున్నదమ్మ
చెంకె లేని ప్రదువులున్నయి
అన్న మూర్తములున్నయమ్మ అవిది లేని బ్రతుకులున్నయి
పాప నీ మగనికి నీకు
కృష్ణరేకలున్నయ్యయమ్మ కూర్చుండి తింటవె తల్లి
బాగ్యవంతురాలవమ్మ బలము చేకూడినాను
పొలతిరో నీవు పుట్టినిల్లు పొందుగా వర్ణింతునేను
కాంత నిన్ను గన్న తల్లి యెంత భాగ్యవతో గాని

మాణిక్యాల మగువ గన్నది రాజ్యమేలే రమణిగన్నది
అన్నల పైదోడవమ్మ అంశగల తల్లివే కొడక
దొడ్డవారి బిడ్డవమ్మ చక్కె చేయకు ఎట్టికొడక
నిరుడు వచ్చినోరు వోరిగంటి చంబుణికి జెప్పలేదా
దొరకి కొడుకుట్టలేదా దొడ్డ దోపులివ్వలేదా
డిగ్గన లెగచి పోవమ్మా
సక్కగ యింట్లోకిబోయి సాంబ్రాణి దూపమేసి
మొగుడు రాను మొక్కుకోవె
మూలదొంతి కుండలోను మూతాల్యాల బరిణ వుండది
సొమ్ములైతే సాల వున్నవి
అన్ని సొమ్ములు నాకు యేల ఆశ గాదె యెట్టే తల్లి
నీ ముంగరా దెచ్చియ్యవమ్మ ముడుపు గడత కొల్లాపురికి
కొల్లపురికి బెల్ల మెట్టు బుట్ట కడిగి బువ్వ పెట్టు
బుద్ధిమంతురాలవమ్మ పిల్లకిన్ని పాలు పోయి
సల్ల మెతుకులు గల్పి ఎరుకుల సాని ఆకలి దీర్చవమ్మ
ఊరుగాయ బద్ద పెట్టి వుప్పువేసి గంజి పొయ్యి
ఆద చేసిన సొమ్ము వుంటె అంత దెచ్చి నా బుట్ట నింపు
పొలు బోయి యాగ రావమ్మ
అవ్వోయవ్వ పొరుగూర నుండరాదమ్మ
మసిలి కాపురమైన వినలేని మొగుడైన
మా పై జాతి కులము వార్కి మారు మానం గద్దు కాని
అద్దు దప్పి తిరుగరాదమ్మ అవ్వోయవ్వ
పోద్ద ........లాగ రావమ్మ
అవ్వోయవ్వ పొరుగూర నుండరాదమ్మ
అడలిడే వీడదిరిగినా విడిదిని జేరి వుంటే గాని
మొగని నమ్మించలేవమ్మ
అవ్వోయవ్వ పొద్దు పోయె యేగరావమ్మ
అవ్వోయవ్వ పోరుగూర నుండరాదమ్మ
అని విట్లు ఎఱుకుల నాంచారి యెఱుకు తాజెప్పెను

నాకు వాకు రాదు వాకు రాదు బాలమండలపు గంగు
నీకు ఎందుకు వాకు రాదు ఎఱుకుల నాంచారి
నీ మూాడు వేలు జేసే ముద్దుటుంగరంబు
నా బుట్టకి ధరియించక కాని
నాకు వాకు రాదు బాలమండలపు గంగు
నీ నాల్గువేలు జేసేది నందుల వడ్డాణం
నా బుట్టకి ధరియించకాగాని
నాకు వాకు రాదు గదె బాలమండలపు గంగు
నీ యేడువేలు చేసేది యెన్నముద్దా కంఠమాలా
నా బుట్టకు ధరియించక కాని నాకు వాకు రాదమ్మ
నీ పదివేలు చేసేది పక్షల కంఠమాల
నా బుట్టకు దరియించక గాని నాకు వాకు రాదమ్మ
నీ యేడుగురు తోడికోడండ్లు బెట్టుకునే
ఏడు వారాల సొమ్ములు నా బుట్టకు ధరియించక కాని
నాకు వాకు రాదు గదె బాలమండలపు గంగు
మీ యేడుగురు తోడికోడండ్లు గట్టుకునె
ఏడు చీర రవికెలూనూ
నా బుట్టకు నాకు ధరియించక కాని
నాకు వాకు రాదమ్మ వో బాల మండలపు గంగు
మీ కోటలో వున్న యేనుగంత పచ్చ
గుఱ్ఱమంత నీలం
నా బుట్టకు ధరియించక కాని
నాకు వాకు రాదు గదే బాలమండలపు గంగు
అనగానె బాలమండలపు గంగు యీామని పలికె
దాదులార ! దాదులార ! ఓ దాదులార!
ఇది యెఱుకల నాంచారి గాదు ఏగుల నాంచారి
పట్టు పగ్గాలు దెచ్చి దీన్ని గాజు స్తంభాన్కి కట్టమన్నాది
పట్టు పగ్గాలు దెచ్చి కట్టవచ్చినపుడె
బుట్టలో కొల్లాపురమ్మ బైటికి తీసి
బాలమండలపు గంగుకు ముమ్మాారు దిగదుడిచి నాది
మచ్చెడిపోయెను బాలమండలపు గంగుకు

ఆఱువేలుజేసె ముద్దుటుంగరంబు
నాలుగువేలు జేసె నందుల వడ్డాణం
రెండువేలు జేసేది యెన్నముద్ద కంఠమాల
పది వేలు చేసేది బన్న సరము ఇచ్చెను
యేడుగురు తోడికోడండ్లు యేడువారాల సొమ్ములు
యేడు చీర రవికెలూను
మొదలుకొని యెఱుకల బుట్టమీద బెట్టెను
కోటలో గుజ్జమంత నీలం ఏనుగంత పచ్చ
ఎఱుకల బుట్టకు దరెయించంగనె
ఫక్కువ నవ్వినాది పరగ దేవిగిరి యెంకూ
ఎరుకోయని శబ్దమేసె యెఱుకల నాంచారి
చెయ్యి చేతికి విచ్చె చెప్పమని యెఱుకు
ఏమిచెప్పేదునమ్మ బాలమండలపు గంగా!
నీవు కన్నకల కన్నట్టె చెపుతాను
నీవు కానికల కని .....బాలమండలపు గంగు
మీ రాపు కలలు గని నిద్ర మేలుకొంటివి
ఎవ్వరో పగరాజులు వచ్చి .......
పాడువా కల గంటివి నీ గంగు
..................కలగంటివి బాలమండలపు గంగు
ఈ కల కష్టా ? లేదా ? బాలమండలపు గంగు?
ఈ కల కష్టంటివి
ఈ కల కష్ట బాల మండలపు గంగు?
కష్టమ్మ ఈ కల కష్టమ్మ తల్లి!
బాలమండలపు కోటంత పట్టచూర పట్ట కలగంటివి
అదింగాక నిన్ను నీ యిబుణ్ణే లకలుకలుగా విరగబొడిచి
నడిమి కావిడుంచుక పోను కలగంటివి
నీ బాలమండలపు కోటంత పట్టచూర పట్ట కలగంటివి
బాల మండలపు గంగు
అనగానె బాల మండలపు గంగు యామనుచున్నాది
ఇనరమ్మ దాదులార యివరమ్మగాను

అది యెఱుకల నాంచారి గాదు యేగుల నాంచారి
పట్టు పగ్గాలు దెచ్చి కట్టు మన్నాది
వద్ద వున్న దాదులు వైళంబు లెగచి
విరచి కట్టి వచ్చిన విధము తాజూచి
ధిగ్గన లెగచి అమ్మవారు ఎడమ కాలతో
ఎఱుకుల బుట్ట ఏడు వోజనాలు ఎగజిమ్మినాది
ఎగిచిన యెఱుకుల బుట్ట అంత్ర మద్యాన ఆడుతావున్నది
ఇనరమ్మ దాదులార ఇన్నవించేను
ఆనకె నన్ను కట్టేరుగాని
అంత్ర మద్యమున ఆడేది అది యేమి సోద్యము
కట్టవచ్చిన పరిచారికలు
అంత్ర మధ్యం వంక సూస్త వున్నారు
అచ్చోట మాయమాయను అంకాళ శత్తి
ఎగిరెను ఎఱుకుల బుట్ట
గంగురాజు డేరా మీద గళ్ళునా పడెను
రణభేరి వేయించె రాజు గంగురాజు
అమ్మవారు వచ్చె రావుల మీద పక్షని రామచిల్కాయై
గంగురాజు కుడిభుజం మీద తెప్పునా వ్రాలెను
యెరవకోయి కోమార జడియకు నీవు
నీ పాలవచ్చినా కార్యం నాపాల వచ్చినాది
పంధుల నన్నిటిని యేనిగల గావించె
గాడిదలన్నీ గుఱ్ఱాల గావించె
జాగిలాలన్నిటిని లొటిపిటలు గావించె
సోడిగాళ్ళనందర్ని రౌతుల గావించె
అచ్చోణే పన్నెండువేల చత్రంగిబలముల గావించె
అప్పుడు గంగురాజు కట్టు ఆయితా పడెను
అగువుగా బిగుచల్లణం లాగు తా దొడిగె
పన్నెండు మూళ్ళ పట్టరట్టు అమరంగ గట్టెను
చంధిర్కామనేటి తలపాగ జుట్టెను
ముత్యాల తురాయి ముంధుగా ధరియించె
వలపట వజ్రాల వంకిణే గట్టె

దాపట పచ్చల బ్బాకైన గట్టి
పింజముల దండ మీద పిగిలి సోగలును
అక్షింతలు గందము అలర పన్నీరు
ఇదార్తుడు ఇచ్చిన ఇల్లు నంచందె
కమ్మకుడు ఇచ్చిన గండ్ర గొడ్డలి అందెను
విష్ణు బ్రహ్మ ఇచ్చిన చక్రంబు అందెను
ఇదియనె కోరుడం కటారి కోల అస్తాన బట్టెను
దట్టి ముప్పైరెండు ఆయుధాలతోను కట్టాయిత పడెను
............... రాజు పంచకల్యాణి అనియేటి అశ్వ......
(కంచు రణభేరి వేయించె కదిలె) గంగురాజు
రణభేరి మ్రోతకు దెస పన్నెండు ఆమడ
(పొడుగున) వు (న్న ధళములు పైనం) బు లాయెను
కయ్యమంటె మాచాక్షరాజులు కాలు (దువ్వే)రు
పోరంటె మాచాక్షరాజులు బోరుకొాల్లేరూ
సావంటె మాచాక్షరాజులు సంతోషపడుదురూ
ఆడితే తప్పరు ఆచార్యపరులు
పల్కితే బొంకరు పర్మపుణ్యులును
అటుమంటి మాచాక్షరాజులు
ఏ విధంబున పయనంబులైరి
తొమ్మండుగురు బాల గోయిందరాజులు
తొమ్మిది గజముల నెక్కిరి
అమ్మవాడు అష్టపద్మాల దేవిగిరి యెంకు
పచ్చని పల్లకి యెక్కెను
ఘుబులు గుబులున రెణభేరి కూచి శెయ్యించెనూ
ఆ రణభేరి మ్రోతలు బాలమండలపు రాజులు వినిరి
అనుచు తన పాండవుల అందర్ని పిలచి
పనిపూని జెట్టిలకు పైనంబు జెప్పిరి
దానంబులు చేత తరుచుగా బన్నిరి
కొంచక అటువేశి కొయ్య వడిచెండ్లు
కట్టింపగల యట్టి గజ బాణమూలు

గుంట క్రోవులు జివ్వర జుంగీలు కుంభిణే అధురా
బళబళ పింగీలు ఆవలీవల యెత్తించిరి ఆ కోట మీద
అపుడు బాలమండలపు రాజులు
దట్టిముపై రెండు ఆయుధముల తోను
కట్టా అయుత పడిరి
బాలమండలపు కోట మీదికి
అష్టపద్మాల యెంకు రాజు గంగురాజు అదిగొని కదిలె
గుఱ్ఱాలు నడువంగా గుప్పె రవధూళి
యేనుగులు నడువంగ యెగిచె రవధూళి
యిర్వై వక్క దళముతో వేగంబె కదిలె
వెయ్యివేలు తుపాకులు వక్క వేటున కదిచిరి
పైపైన ఫిరంగీలు పెళ్ళున కథించె
పొగ బాణములు గాల్చిరి అశ్వాల తోలిరి
పొగ బాణములు శిరస్సులు పొర్లాడగాను
బాల మండలపు రాజుల ధళము
మూరాక్ష రాజుల దళము
కథిచి పోట్లాడిరి దక్షణపు తల్పుగా వొరిగిరి
అప్పుడు గంగురాజు
ఏ విధమున యుద్ధము చేయుచున్నాడు
విధార్తుడు విచ్చిన విల్లెనంబు అందెను
కనకతో అంబుల కదిచి వెయ్యంగనూ
ఘళ్ళుమనగాను గట్లు తెగబొడిచె
బ్రంహ్వాస్త్రమనియేటి బాణంబు దీసెను
గంధమచ్చింతలు గనపూజ చేశెను
బంధూర ధూప దీప నైవేద్యము చేశిరి
నా మీద కృప గల్గి నన్ను గెలిపిస్తివా
భూజనంబుగా నిన్ను పూజింతు భాణమును
భాణము యెక్కు బెట్టెను పరగ గంగురాజు
చెదరి చెదరి ముయ్యేడు అక్షోణి లక్షోణి బాణాలై
బాలమండలపు రాజులతో నీవు యుద్ధము చేశి
జొటజొట రక్తముతో

నా పోదితో చేరవె బాణమా
అని వింటును బాణముంచి యెక్కించెను
..... మేము యోజనాల పొడవు
.......మిణుగురులు .....నిమ్మచు
మిణుగురులు గుప్పుచు పొగలు
చెదరి చెదరి (మామయ్యేడు అక్షోణి లక్షోణి బాణాస్త్ర)
అగలంగ పొగలంగ చదర
గుబగుబ బొడిచెను గుబులు కొనగా
నిల్వనుని ముగ్గురుని నాటించి పొడిచె
పక్కిణి రవుతుల డొక్కలు చీరెను
ఒకకోటి రహుతుల కీళ్ళు తెగనరికె
పొదలతో నొరబడి పొంచున్న వారిని
బట్ట బైటికి దీచి పొట్టలు చీరె
అమ్మగొచ్చె ననువారు యమగొచ్చె ననువారు
బిట్టుకోమనువారు పారిపోవువారు
తోకలకు కళ్లెములు తొడిగేటివారు
గాదిగుఱ్ఱాల మీద బడి పొయ్యేటివారు
బాలమందిలపురాజు దళము
మహారాజ్ఞరాజు దళము కదిచి పోట్లాడిరి
పదివిధముల దక్షణాపు తల్పుగా వారిగిరి
తొలుపోట రక్తము తోటి రాజు గంగురాజు బాణము
పొదిలో చేరినయపుడె
గంగురాజుకు తెలచి గ్రక్కున వొచ్చి
ఒక రెండు భుజములు గంగురాజుకు దళదాయ బెరిగి
రెండు చేతులకు రెండు పటాలు దొడిగి
కుడి మీసం దువ్వి గుడ్లెర్రజేసె
బాకాళు పెంణ్నము గళ్ళన తాటించినాడు
యుషే అనె కోడుడు కఠారి కోల అస్త్రాన బట్టెను
బాలమందలపురాజులు గంగురాజు కదిచి యుద్ధము చేశెను
మేమగుడు రాజులతో
అష్టదం శిరస్సులు వుత్తరించినాడు రాజు గంగురాజు

పెద్దవాడు బాలమండలపురాజుని విరచి కట్టించెను
తూర్పున మొదల బెట్టి పడమరికి నరికెను
పడమర మొదలు బెట్టి దక్షిణానికి నరికెను
దక్షాణాన మొదలుబెట్టి వుత్రాన్కి నరికెను
వూసకోత సూరకోత కోశెను రాజు గంగురాజు
గర్భిణితో వున్న స్త్రీలను కడుపులు చించి
పిల్లనక గొంతులు గోసెను రాజు గంగురాజు
బాల మండలపు రాజుని బాల మండలపు గంగుని
లకాలుకాలుగా విరచి కట్టించెను
నడిమి కావిడి వెయ్యించినాడు
బాలమండలపు కోటంత పట్టుచూర పట్టించినాడు
బాల మండలపుకోట చరసూర పట్టించి చడబాడిపించినాడు
యేడు కప్పెర్ల ధనమంత యెత్తించె రాజు
పధ్నాల్గు గటము యేనుగుల మీద పట్టించుకోని
అదిరేటి మొండెములు ఆవలించు శిరస్సులు
గీపెట్టు యేనుగులు బోపెట్టు లొటి పిటలు
అంతయు బలమెల్ల అవనిపై గూల్చె
కరములు శిరములు కన్నులు వేళ్ళును
నరములు శిరములు నడుములు వేళ్ళును
జిలుగు సన్నాపు నూలు చిక్కుపడ్డట్లు
కొరుడు నెగవెయ్యగా
అంతయు బలమెల్ల అవనిపై గూలె
అప్పుడు అమ్మవారు యీమనుచున్నాదీ
(యినవోయి కోమార ) రాజు గంగురాజ!
మ (గిడి దేవగిరి కోటకు మళ్ళి) పోదాము
ఆ మాటకు రాజు గంగురాజు అపుడిట్లగనియె
యినవమ్మ వో (అష్టపద్మాల) యెంకు
మగిడి దేవగిరి పట్నం (మళ్ళిపోదాము)
పంచమా పాపాత్ముడు కులకర్ముడు
సకల సామిద్రోయిండు కానరహింద్రుడు

నన్ను పరింగల కోటకు పొలు శాస్తాడు
పరింగల కోట యుద్ధము చేసి
మగిడి దేవిగిరి కోటకు మళ్ళిపోదాము
ఆ మాటకు అమ్మవారు యీమనుచున్నాది
వినవోయి కొమారా విన్నవించెదాను
పరింగకోట వేళేటి పధ్నాల్గురు పరింగదొరలు
వొక్కొక్క పరింగవాన్కి
పన్నెండు వేల చత్రంగి బలము వున్నాది
పరింగ కోట మీద యుద్ధం చాయలేవు కూమార
యినవమ్మ వో తల్లి అష్ట పద్మాల యెంకు
నీవె కనక నాకు సాయమైతేను
నాకు ఎదురు బంటుచు లేడు యే దేశ మందు
యిందున పోట్లాడి యెందునా గెల్తు
రాజుల సంహరించి రణమందు గెల్తు
స్వాతి కొంగలు యెన్నైనా సాల్వను బోలునా?
పగరాజు దళము యెన్నైన స్వాతి కొంగల మారు
స్వాతి కొంగల మీదికి నేను సాల్వ వంటివాడను
దూది కొండలు యెన్నైనా మిణుగురును బోలునా?
పగరాజుల దళము పసువుల గుంపుల మారు
పశువుల గుంపుల మీదికి బొబ్బిలి అంటివాడనమ్మ
యినవో తల్లి అష్టపద్మాల యెంకు
పగరాజుల దళము గజాల మారు
గజముల మీదకి నేను వొక సింహంవంటివాడనమ్మ
యినవమ్మ అష్టపద్మాల దేవిగిరి యెంకమ్మ
పగరాజుల దళాలు సముద్రాల మారు
సముద్రాల మీదకి యలగ పండంటె వాడనమ్మ
అనగానె అమ్మవారు యీమనుచున్నాది
యినవోయి కోమార రాజు గంగురాజ!
సముద్రాల మీద యలగపండు వేశితే
యే రేవు నా కాతువోయి కోమార
యినవె అష్ట పద్మాల యెంకు

సముద్రాల మీద యెలగపండు వేశితె
యే రేవు కన్నా తేలగాని తేలకపోదు
యేదో వక వేర్పున పరింగల కోట మీద
యుద్ధము శాయవలె మనము
మగిడి దేవగిరి పట్నం మళ్ళీ పోదాము
ఆ మాటకు అమ్మవారు సంతోషపడెను
రెణభ్బేరి వేయించుమా రాజు గంగురాజ!
భేరీలు తమటములు పెద్ద బూరలును
నపిరీలు పిల్లన గ్రోవులు నాగస్వరములును
బూర కొమ్ములు మ్రోత బోరు కొల్వంగ
ధిమికి ధిమికియని మ్రోవ పంచమ వాయిద్యములు
కోట పట్నం వెడలి వొచ్చేటప్పటికి
పరింగల కోటకు డాయంగ వొచ్చెను
అప్పుడు అమ్మవారు యీమనుచున్నాది
యినవోయి కుమార యిన్నవించేము
యీా మార్గాన పోవంగానె
పరింగల కోట మనకు స్వాధీనంకాదు
నీ ధళములు నీవు కందకాలు త్రవ్వించుకోని
కందకాలు లోపల వుండుమని పల్కెను
ఆ మాట విని రాజు
కందకాలు త్రవ్వించి కట్టాయితా పడెను
దండు దళము రాజు గంగురాజు కంద(కములో వుం)డెరె
అక్కోట మా ............. అంకాళదేవి
యెర్రి గొల్ల బోయిడు వేషం (కట్టె)ను
కుడికాల చెప్పు యడమ కాల దొడిగెను
యడమ కాల చెప్పు కుడికాల దొడిగెను
వుగ్గపు దుత్త చాత బుచ్చుకొని
కోణతం గట్టిన జాగిలాన్ని యంట వేసుకొని
కటికి జొన్నలు వొళ్ళో బోసుకొని

అయి నవ్వులుకుంటూ గడ్డంమీద వ్రాచుకుంటి
పరింగల కోటకు అతి వేగ్రాన వొచ్చెను
అప్పుడు పధ్నాల్గురు పరింగ దొరలు
డేరా మొగసాల కాడ వారు
పగ(డ)సాల పందెంపట్టి ఆడసాగిరి
యెఱ్ఱి గొల్ల బోయిని జూచి ఆళ్ళు గళ్ళునా నవ్విరి
పధ్నాల్గు పరింగ రాజులుతోను అమ్మవారు యామనుచున్నారు.
వినరయ్య పరింగ రాజులార విన్నవించేము
పన్నెండు వేళ్ళనుంచి వున్నాను మీ పదార్థము బోంచేసినాను
నాల్గు గొఱ్ఱె పిల్లలు అపికం తుమ్మల సాటున కాసుకుంటిని
యెక్కడ నుండి వచ్చెనో పదింటి గుర్రాల వాండ్లు
మాపిటికి పరింగల కోటమీద ముచ్చిలి చాత మని
ఆలోచనం శాస్త వున్నారు
పన్నెండు వేళ్ళ నుంచి మీ పదార్థము బోంచేసినాను
మీ(కు)ను ఆనవాలు చెప్ప వొచ్చినాను
(అనం)గానె పరింగ దొరలు యామనుచున్నారు
ఖండ్ల కాపరం మధమ్మక్షరం గురుతు గానక
ఢాలులు పటాలాలు దీసుకున్నారు
యేరిరా వోరి యెఱ్ఱిగొల్ల బోయీడా!
యీరుగో రారయ్య సూపుతా రమ్మని పల్కేను
రాంగ రాంగ వొచ్చెటప్పటికి
యేరిరా వోరి యెఱ్ఱిగొల్ల బోయీడా
యీరుగో రారయ్య సూపుతా రమ్మని పల్కేను
రీరాంగరాంగ వొచ్చెటప్పటికి
యేరిరా వోరి యెఱ్ఱిగొల్ల బోయిడా!
యీరుగో రారయ్య సూపుతా రమ్మని పల్కె
కందకాల దగ్గరకు అతివేగ్రాన వొచ్చెను
యినవోయి కుమార రాజు గంగురాజ
యంబడి మేపే గొఱ్ఱె పొటేళ్ళను తోలుకు వొచ్చినాను

రెణభ్భేరి వెయ్యించు రాజు గంగురాజ!
అనగానె రాజు గంగురాజు
కందకాలలో రెణభ్భేరి గుబులు గుబులునా డోకించినాడు
ఆ రెణభ్భేరి మ్రోతకు దెస పన్నెండు ఆమడ
పొడుగున వున్నా ధళములు పైనంబులాయెను
ధళములున్ను రాజు గంగురాజును జూచి
పధ్నాల్గురు పరింగవాండ్లు తలలు విరబోసుకా పారిపోసాగిరి
అప్పుడు గంగురాజు రెండుచేతులకు రెండుపటాలు దొడిగి
గమిడి కాడకు పొయ్యేటప్పటికి
పదముగ్గురు శిరసులు వుత్తరించును పరింగవాళ్ళను
పెద్దవాణ్ణో పరింగరాజుని విరచి కట్టించెను
అప్పుడు గంగురాజు ధళము పరింగవారి ధళము కదిసిపోట్లాడిరి
దశావిధముల దక్షిణాపు తల్పుగా వొరిగిరి అందరూను
అప్పుడు గంగురాజు ఏ క్రమాన యుద్ధం చేస్తువున్నాడు.
తూర్పున మొదలు బెట్టి పడమటికి నరికెను
( పడమట మొదలు బెట్టి తూర్పుకు నరికెను)
దక్షిణం మొదలు పెట్టి వుత్తరం నరికెను
వ్రాసకోత సూరకోత కోసెను రాజు గంగురాజు
పెద్దవానిని కులపతిని
లకాలుకలుగా తొక్కి విరచికట్టినారు
పద్నాల్గు ఘటము యేనుగుల మీద పట్టించుకోని
పరింగల కోటంత పట్టు చూర పట్టించె రాజు
పరింగ కోటంత పడబొడిపించె రాజు
యేడు కప్పెర్ల ధనము యెత్తించె రాజు
గండభేరండ మనియే తూము యెత్తించె రాజు
తూము ఎత్తించేటప్పటికి
దేవగిరి పట్నంలో పంచమా పాపాత్ముడు కులాకర్ముండు
సకల సామిద్రోయిండు పినతండ్రి కాన రవింద్రుడు
కోడల మేడాకు గొబ్బున వొచ్చెను
యినవమ్మ సుక్కల సూరద్యెవి యివరంబు గాను

నా కోమారుడు గంగురాజు కల్యాణం మీద చెల్లిపోయినాడు
నేను యెటువలె దరియింతు కోడల సుక్కాల సూరద్యేవి
మారాక్ష వారింట ముండకూడు లేదు
నీవు అగ్ని గుణ్ణానకు అయుతవడు (మమ్మ)
అనగానె సుక్కాల సూరద్యేవి అపుడిట్లగనియె
యినవె వో మామ చివన్న మాద్యేవి రాజ విన్నవించెదాను
నీ కోమారుడు చెల్లిన ఆనవాలు యెటువలె వొచ్చెనో మామ
యినవమ్మ సుక్కాల సూరదేవి యిన్నవించెదాను
వలపట వజ్రాల వొంకిణి వచ్చినాది
దాపట పక్షల బ్యాకైన వచ్చినాది
పట్టు పక్షడాలు ఆనవాలు వచ్చినవి
ముత్యాల తురాయి ఆనవాలు వొచ్చినాయి
నేను యెటువలె దరయింతు సుక్కాల సూరదేవి
అగ్ని గుణ్ణాన్కి ఆయుతాపడవమ్మ
పంచమా పాపాత్ముడు కులాకర్మండు
అగ్నిగుణ్ణము యే క్రమాన ఆయుతాపరిపిస్తావున్నాడు
కాశిలు వుప్పర్ల కరువేగ బిలిచి
పారలు వెన్నూరు గడ్డపార లెన్నూరు
అతివేగ వొచ్చిరి గనుమైన వుప్పర్లు
సుక్కాల సూరదేవి గుణ్ణం అతివేగ తవ్విరి
మనిషి నిలువుడు పొడుగు మరివేగ తవ్విరి
వినవయ్య రహేంద్రుడు విన్నవించేము
సుక్కాల సూరదేవికి గుణ్ణం తవ్వినామయ్య
ఆ మాట విని రహేంద్రుడు అపుడిట్లగనియె
మంచి గంధపు తరువులు ......వులు యేపించె
నేతి శిద్దెల్కు అందపు శిద్దాలు పోపించినాడు
గుబ గుబ గుణ్ణం బగ్గున మండెను
ఆతివేగ గుణ్ణం అయుత పరపించెను
గుణ్ణం కాడకి సుక్కాల సూరదేవిని తీసుక వచ్చినారు

ముమ్మాటు గుణ్ణం సుట్టు వలంప్రారి తిరిగెను
వినవె వో మామ రవింద్రుడ నీవు
నీ కొమారుడు ఆనవాలు తెమ్మనెను యిపుడు
ఆ మాట విని రవింద్రుడు గడగడ వొణికెను
వినవమ్మ కోడల వివరంబుగాను
నా కొక్క కూమారుడు ఆనవాలు కోటలులో వుంచినాను
అయిదెచ్చి నాకు అందించమనెను
యెలియ తన కూటలకు యెంచేసినప్పుడె
పటింగ కోట కాడవుండ అమ్మవారికి దెలిసెను
వినవోయి కుమార రాజు గంగురాజ!
నీవక్క భార్య సుక్కల సూరదేవిని
అగిణి గుణ్ణానికి ఆయత పరిపించెను
ఆ మాటకు గంగురాజు యామని చెప్పచున్నాడు
వినవె వో తల్లి అష్టపద్మాల దేవిగిరి యెంకు
మగిడి దేవిగిరి పట్నానికి మళ్లి పోవమ్మ
అనగానె అమ్మవారు అంకాళి పరమేశ్వరాలు
రక్షనావుల మీద పచ్చన రామశిలకై వొచ్చెను
సుక్కల సూరదేవి కుడిభుజం మీద తప్పన వ్రాలెను
ఆనవాలు దెచ్చె రవింద్రుడు అమ్మవారిని జూశెను
గడగడ వొణికి రవింద్రుడు పారిపోవుచున్నాడు
అప్పుడు గంగురాజు యే మార్గాన వస్తావున్నాడు
ఏనుగులు నడువంగ యెగచె రవధూళి
గుఱ్ఱాలు నడువంగ గుప్పె రవధూళి
కాల బలములు నడువంగ కప్పె రవధూళి
డాలులు వెన్నూరు డమమీలు వెన్నూరు
పెద్దపెద్ద బాణాలు పెద్ద ఫిరంగీలు
(పంచమా వాద్యములు మించి మ్రోవంగ)
పొద్దు బొడిచి యేడు గడియలు యెక్కేటప్పటికి

(అక్షోణిలక్షోణి) చత్రంగి బలములు తోను
మగిడి దేవిగిరి పట్నానికి మళ్ళి వొచ్చినాడు
అగిణి గుణ్ణాం కాడ అమ్మవార్కి యేమి జేస్తావున్నాడు?
స్తంభము లేని నీలిగుడారు అమ్మవార్కి వేయించినాడు
నీలు గుడారులలో అమ్మవారు
తూర్పు మొకముగా కొల్వు దీర్చి వుండెను
అప్పుడు సుక్కల సూరద్దేవి అమ్మవారి కొలువుకు వొచ్చెను
అమ్మవారికి దండ్నంప్రమాణం చేశినయపుడె
సుక్కల సూరదేవి మొకమంక అమ్మవారు చూశిందికాదు
అప్పుడు మారాక్షరాజు గంగురాజు
పినతండ్రి కుమార్ళ్ళని వురుకి పట్టుకోని
అమ్మవారి దగ్గిరకు తీసుక వచ్చినాడు
అమ్మవారిని యేడు గడియలు యేడుకున్నాడు
అప్పుడు గంగురాజుకి చాయమైనది
యేనుగంత సత్తువ గుర్రమంత లగువు వొచ్చెను.
ఏడుగుర్ని బట్టుకొని ఏడుకోర్ల వేశినాడు
అప్పుడు అమ్మవారు అంకాళ పరమేశ్వరాలు
గంగురాజు సుక్కల సూరదేవి వంక .........
...................................గంగురాజు
పంచమా పాపాత్ముడు కులకద్మండు
సకల సామిద్రోహిణి బట్టుకోని
అగ్ని గుణ్ణములో పడవేశినాడు
అంతటు రవీంద్రుడు బగ్గున మండెను
రవీంద్రుణ్ణి జూచి అమ్మవారు పకపక నవ్వెను
వినవోయి కుమార రాజు గంగురాజ!
చాత కంకణం నొష్ట బాశికం యిప్పంస్సమనెను
ఆ మాట విన్నాడు రాజు గంగురాజు
గంగురాజు వేగ మామను పిలిపించినాడు

మేనత్త శివ్వాల కంట్లమ దేవమ్మను పిలిపించినాడు
అప్పుడు శివన్న మదేవిరాజు శివల గంట్లమ దేవమ్మ
గంగురాజు దగ్గిరకు అతివేగమున వొచ్చెను
విష్ణుభార్య శ్రీ మహాలక్ష్మి త్రి
ఈశ్వరుని భార్య పార్వతి
బ్రహ్మ భార్య సరస్వతి
త్రయుమూర్తులు దిగి వచ్చినారు.
గంగురా(జు) ................

* * *



పంబలవారు (నెల్లూరు జిల్లా)



కీ. శే. దుంపా జయరామిరెడ్డి
(1917 - 1995)



కీ. శే. దుంపా రామిరెడ్డి
(1923 - 1990)

